GRT JEWELLERS
Since 1964

# ఈ పండుగ కాలంలో సౌభాగ్యాన్ని ఇంటికి తీసుకు వెళ్ళండి.




బంగారు నగల తరుగుపై (VA)
**20%** తగ్గింపు*

రూబి, ఎమరాల్డ్ మరియు అమూల్యమైన రాళ్ళ విలువపై
**15%** తగ్గింపు*

వజ్రాలపై
**15-25%** తగ్గింపు#

*7%కు తగ్గిన తరుగు (VA) గల బంగారు ఆభరణాలకు ఈ ఆఫర్ వర్తించదు. బంగారు నాణేలు లేదా బార్లపై ఆఫర్ వర్తించదు.
ఈ ఆఫర్ ఏ ఇతర ఆఫర్‌తో జత పరచి పొందేందుకు అవకాశం ఉండదు. పరిమిత కాలపు ఆఫర్. నిబంధనలు వర్తిస్తాయి. #ఈ ఆఫర్ వజ్రాల విలువపై మాత్రమే వర్తిస్తుంది.

అద్భుతమైన డిజైన్.
ఆశ్చర్యకరమైన ధరలో.

**10% off***

అమూల్యమైన
**వజ్రాల**
నెక్లెస్ ధర కేవలం
**₹99,900***

*నియమ నిబంధనలు వర్తిస్తాయి.
పరిమిత గడువు ఆఫర్.

| GUNTUR | TIRUPATHI | VISAKHAPATNAM | | HYDERABAD | | |
| --- | --- | --- | --- | --- | --- | --- |
| BRODIPET<br>Ph: 0863-221 1515 | PRAKASAM ROAD<br>Ph: 0877-228 1515 | SAMPATH VINAYAGA TEMPLE ROAD<br>Ph: 0891-253 1515 | GAJUWAKA<br>Ph: 0891-257 1515 | CHANDA NAGAR<br>Ph: 040-4020 1515 | KUKATPALLY<br>Ph: 040-4025 1515 | SOMAJIGUDA<br>Ph: 040-2333 1515 |

Tamil Nadu | Puducherry | Karnataka

Dubai | Malaysia | Singapore

Shop online at: www.oriana.com | mail@grtjewels.com




ఆరోగ్యానికి ఒకే చిరునామా **నాగార్జున క్యాన్సర్ హాస్పిటల్**

CELEBRATING 25th ANNIVERSARY

# కలిసి నడుద్దాం-క్యాన్సర్‌ను జయిద్దాం!

క్యాన్సర్ అంటే అంతులేని భయం. శరీరంలోకి ప్రవేశించిందంటే జీవితం ముగిసిపోతుందేమోనన్న జలదరింపు. రాకాసిలా కమ్మేసే ఈ రాచపుండుకు చికిత్స ఎక్కడ చేయించుకోవాలి? చికిత్సలో భాగంగా ఎందరు వైద్యుల వద్దకు వెళ్ళాలి? ఎన్ని ఆస్పత్రులకు వెళ్ళాలి? రేడియేషన్ బంకర్‌కు వెళ్ళే ధైర్యం ఉందా? చికిత్సకు ఎంత సమయం పడుతుంది? సంబంధిత వైద్య సదుపాయాల సంగతేంటి? ఇన్ని ప్రశ్నలకు, భయాలకు, సంశయాలకు ఏకైక సమాధానం నాగార్జున క్యాన్సర్ సెంటర్.

విజయవాడ, కానూరులో సువిశాల ప్రాంగణంలో, సకల ఆధునిక వైద్య సదుపాయాలతో ఏర్పాటైన ఈ ఆస్పత్రి క్యాన్సర్ రోగులను కాపాడగల వైద్య నిలయం! ఇతర స్పెషలిస్టులు ఇరవై నాలుగుగంటలూ అవసరమైనప్పుడు అందుబాటులో ఉంటారు. ఇంటెన్సివ్ కేర్, న్యూరోసర్జరీ, గ్యాస్ట్రో ఎంటరాలజీ తదితర అనేక విభాగాల్లోని అనుభవజ్ఞులైన నిపుణుల పర్యవేక్షణ ఉంటుంది. ఆరోగ్య పరిరక్షణ ప్రమాణాలు, పేషెంట్ల భద్రతకు జాతీయస్థాయిలో మన ప్రాంతంలో గుర్తింపు పొందిన మొట్టమొదటి ఆస్పత్రి. రోగికి మానసిక స్థైర్యాన్ని, శారీరక స్వస్థతను చేకూర్చే నిపుణుల బృందం చేయూత, భరోసా! ఆహ్లాదపూరిత వాతావరణం!




క్యాన్సర్‌తో పోరాడగల అత్యుత్తమ టెక్నాలజీ ఇక్కడ ఉంది. ప్రపంచంలోనే అత్యాధునికమైన ట్రూబీమ్ రేడియోథెరపి ఇక్కడ అందుబాటులో ఉంది.



## నాగార్జున క్యాన్సర్ సెంటర్

కానూరు, విజయవాడ-7

**Toll Free No. : 1800 123 0066**



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక **స్వాతి**

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM




పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

**వేమూరి బలరామ్**


ESTABLISHED 1984 | సంపుటి 34 | 26.1.2018 | సంచిక 30

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


He is a good friend that speaks well of us behind our backs


**సీరియల్స్**

| | | |
|---|---|---|
| సామ్రాట్ సముద్రగుప్త | సి.శివరామమూర్తి | 24 |
| జై భారత్ | చిత్ర వెంకటేష్ | 38 |
| మనిషిలో మనిషి | సూర్యదేవర రామ్మోహనరావు | 50 |
| అఆఇఈ | పుట్టగంటి గోపీకృష్ణ | 64 |

**కథలు**

| | | |
|---|---|---|
| స్లీపర్ కోచ్ శోభనం | విజయార్కె | 14 |
| మతిమరుపు మొగుడు | దేవరకొండ గంగాధర రామారావు | 44 |
| పునర్జన్మ | సూర్యప్రసాదరావు | 58 |

**స్పెషల్ ఫీచర్స్**

రాజకీయంగా కోరేగామ్ యుద్ధం 8 హీలింగ్ టచ్ 10 జైహింద్ నినాదమిచ్చిన నేతాజీ 13 ప్రత్యక్ష నారాయణుడి పుట్టినరోజు 17 ఆన్‌లైన్ కొనుగోలుపై అదుపు ఎలా! 20 పేరు మహత్యం 32 పవర్ డ్రెస్సింగ్ 48 సూపర్ సూప్స్ 56 స్కూలురోజుల్లోనే ఫస్ట్ క్రష్ 62 బహుగుణాలు 69

**శీర్షికలు**

ఒక చిన్నమాట 7 అంతా రాజకీయమే 18 ఐ లవ్ మనీ 19 నేనెవరో తెలుసా! 22 ఆత్రేయ మధురగీతాలు 23 పర్సనల్ ఎజెండా 29 అనిల్ 30 వరఫలం 34 ఫర్ U 35 సెక్స్&సైకాలజీ 36 బాపుబొమ్మ 43 సత్యాన్వేషణ 47 చందమామ రావే 55 కదిలేబొమ్మల కబుర్లు 70 చివరిరోజుల్లో...73 ఈ శీర్షిక మీదే 74




ముఖచిత్రం : చిత్ర షుక్ల

## మాటల విలువ

బీర్బల్ కళ్ళు మూసుకొని ఏవో మంత్రాలు చదువుతుండడాన్ని చూశాడు అక్బర్. అవి తనకూ చెప్పించమని అడిగాడు.

"రాజా! ఇవి జాగ్రత్తగా ఒక గురువు దగ్గరే నేర్చుకోవాలి" అన్నాడు బీర్బల్.

అయితే, అక్బర్-"ధ్యానం చేయడం తెలిసిన వాళ్ళ దగ్గర నేర్చుకోలేమా? గురుముఖతః నేర్చుకోవాల్సిన అవసరం ఏమిటి?" అన్న ఉద్దేశంతో, రాజ్యాధికారంతో వేరొకరి దగ్గర నేర్చుకొని బీర్బల్‌కు చెప్పి చూపించాడు.

అది విన్న బీర్బల్ "పదాలన్నీ అవే రాజా!అయితే వాటిని గురువువద్ద నేర్చుకొన్నప్పుడే దానికి మహిమ" అన్నాడు. "పదాలు మారనప్పుడు అవి ఎవరు నేర్పిస్తేనేం" విసుక్కున్నాడు అక్బర్.

బీర్బల్ చప్పట్లు చరిచి కాపలావాళ్ళను పిలిచాడు. "ఈ మూర్ఖుడిని పట్టుకెళ్ళి చెరలోపెట్టండి" అని అక్బర్‌ను చూపించి ఉత్తర్వు ఇచ్చాడు.

సిపాయిలు ఆశ్చర్యపోయారు.

బీర్బల్ మళ్ళీ మళ్ళీ అవే ఉత్తర్వులిచ్చాడు.

అక్బర్ దగ్గరకు ఎవరూ రాలేదు.

బీర్బల్ చర్యకు అక్బర్ కోపంతో "నన్ను చెరలో వేయమనడానికి వీరెవరు? వీరిని ముందు చెరలో పెట్టండి" అన్నాడు.

సిపాయిలు వెంటనే ఒక్క ఉదుటన బీర్బల్‌ను పట్టుకొన్నారు. అప్పుడు బీర్బల్ నవ్వుతూ "అవే పదాలు నేనన్నప్పుడు ఎవరూ లక్ష్యపెట్టలేదు. కాని మీరు అనగానే, వాటికెంత గౌరవం వచ్చిందో చూశారా రాజా!" అన్నాడు.

గురువుదగ్గరే నేర్చుకోవాలన్న బీర్బల్ మాటల్లోని నిజాన్ని గుర్తించాడు అక్బర్. మీకూ జవాబు దొరికిందనుకుంటాను.

-సద్గురు జగ్గీ వాసుదేవ్


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు E-mail: advtswati@gmail.com swativja@eth.net

Editor: VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



# ఏకపీఠంపై శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వరస్వామి ఘంటసాల 521 133 కృష్ణాజిల్లా A.P.

జలం జీవులకు ప్రాణాధారం. దేహాన్ని పరిశుద్ధం చేసేదీ, ఆరోగ్యాన్నిచ్చేదీ, ఆయుష్షును పెంచేదీ జలమే. జలంనుంచి జనించి జలధీశ్వరునిగా భక్తులచే పూజలందుకుంటున్న కృష్ణా జిల్లా ఘంటసాలలోని శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వర స్వామిని దర్శించండి. ఆరోగ్యవంతులుకండి.

జయ జయశ్రీ జలధీశ్వరస్వామివారికి జలమంటే ఇష్టం. కాసిన్ని నీళ్ళతో ఆయన్ని అభిషేకిస్తే చాలు, తృప్తిపడి కరుణతో మన శరీరంలో వున్న వ్యాధులన్నింటినీ ఆయన కడిగేస్తాడు. భక్తులు అభిషేకించిన నీరే తీర్థమై, ఆ తీర్థమే మహౌషధమై, సర్వరోగాలను హరించివేస్తుంది.ఆరోగ్యవంతుల్ని చేస్తుంది.

ఈ స్వామి ఆరోగ్యప్రదాత. శ్రీ జలధీశ్వరస్వామికి మూడు ప్రదక్షిణాలు చేసి అభిషేక తీర్థాన్ని సేవిస్తే, సంపూర్ణ ఆరోగ్యం లభిస్తుంది. ఎందరో భక్తులకు అనుభవైకవేద్యమది. ఏక పీఠంపై వెలసిన శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వర స్వామి విశిష్టత ఇది.

సతీసమేతంగా కొలువైన నవగ్రహ మండపం ఇక్కడి ప్రత్యేకత. ఒకే ఆవరణలో తన కుమారులైన విఘ్నేశ్వర సుబ్రహ్మణ్యేశ్వరులతో శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వరస్వామి దర్శనభాగ్యం, భక్తుల పాలిటి మహద్భాగ్యం.

ఇక్కడి సుబ్రహ్మణ్యస్వామికి సుబ్రహ్మణ్యషష్ఠినాడు విశేషమైన పూజలు జరుగుతాయి. గ్రహానుగ్రహంకోసం, గ్రహదోషాలను పోగొట్టుకోదలచినవారు ఈ సతీసమేత నవగ్రహాలను వ్యక్తిగతంగా ఆరాధిస్తే, అత్యంత త్వరగా తమ సమస్యలన్నింటినుండి బయటపడతారు.

బస్సు మార్గం : విజయవాడ నుంచి ఘంటసాలకు (ఉయ్యూరు, కూచిపూడిల మీదుగా) దూరం 40 మైళ్ళు.
మోపిదేవి నుంచి ఘంటసాలకు - 8 మైళ్ళు, కూచిపూడి నుంచి ఘంటసాలకు - 8 మైళ్ళు.

సమగ్ర సమాచారంకోసం సెల్ : 99494 92410 E-mail : jaladheeswara@gmail.com

## ఆరోగ్యప్రదాతా! జలధీశ్వరా! పాహిమాం రక్షమాం!



« అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక »

## సాక్షి

### 12.1.2018

'ఫర్ U' శీర్షికలో అన్నీ పోషక ప్రియత్వంలా, ఉపకరించేలా ఉన్నాయి. 'హెయిర్ స్టైల్స్' బావున్నాయి.

'చివరిరోజుల్లో...' రోషన్‌సింగ్ రాసిన చివరి ఉత్తరం హృదయాన్ని కదిలించింది. అతని దేశభక్తి అజరామరమైనదని అనిపించింది.

ఎన్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

మొదటిసారిగా మరొకరి గుండెను తీసి మరొకరికి అమర్చిన క్రిష్టియన్ బెర్నాడు విజయం సాధించాడు అని 'గుండె మార్పిడికి 50 ఏళ్ళు' ఫీచర్ ద్వారా తెలుసుకున్నాం.

'ఒక చిన్నమాట' శీర్షికలో డాక్టర్ జె.భాగ్యలక్ష్మిగారు చాలా మంచి విషయాలను మాతో చర్చించారు.

'తొలి ముద్దు తోరణం', 'గెలుపు' కథలు చాలా బాగున్నాయి.

జి.వి.మురళీమోహన్ ముచ్చుమిల్లి

'ఆహార రహస్యం' గీతావాహిని ద్వారా తెలుసుకున్నాం.

'గుండె మార్పిడి' గురించి డా॥ సోమ రాజుగారు చక్కగా విశ్లేషించారు.

'క్వీన్ ఫ్రూట్' వ్యాసం బాగుంది.

'సత్యాన్వేషణ' ద్వారా పరమాత్మ గురించి తెలుసుకున్నాం.

'గెలుపు' కథ చాలా బాగుంది.

పి.సుధాకర్ రాజోలు

'ఆహార రహస్యం' సంపాదకీయంలో భోజనంచేసేటప్పుడు ఎలా ఉండాలో తెలుసుకున్నాం.

'ఇది మంచి సమయం', 'వరఫలం', 'ఫర్ U' శీర్షికలు మాకు ఎంతో ఉపయోగపడుతున్నాయి.

'గుండె మార్పిడికి 50 ఏళ్ళు' స్పెషల్ ఫీచర్‌లో డా॥ సోమరాజుగారు చాలా విలువైన విషయాలను ఆయన చర్చలో మాకు తెలిపారు.

బి.పరశురామ్ కడప

'లాంగ్‌లివ్' ఆర్టికల్‌లో ఆరోగ్యానికి సంబంధించిన ఎన్నో విషయాలను చదివించారు.

అలాగే 'తొలి ముద్దు తోరణం', 'ఎవడి పిచ్చి', 'గెలుపు' కథలు ఎంతో బాగున్నాయి. చదివింపజేశాయి.

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', సీరియల్స్ అలరిస్తున్నాయి.

బి.జ్యోతిరాణి రేణిగుంట

### వచ్చేవారం స్పెషల్

## ఇంకా అడగండి

గీతా శ్లోకాన్ని పఠించి, తీర్థాన్ని సేవించి దైవ బుద్ధితో భుజిస్తే ఆ అన్నం అమృతరూపంగా పరిణమిస్తుంది అనే సత్యాన్ని తెలుసుకున్నాం.

బి.రాజశేఖర్ హైదరాబాద్

'గుండె మార్పిడికి 50 ఏళ్ళు', 'లాంగ్‌లివ్', 'క్వీన్ ఫ్రూట్' వ్యాసాలు మాకెంతో ప్రయోజనకరంగా ఉంది.

'వరఫలం' శీర్షిక బాగుంది.

'చందమామ రావే' కథ బాగుంది.

'ఈ కార్టూన్ మీదే' చాలా బాగుంది.

'ఫర్ U' శీర్షిక బాగుంది.

'తొలి ముద్దు తోరణం', 'ఎవడి పిచ్చి', 'గెలుపు' కథలు బాగున్నాయి.

కె.మధు విశాఖపట్నం

# ఇది మంచి సమయం

**18.1.2018 నుండి 24.1.2018 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, శిశిర ఋతువు, మాఘమాసం, శుక్లపక్షం.**

**18.1.2018 గురువారం**
తిథి: శుద్ధ పాడ్యమి ప. 10.13 వరకు
నక్షత్రం: శ్రవణం రా. 1.02 వరకు
వర్జ్యం: తె. 5.26 లగా...
దుర్ముహూర్తం : ప. 10.17-11.01 వరకు. మ. 2.43-3.27 వరకు
రాహుకాలం: మ.1.30-2.53 వరకు
మంచి సమయం: ప. 11.30 నుండి 1.00 వరకు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.49కి

**19.1.2018 శుక్రవారం**
తిథి: విదియ మ. 12.22 వరకు
నక్షత్రం: ధనిష్ఠ రా. 3.28 వరకు
వర్జ్యం: ఉ. 7.12 వరకు
దుర్ముహూర్తం: ప.8.48 నుండి 9.32 వరకు. మ. 12.30-1.14 వరకు
రాహుకాలం: ప.10.46-12.08 వరకు
మంచి సమయం: ప. 10.00 నుండి 11.30 వరకు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.50కి

**20.1.2018 శనివారం**
తిథి: తదియ మ. 2.11 వరకు
నక్షత్రం: శతభిషం తె. 5.31 వరకు
వర్జ్యం: ప. 11.17-1.01 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.35-8.04 వరకు
రాహుకాలం: ప. 9.23-10.48 వరకు
మంచి సమయం: ప. 9.50 నుండి 11.10 వరకు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.50కి

**21.1.2018 ఆదివారం**
తిథి: చవితి మ. 3.34 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర పూర్తి
వర్జ్యం: మ. 12.20-2.03 వరకు
దుర్ముహూర్తం: సా.4.14-4.58 వరకు
రాహుకాలం: సా. 4.19-5.42 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.51కి

**22.1.2018 సోమవారం**
తిథి: పంచమి సా. 4.25 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర ఉ.7.06 వరకు
వర్జ్యం: సా. 5.07-6.47 వరకు
దుర్ముహూర్తం : మ. 12.28 నుండి 1.12 వరకు. మ. 2.41-3.25 వరకు
రాహుకాలం: ఉ. 7.59-9.21 వరకు
మంచి సమయం: ప. 9.40 నుండి 11.00 వరకు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.52కి

**23.1.2018 మంగళవారం**
తిథి: షష్ఠి సా. 4.40 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర ప.8.08 వరకు
వర్జ్యం : రా. 8.21-9.59 వరకు
దుర్ముహూర్తం: ప. 8.48 నుండి 9.32 వరకు. రా. 10.49-11.33 వరకు



రాహుకాలం: మ.2.52-4.15 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.38కి
సూర్యాస్తమయం: 5.52కి

**24.1.2018 బుధవారం**
తిథి : సప్తమి సా. 4.17 వరకు
నక్షత్రం: రేవతి ప. 8.34 వరకు
వర్జ్యం : తె. 4.23-5.58 వరకు
దుర్ముహూర్తం: ప. 11.45 నుండి 12.29 వరకు
రాహుకాలం: మ. 12.07 నుండి 1.30 వరకు
మంచి సమయం: ప. 8.00 నుండి 9.30 వరకు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.52కి

* మీరు అవసరం లేకపోతేనే వాళ్ళు మిమ్మల్ని తప్పుబడతారు.

# ఒక చిన్నమాట




డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in


రోజురోజుకూ కొత్తకొత్త విషయాలు, వింతైన విషయాలు తెలుస్తుంటే అవి మనల్ని నూతన శక్తితో నింపుతున్నట్టనిపిస్తుంది.

ఒకప్పుడు సమా చారం మనల్ని చేరటానికి చాలా సమయంపట్టేది. పుస్తకాలు, పత్రికలు, ఉపాధ్యాయులు, గురువులు, విజ్ఞులు, అనుభవజ్ఞులద్వారా మనకు కొత్త విషయాలు తెలిసేవి.

ఇప్పుడు ఎటు చూసినా సమాచారం వెల్లువే. కొన్ని దశాబ్దాలక్రితమే దానిని సమాచార విస్ఫోటక మన్నారు. ఇప్పుడు సమాచారాన్ని చేరవేసే మాధ్యమాలుకూడా విస్ఫోటక స్థితిలో ఉన్నాయి. ఆసక్తిదాయకమైన,ప్రయోజనకరమైన విషయాలు తెలుసుకోటంలో లాభమే కాని నష్టం లేదు.

అయితే 'వినదగునెవ్వరు చెప్పిన' అన్నరీతిలో విన్నా ఏమాత్రం స్వీకరించాలి, ఎంతమాత్రం వినియోగించుకోవాలి అనే విషయంలో మన వివేకము, విచక్షణ అవసరమవుతాయి. ఇరవై ఏళ్ళకిందటిమాట.



మనుషుల బ్లడ్‌గ్రూప్‌ను బట్టి వారి నైజాన్ని, ముఖ్యంగా కర్తవ్యం పట్ల, పనిపట్లవారి ధోరణిని అంచనావేయవచ్చని ఆర్టికల్ చదివి కాస్త ఆశ్చర్యపోయాను.

పైగా కొన్ని జపాన్ సంస్థలలో కొన్ని బ్లడ్‌గ్రూపుల వారికే ప్రాధాన్యం ఉంటుందని (ఉద్యోగాలకు ఎంపిక చేసేవిషయంలో) వింటేఅది అసమంజసంగా తోచింది. ఆ స్ఫూర్తితో ఒక వ్యంగ్య రచన 'పేట్రియట్'కు పంపాను. ప్రచురితమైంది నా కాలమ్ 'వేవ్‌లెంగ్త్'.

జాతకాలు, నక్షత్రాలు, రాసులనుబట్టి మనుషులను అంచనావేయటం, వారిలాగానే ఉంటారని తీర్మానించటం, శాస్త్రీయ పద్ధతి కానట్లే బ్లడ్‌గ్రూపును బట్టి మనిషి పనితనాన్ని అంచనావేయటం సరికాదు అనిపించింది.

ఆ సమయంలోనే ఒక విద్యార్థి ఒకే గోత్రానికి చెందినవారి బ్లడ్‌గ్రూపు ఒకే విధంగా ఉంటుందని ఎంతో విశ్వాసంతో చెపుతుంటే నమ్మలేకపోయాను. అతని ఉత్సాహం నీరుగార్చలేక ఇవేవీ శాస్త్రీయంగా రుజువుకాలేదని మాత్రం చెప్పాను.

పారాసైకాలజీలాగా చాలా మార్మిక విషయాలను మనం రుజువు చెయ్యలేముగాని కొన్ని ధోరణులను పూర్తిగా తిరస్కరించనూలేము.

ఉదయం పత్రిక రాగానే, వారానికో, నెలకో వచ్చే పత్రికైనా సరే వారఫలాలు ఉంటే వెంటనే మనం రాశి ఫలితాలు చూసుకుంటాం. క్షణికానందమో, నిరాశో, క్లేశమో ఉండవచ్చు.




ఆ తర్వాత ఏమి చదివామో గుర్తు ఉండదు. ఒక పత్రిక రాసిన వారఫలాలకి భిన్నంగా మరో పత్రికలో ఉండవచ్చు. వీటిని నమ్మినట్లూ ఉంటుంది, నమ్మనట్లూ ఉంటుంది.

బ్లడ్‌గ్రూప్‌నుబట్టి మన వ్యక్తిత్వంగురించి చెప్పటమేగాక ఏయే బ్లడ్‌గ్రూపుకు ఏయే ఆహారాలు సరైనవోకూడా కొందరు శాస్త్రవేత్తలు చెపుతున్నారు.

ఒకప్పుడు పాశ్చాత్యదేశాలలో వైద్యానికి ముందు మనిషి శరీరతత్త్వమెటువంటిదో నిర్ణయించేవారు. వీటిని హ్యూమర్లు అని అనేవారు. అవి శరీరంలోని రసాలకు సంబంధించినవి.

కఫము, కోపము, దుఃఖము లేదా పిత్తము అనే ధోరణిలో ఇవి ఉండేవి.

ఆయుర్వేదంలోకూడా కఫము,పిత్తము, వాయువు (వాతము) అనే శరీరతత్త్వాల గురించి మనం వింటుంటాం.రక్తం ఏ కోవకు చెందిందో దానికి అనుకూలమైన ఆహారం తీసుకుంటే మంచి ఆరోగ్యం ఉంటుందంటారు.




రక్తతత్త్వానికి ఆహారాన్ని సూచించే నిపుణుడు డాక్టర్ పీటర్ 'ఎ' రకం రక్తమున్నవారికి ఒత్తిడిని నివారించే ఆహారం మంచిదిఅంటారు. వీరికి ఒక పద్ధతిలో సామరస్యంగా జీవితం నడవాలని ఉంటుంది.ఎక్కువగా శాంతిని కోరుకుంటారు.వీరికి మాంసాహారంకంటే ఎక్కువగా పండ్లు, కూరగాయలు, బీన్స్, పప్పులు, ధాన్యాలు మంచివంటారు.




'బి' కోవకు చెందినవారు స్వతంత్రంగా జీవించాలి అనుకున్నా పట్టువిడుపు ఉన్నవారే. మొండి పట్టు ఉండదు. ప్రతిదానిలో వీరు మంచీ చెడూ చూడగలరు.

సాధారణంగా ఒత్తిడికి లోనైతే సమస్యలుంటాయి గాని ఆరోగ్యం చక్కగా కాపాడుకున్నారంటే తక్కిన వారితో పోల్చి చూస్తే వయసు మీదపడినా భౌతిక, మానసిక ఆరోగ్యాలు వీరివి మెరుగ్గా ఉంటాయి. వీరి రక్తంలో చక్కెర సమతౌల్యం పాటించటానికి పచ్చని కూరగాయలు, గుడ్లు, తక్కువ కొవ్వు ఉన్న పాలపదార్థాలు వాడాలి.

మాంసం విషయంలో కోళ్ళు, బాతులు, టర్కీలు, ఇతర పక్షుల మాంసం తగదు. పౌష్టిక ఆహారం మొక్కలనుండిగాని, గొర్రె మాంసంనుండి గాని పొందవచ్చు.



'ఓ' రకం రక్తమున్నవారు ఎవరికైనా రక్తదానం చెయ్యవచ్చునంటారు. అన్ని రకాల రక్తం ఉన్న వారికంటే 'ఓ' రకం రక్తమున్న వారు పౌష్టికాహారాన్ని, కొవ్వును, క్యాల్షియమ్‌ను బాగా జీర్ణంచేసుకోగలరు. వీరు థైరాయిడ్‌కు సంబంధించిన సమస్యలకు, అంటువ్యాధులకు గురయ్యే ప్రమాదముంటుంది.

వీరు అప్పటికప్పుడు నిర్ణయాలు తీసుకుంటారు. కొద్దిగా చంచలస్వభావులు.

క్షణంలో ఉద్రేకాలు మారుతుంటాయి.

చేపలు, కూరగాయలు, పండ్లు, కొవ్వులేనిమాంసం వీరికి తగిన ఆహారం.

వీరు గోధుమ, బీన్స్ తక్కువ మోతాదులో తీసుకోవచ్చు కాని చాలావరకు కాఫీ, మద్యం వంటివి తీసుకోకపోతేనే మంచిది.




'ఎ,బి' రకం రక్తమున్నవారు ప్రజలలో అయిదుశాతం మాత్రమే ఉంటారట. వీరుకూడా కాఫీకి, మద్యానికి దూరంగా ఉంటేనే మంచిది. పచ్చని కూరగాయలు, సోయా, పాల ఉత్పత్తులు వీరికి సరిపోతాయి.

డబ్బాల్లో నిలువవున్న ఆహారాలు సరికాదు. పిండి పదార్థాలు, పౌష్టిక పదార్థాలు కలిపి తీసుకోకపోతే జీర్ణవ్యవస్థ బాగుంటుంది.

ఆహారం కూడా పరిమితంగా తీసుకోవాలి.

"ఆరోగ్యం కాపాడుకోవటం మన విధి. భౌతిక, నైతికత అనేది కూడా ఒకటుందని కొందరే గ్రహిస్తారు" అని హెర్బర్ట్ స్పెన్సర్ అంటారు.

ఆరోగ్యమే మహాభాగ్యమని మనమందరం ఒప్పుకుంటాం. అసలు ఆరోగ్యం లేకపోతే మహాభాగ్యాలు ఏమి చేసుకుంటాం?

**భా**రతదేశపు చరిత్రను విదేశీయులు ఐదువేల సంవత్సరాలకు కుదించే యత్నం విజయవంతంగా చేసి భారతీయులను విదేశీ ఆర్యులు, స్వదేశీ ద్రావిడులుగా విడగొడితే, వారి వారసత్వం అందిపుచ్చుకున్న స్వదేశీ చరిత్రకారులు భారతదేశ చరిత్రకు మరింత వక్రభాష్యాలు కొనసాగించారు. తాము చెప్పిందే చరిత్ర. తాము ఎవరిని 'గ్రేట్' చక్రవర్తి అంటే వారే అసలుసిసలు చక్రవర్తులు. విదేశాలనుండి వచ్చి ఇక్కడి ప్రజలను అణిచివేసిన వంశాలను తెగ పొగుడుతూ స్థానిక రాజులను చిన్నబుచ్చుతూ చరిత్ర పుస్తకాలను తయారుచేశారు.

# రాజకీయంగా కోరేగామ్ యుద్ధం

**వా**రి చరిత్రలోని తప్పులను ఎవరయినా ఎత్తి చూపేవారందరిమీదా ఏదో ఒక రకమయిన ముద్రవేసి తాము చెప్పిన చరిత్రను పదిలపరుచుకునే యత్నం చేస్తున్నారు గత కొన్ని దశాబ్దాలుగా.

అదిగో సరిగా అటువంటి యత్నంద్వారా ఆ చరిత్రకారులు చేసిన నిర్వాకంవల్లనే 2018వ సంవత్సరానికి మహారాష్ట్రలో కుల ఘర్షణలతో స్వాగతం చెప్పాల్సివచ్చింది.

2018ని కొత్త ఆశలతో, అభివృద్ధి సంవత్సరంగా, ఆర్థికంగా అత్యున్నత స్థానానికి నడిపించే సంవత్సరంగా ప్రపంచ సంస్థలు భారతదేశం గురించి చెపుతుంటే, అతిత్వరలో ప్రపంచంలో అమెరికా, చైనాల తర్వాత అత్యున్నత ఆర్థిక వ్యవస్థగా భారత్ నిలుస్తుందని తీర్మానిస్తుంటే అటువంటి ఆశలమీద నీళ్ళు చల్లే యత్నం కొన్ని వర్గాలు మొదలుపెట్టాయి.

గతంలో ఇటువంటి ఉద్యమాలవలన దేశం ఎన్ని సంవత్సరాలు వెనక్కి నెట్టబడిందో మన అందరికీ తెలిసిందే.

రాజకీయ లబ్ధికోసం సమాజాన్ని చీల్చే నిర్ణయాలు తీసుకున్నారు 1989 నాటి పాలకులు. ఫలితంగా సామాజిక ఘర్షణలు చెలరేగాయి.

దేశ అదృష్టంకొద్దీ ఆ పాలకుడు రెండేళ్ళలో పదవీచ్యుతుడు అయ్యాడు. నాటికి దేశం ఆర్థికంగా దాదాపుగా దివాలా దశలో ఉంది. విదేశీ రుణాలు చెల్లించలేని పరిస్థితి. 1991 ఎన్నికల్లో ఏ పార్టీకీ స్పష్టమైన మెజార్టీ రాకపోయినా మైనారిటీ ప్రభుత్వాన్నే ఏర్పాటుచేసిన పి.వి.నరసింహారావు చేపట్టిన ఆర్థిక సంస్కరణలు దేశాన్ని రక్షించాయి.

ఆర్థిక సంస్కరణలు దేశంలోని విభేదాలను వెనక్కి నెట్టాయి. విదేశీ అవకాశాలను పెంచాయి. ఐ.టి. విప్లవం తెచ్చింది. టాలెంట్ ఉన్నవారికి ఉద్యోగాలు ఖాయంగా దొరకటం జరిగింది.

అన్నివర్గాల యువతీయువకులు సమ అవకాశాల్ని అందుకున్నారు. నాటివరకు సమాజంలో ఉన్న అంతర్గత అడ్డుగోడలు మాయంచేస్తూ విభిన్న సామాజిక వర్గాలవారు దంపతులయ్యారు.

విభేదాలను చెరిపివేసి కొత్త బాటలో నడవటానికి సిద్ధపడిన యువత చూపించిన టాలెంట్ వల్లనే నేడు దేశం ఆర్థికంగా, రాజకీయంగా, సైనికపరంగా ప్రపంచంలో గుర్తింపు పొందింది. భారతీయులు కష్టించే మనస్తత్వం కలవారిని, తమ సమస్యలకు పరిష్కారం చూపించగలిగిన సత్తా ఉన్నవారిని విదేశీయులు ఆనందంగా స్వాగతం పలుకుతున్నారు.

స్వదేశంలోని విభేదాలకు స్వస్తిచెప్పి అన్ని దేశాల్లోనూ జీవిస్తున్నారు భారతీయులు. విభేదాలు లేకుంటే రాజకీయ లబ్ధి ఉండదు.



చట్టసభలో నేను ప్రవేశించిన తొలిరోజుల్లో అర్థవంతమైన చర్చలు చూశాను... ఇప్పుడు సభలో గందరగోళాలను చూస్తున్నాను. -కరణ్‌సింగ్, కాంగ్రెస్ నేత

అంతిమ లక్ష్యం అధికారమే అయినపుడు బ్రిటీష్‌వాడి విభజించి పాలించు సూత్రాన్నే రాజకీయపార్టీలు ఎంచుకుంటాయి.

దేశం ఏమయినా పరవాలేదు, సామాజిక ఘర్షణ ఏ స్థాయికి చేరినా పరవాలేదు. అంతిమంగా అధికారం మాకు దక్కాలన్నదే నేటి రాజకీయం. అటువంటి విభజన రాజకీయాలు నమ్ముకున్న పార్టీలు, నేతలు అందివచ్చిన ఏ ఒక్క అవకాశాన్నీ వదులుకోరు. అందుకు సాక్ష్యం మహారాష్ట్రలో కులఘర్షణలు చెలరేగి, ముంబయి నగరంతో సహా మిగిలిన అన్ని ప్రాంతాల్లో ఘర్షణ వాతావరణంఏర్పడటానికి కారణమైన కోరేగామ్ యుద్ధ సంస్మరణ.

రెండువందలసంవత్సరాలక్రితం జరిగిన యుద్ధం కోరేగామ్ యుద్ధం. భీమానది ఒడ్డున ఉన్న ఆ గ్రామంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సేనలు మరాఠా సేనలతో యుద్ధం చేశాయి.

వ్యాపారం పేరున భారతదేశంలోకి ప్రవేశించిన తెల్లవాడు తన కుయుక్తులతో క్రమంగా తూర్పు తీర ప్రాంతం వశంచేసుకున్నాడు.

ఇక పశ్చిమంవైపున పట్టుకోసం ఈస్ట్ ఇండియా కంపెనీ సేనలు ప్రయత్నిస్తున్నాయి. ఆ ప్రయత్నాన్ని మరాఠాలు నిరోధిస్తున్నారు.

ఆ వరసలోనే బ్రిటీష్-మరాఠా పోరాటాలు జరిగాయి. అందులో భాగమే కోరేగామ్ యుద్ధం కూడా. ఈస్ట్ ఇండియా కంపెనీ తాము ఆక్రమించుకున్న ప్రాంతంలోని భారతీయులను సైనికులుగా తీసుకున్నారు. 'కంపెనీ' సైన్యం మొత్తం ఇంగ్లండ్ నుండి వచ్చినవారు కాదన్న విషయం గమనించాలి.

మిలిటరీ అధికారులుగా తాము ఉండి భారతీయులను సైనికులుగా తయారుచేసి, మరో భారతీయ సంస్థానాధీశుడిమీదికి యుద్ధానికి పంపిన దమననీతి ఇంగ్లండ్‌వారిది. కాబట్టి బ్రిటీష్ సైనికదళంలో పలు ఇతర సామాజిక వర్గాలతోపాటు మహారాష్ట్రకుచెందిన మహర్లు కూడా ఉన్నారు. మహర్లు ఒకప్పుడు శివాజీ సైన్యంలోనూ చురుకుగా పనిచేసినవారే.

**శి**వాజీ తర్వాత ఆ ప్రాంతాన్ని పాలించిన ఇతర మరాఠా రాజులదగ్గర మహర్లు సైనికులుగా ఉన్నారు. కోరేగామ్ యుద్ధంలో బ్రిటీష్‌వారిని ఎదిరించినది రెండవ బాజీరావు, ఆయనకు అనుకూలురైన పీష్వాలు. నిజానికి పీష్వాలు ప్రధాన పాలకులు కాదు. పీష్వాలు బ్రాహ్మణులు. వారిది క్షాత్రధర్మం కాదు. మహర్లది క్షాత్రధర్మం కాదు.

అయినా ఆ రెండు వర్గాలు ఇరువైపులా సైనికులుగా యుద్ధం చేశారు. కంపెనీ తరపున పాల్గొన్న సైనికులలో మరణించిన భారతీయులలో ఇరవైరెండుమంది మహర్‌లు ఉండగా, పదహారుమంది మరాఠాలు, 8 మంది రాజపుత్రులు,

ఇద్దరు ముస్లిమ్‌లు, ఒకరిద్దరు యూదులున్నారు.

మరాఠా సైనికదళంలో 500 నుండి 600 మంది మరణించారు. మరాఠాల తరఫున అరబ్బులు సైనికులుగా పాల్గొన్నారు. అశ్వదళం నడిపింది అరబ్బులు. ఆ సైనికదళంలో భారతీయులయిన అన్ని వర్గాల వారూ ఉన్నారు. నిజానికి కోరేగామ్ యుద్ధంలో పాల్గొన్న మరాఠాలు ఓడిపోలేదు.

మరోవైపునుండి బ్రిటీష్ దళాలు భారీసంఖ్యలో వస్తున్నాయన్న అనుమానంతో వెనక్కి తగ్గారు. కోరేగామ్ యుద్ధంతర్వాత, మరో యుద్ధంతర్వాతగాని ఈస్ట్ ఇండియా కంపెనీ పూర్తిగా మరాఠా ప్రాంతాన్ని స్వాధీనం చేసుకోలేదు. కోరేగామ్ యుద్ధ నేపథ్యం చూసినపుడు ఒక విషయం స్పష్టమవుతుంది.

భారతదేశానికి చెందిన కొందరు విదేశీ దురాక్రమణదారుడితో చేతులు కలిపి స్వదేశీ రాజులను ఓడించే ద్రోహం చేశారు. అటువంటి ద్రోహపూరిత యత్నాలను ఖండించాల్సింది పోయి కోరేగామ్ యుద్ధం తమ విజయంగా సెలబ్రేట్ చేసుకుంటామనటాన్ని భారతీయులు హర్షించలేరు.

పైగా ఈ యుద్ధానికి వక్రభాష్యాన్ని జోడించే యత్నం మరింత హేయమయినది. అంటరానివారిగా ముద్ర వేయబడిన మహర్లు అగ్రవర్ణ పీష్వాలమీద సాధించిన విజయంగా దీనిని వర్ణించటంలో ఔచిత్యం లేదు.

యుద్ధాలు అనేవి రెండు రాజ్యాలమధ్య జరుగుతాయి, ఇద్దరు పాలకుల మధ్య జరుగుతాయి. ఆ యుద్ధంలో సైనికులుగా అన్ని వర్గాల వారూ పాల్గొంటారు. నేటికి మన దేశంలో గూర్ఖా రెజిమెంట్, సిక్కు రెజిమెంట్, మహర్ రెజిమెంట్లనేవి వున్నాయి. అలాగని ఆ యా రెజిమెంట్స్‌లో ఆ సామాజికవర్గంవారే వుండరు.

ఒక సామాజిక వర్గం పేరుతో వున్న రెజిమెంట్ అయినా అన్ని సామాజికవర్గాలవారుంటారు. గూర్ఖా రెజిమెంట్‌లో పనిచేసిన ఫీల్డ్ మార్షల్ మానెక్ షా గుర్ఖా కాదు. కోరేగామ్ యుద్ధం మహర్ల విజయం కాదు. అది ఈస్ట్ ఇండియా కంపెనీ విజయం.

యుద్ధంలో గెలిచినవారు స్మారకం నిర్మించటం సహజం. కోరేగామ్ యుద్ధ విజయస్మారకాన్ని బ్రిటీష్ వారు నిర్మించారు. ఆ యుద్ధంలో తమవైపు మరణించినవారి పేర్లను అక్కడ చెక్కారు.

అందులో కొందరు మహర్లున్నారు. ఇతర సామాజిక వర్గాలవారున్నారు. అటువంటి ఒక విదేశీ శక్తులు నిర్మించిన స్మారకందగ్గర చేరి, ఆ యుద్ధ విజయాన్ని ఒక కులానికి, అపజయాన్ని మరో కులానికి ఆపాదించి హింసాత్మక సంఘటనలను ప్రేరేపించటం ఒక రాజకీయ కుట్రలో భాగంగానే భావించాలి.

మహర్లు కోరేగామ్ యుద్ధ విజయాన్ని స్మరించటం ఎంత తప్పో, అటువంటి సంస్మరణ కార్యక్రమాన్ని తప్పుపట్టి వారిమీద మరాఠాలు దాడిచెయ్యటం అంతే తప్పు. భారతీయ సమాజంలోని కుల బలహీనతను తమకు అనుకూలంగా మలచుకునే రాజకీయ శక్తులకు అనవసరంగా అవకాశం ఇచ్చినవారవుతున్నారు మరాఠాలు, మహర్లు.

కోరేగామ్ యుద్ధాన్ని స్థానిక వర్గాల మధ్య పోరాటంగా చేసే యత్నమే తప్పు. ఆ యత్నం 1920ల్లో ఒక నేత చేసినా ఆ తర్వాతి కాలంలో అది మరుగున పడింది. యుద్ధాలలో పాల్గొన్న రెజిమెంట్స్ తాము సాధించిన విజయాలను ప్రతి ఏటా సెలబ్రేట్ చేసుకుంటాయి.కాని మహర్ రెజిమెంట్ కోరేగామ్ యుద్ధ విజయాన్ని సెలబ్రేట్ చేసుకోదు.

ఒక విదేశీ శక్తికి తొత్తుగా పనిచేసిన యుద్ధాన్ని మనం సెలెబ్రేట్ చేసుకోవటం ఏమిటని అటువంటి సెలబ్రేషన్స్‌ని జరుపుకోరు. అనేక దశాబ్దాలుగా ఎవరికీ పట్టని కోరేగామ్ యుద్ధం 2018లో ఒక్కసారిగా భారీస్థాయిలో తెరమీదికి రావటానికి కారణం నిస్సందేహంగా రాజకీయాలే.

కోరేగామ్ యుద్ధ ద్విశతాబ్ది ఉత్సవాలకు విచ్చేసినవారిని చూసినప్పుడు ఆ విషయం స్పష్టమవుతుంది.

- ఈస్ట్ ఇండియా కంపెనీ గెలిచిన యుద్ధం
- మరాఠాలు ఓడిన యుద్ధం
- కులపర విజయంగా చూపించే యత్నం
- విభజించి పాలించే వారసత్వ పార్టీలు

గుజరాత్ శాసనసభ ఎన్నికల్లో ఇటీవల ఎమ్ఎల్ఏగా గెలిచిన జిగ్నేష్ మెవానీ, జె.ఎన్.యు. విశ్వవిద్యాలయంలో "భారతదేశాన్ని ముక్కలు ముక్కలు చెయ్యటమే లక్ష్యం" అంటూ ప్రసంగించిన ఖలీద్‌లు అక్కడ అతిథులు.

ఆ ఇద్దరికీ మహారాష్ట్రతో సంబంధం లేదు. వారిని ఆహ్వానించదగినంత శక్తి స్థానిక మహర్ సంఘాలకు లేదు. ప్రతి ఏటా స్థానికంగా కొందరు మహర్లు ఆ స్మారకందగ్గర చేరి తమవారిని స్మరించుకుంటారు. అటువంటి సాదాసీదా ఉత్సవానికి వేలాది మందిని సమీకరించగలిగిన 'అదృశ్య' రాజకీయ శక్తులు ఉండివుండాలి.

మహారాష్ట్రలోని రాజకీయ పార్టీల ప్రమేయం కోరేగామ్ సెలబ్రేషన్స్‌లో ఎక్కడా కనిపించలేదు. మహారాష్ట్రలో మహర్లను రెచ్చగొట్టే యత్నం ఇది. మహర్లతో మొదలుపెట్టి ఆ తర్వాత క్రమంగా అన్ని రాష్ట్రాలలోని ఎస్.సి. వర్గాలను రెచ్చగొట్టాలి అన్నది విస్తృత ఎత్తుగడ. ఇది ఎస్.సి. ఓటుబ్యాంక్ నిర్మాణానికి జరుగుతున్న ప్రయత్నం.

వీరి ప్రయత్నానికి సమాజంలోని కొన్ని ఘర్షణాత్మక సంఘటనలు దోహదపడుతున్నాయి.

భారతదేశంలో పట్టణాలలో కనిపించని కుల విభజన గ్రామీణ ప్రాంతాలలో నిలిచేవుంది. అయితే అది కులపరమైన విభేదం అనేదానికన్నా ఆధిపత్య ధోరణిలో భాగంగా ప్రదర్శిస్తున్నదే. విద్య అందరికీ అందుబాటులోకి వచ్చి, ఉద్యోగ అవకాశాలు మెరుగయినతరువాత నేడు కులవృత్తులే క్రమంగా కనుమరుగు అవుతున్నాయి.

గ్రామీణ ప్రాంతంలో నేటికీ కొంతమేర కుల వృత్తులు ఉన్నాయి. అయితే ఆర్థికంగా, ఆస్తిపరంగా ఉన్నతంగా ఉన్న వర్గాలు మిగిలిన వర్గాలమీద పెత్తనం చెలాయించే యత్నం చేస్తున్నాయి.

అదొక సామాజిక వర్గం మాత్రమే చేస్తున్నది కాదు. సంఖ్యాపరంగా బలం వున్నవారు, చట్టంవలన రక్షణ పొందినవారు కూడా మిగిలిన వర్గాలమీద పెత్తనం చెలాయిస్తున్నారు.

సామాజిక అసమానతలకన్నా ఆర్థిక అసమానతల పరంగా పెత్తనాలు మారుతున్నాయి. పాత తరం అసమానతలు నేడు పాటించగలిగినవారు లేరు.

పాటించేవారిని శిక్షించేందుకు తగిన చట్టాలు వున్నాయి. ఒకనాటి అణగారిన సామాజికవర్గాలు నేడు చైతన్యవంతమయ్యాయి. విద్య, విజ్ఞానం ఏ ఒక్క వర్గం సొత్తుకాదని నిరూపించాయి.

వారు కూడా ఆలోచించి తమకు ఇష్టమైన రీతిలో స్పందించగలిగిన స్థాయికి ఎదిగారు. ఒకనాడు కొన్ని పార్టీల ఓటుబ్యాంక్‌గా దోపిడీకి గురైన ఆ వర్గాలు తమకోసం ఆలోచించే కొత్త పార్టీలవైపుకు మొగ్గుచూపుతున్నారు.

ఒకనాడు ఎస్.సి., ఎస్.టి.లు మా ఓటుబ్యాంక్ అని చెప్పుకుని, వారిని సంపూర్ణంగా ఎదగనివ్వక, తమ ఆశ్రిత వర్గాలుగా ఉంచేసిన పార్టీలకు- రాజకీయంగా ఎదురుదెబ్బలు తగులుతున్నాయి.

పేదరికం, అణగారిన వర్గాలనేవి నినాదాలుగా చేసి తమ పబ్బంగడుపుకున్న పార్టీల హస్తాల్లో నుండి బయటకు వచ్చినవారిని తిరిగి తమవైపు తిప్పుకోవాలంటే భావోద్వేగాలు రెచ్చగొట్టటం ఒక్కటే మార్గంగా ఆ పార్టీలు భావిస్తున్నాయి.

అందులో భాగమే నేటి కోరేగామ్ యుద్ధ స్మరణ ద్వారా సమాజంలో సృష్టించాలనుకుంటున్న కుల ఘర్షణలు. సామాజిక అశాంతి రాజకీయంగా కొన్ని పార్టీలకు లబ్ధి చేకూరుస్తుందేమో కాని దేశ ప్రగతికి తీవ్ర నష్టం తెస్తుంది.

అన్ని వర్గాలు ఏకమై 2022 నాటికి భారతదేశాన్ని అగ్రరాజ్యంగా నిలపాలన్న అబ్దుల్ కలామ్ కలను సాకారం చెయ్యాల్సిన సమయంలో అర్థంలేని విభేదాలు సృష్టించుకుని దేశాన్ని తిరోగమనంలోకి తీసుకువెళ్ళటం సమంజసం కాదు.

పరిష్కారం కాకుండా వున్న సమస్యలు అనేకం వుండగా మరో కొత్త సమస్యతో సమాజాన్ని ఛిన్నాభిన్నం చేస్తామనే శక్తులపట్ల అప్రమత్తతతో వ్యవహరించాల్సిన అవసరం ఉంది.

*డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు*

# హీలింగ్ టచ్



శరీరాన్ని మృదువుగా, నెమ్మదిగా మసాజ్ చేస్తుంటే ఎంతో హాయిగా, ఆహ్లాదంగా ఉంటుంది. మసాజ్ అనేమాట వినగానే విశ్రాంతి, పునరుత్తేజం,ఉత్సాహం అన్నవి గబుక్కున స్ఫురిస్తాయి.

అయితే, ప్రధాన ఫలితాలు ఇవే అయినప్పటికీ వీటికి మించి మరెంతో ఉంది. ఇది ప్రత్యామ్నాయ వైద్యరూపం. విస్తృతమైన వైద్య స్థితిగతుల్లో ఉపకరించే తిరుగులేని, నాణ్యమైన చికిత్స.మసాజ్ థెరపీ అనేది విలాసంనుంచి అవసరందాకా ఉంటుంది.

## మసాజ్ థెరపీ

శరీరంలోని మృదువైన టిష్యూలను కండరాలు, అనుసంధాన టిష్యూలు, టెండన్లు, లిగమెంట్లు, జాయింట్లతో సహా ఉద్దీప్తం చేసేదే మసాజ్ థెరపీ. జాయింట్ల కండరాలను నొక్కడం, రుద్దడం, ఒత్తడం లాంటివి ఉంటాయి.

## రకాలు

రక్తసరఫరా ఉద్దీప్తం అవుతుంది.మసాజ్‌లు తేలిక పాటి (స్ట్రోక్స్) నుంచి లోతుగా ఒత్తిడిఇస్తూ,చక్రాలను సమతౌల్యపరిచేదాకా వుంటుంటాయి.

ఇది ఆరోగ్య పరిరక్షణ ప్రత్యామ్నాయం. వృత్తిపరమైన ఒత్తిడి, నొప్పులువంటి అసౌకర్యాలను నివారించడంలో సహకరించే థెరపీ.

మసాజ్‌లలో అనేక రకాలున్నాయి. ఎవరి అవసరాన్నిబట్టి వారు ఎంచుకోగలగాలి.

* మృదువైన రకం స్వీడిష్ మసాజ్. సుదీర్ఘ స్ట్రోక్స్, ఒత్తడం, డీప్‌గా సాగే గుండ్రని కదలికలు, వైబ్రేషన్, టాపింగ్ వంటివి ఉంటాయి. శరీరం రిలాక్సవడానికి, శక్తిని పొందడానికి ఉపకరిస్తుంది.
* డీప్ మసాజ్ టెక్నిక్‌లో నెమ్మదిగా, ఫోర్స్‌గా స్ట్రోక్స్ ఇస్తూ, కండరాలు, అనుసంధాన టిష్యూలు, లోపలి పొరలను లక్ష్యంగా చేసుకుంటారు. గాయాలవల్ల కండరాలకు జరిగిన హానినుంచి కాపాడుకోవడానికి సాధారణంగా వీటిని అనుసరిస్తారు.
* స్పోర్ట్స్ మసాజ్, స్వీడిష్ మసాజ్ వంటివే. అయితే, దీనిని క్రీడాకారులు లేదా తీవ్రమైన కార్యకలాపాల్లో పాల్గొనే వారికోసం లేదా గాయాలకు చికిత్సగా చేస్తుంటారు.
* ట్రిగ్గర్ పాయింట్ మసాజ్‌లను టైట్ మజిల్ ఫైబర్స్ గల ప్రదేశాలపై గాయాలు తగిలినప్పుడు లేదా గాయాల చికిత్సలో చేస్తారు.
* రెమెడియల్ మసాజ్ డీప్ టిష్యూలు, ట్రిగ్గర్ పాయింట్లను ఉద్దేశించి చేసేవి.
* కండరాలనుకూడా చికిత్స చేస్తాయి. స్ట్రెచ్ రిలీజ్, మజిల్ స్ట్రిప్పింగ్, రీ- ఎలైనింగ్ వంటి టెక్నిక్స్ ఉంటాయి.
* రిఫ్లెక్సాలజీ అనేది పాదాలు, చేతులు, చెవులకు సంబంధించిన మసాజ్ థెరపీ.

వీటికి సంబంధించి శరీరంపై గల పాయింట్లను లక్ష్యం చేసుకుని సాగించేవి.

మనదేశంలో సాధారణంగా అనేకరకాల మసాజ్‌థెరపీలు అందుబాటులో ఉన్నాయి.అరోమా థెరపీ, డీప్ టిష్యూ, డ్రై ట్రిగ్గర్ పాయింట్ థెరపీ,ఫుట్ రిఫ్లె క్సాలజీ, ఇండియన్ హెడ్‌మసాజ్, ఫేస్‌మసాజ్‌లు సర్వసాధారణంగా చేయించుకునేవి.

వీటికితోడుగా సరికొత్త మసాజ్ టెక్నిక్స్ కూడా జత అవుతున్నాయి. స్పోర్ట్స్ మసాజ్, ఫిజియో ట్రిగ్గర్ పాయింట్ థెరపీ, రెమెడియల్ మసాజ్, మియో ఫేషియల్ మసాజ్, లింపటిక్ డ్రైనేజి వంటివి కొత్తవి.




## ప్రయోజనాలు

మసాజ్ థెరపీని లేజీ మ్యాన్స్ ఎక్సర్‌సైజ్‌గా పేర్కొనాలి.

బరువు తగ్గడానికి, శారీరక ఆకృతికి, పర్‌ఫార్మెన్స్ మెరుగుదలకు సహకరిస్తాయి.

* బిగుసుకుపోయిన కండరాలను కూడాలూజ్‌చేయడంలో శరీరం మొత్తానికి సహకరిస్తాయి. కండరాల నొప్పులనుంచి ఉపశమనం కలిగిస్తాయి. ఫ్లెక్సిబిలిటీని మెరుగుపరిచి, నొప్పులనుంచి ఉపశమనం కలిగించడంలో సహకరిస్తాయి.
* హార్ట్‌రేటును తగ్గించడంలో, రోగనిరోధకవ్యవస్థను మెరుగుపరచడంలో సాయపడతాయి.
* చర్మం టోనింగ్ మెరుగుపరుస్తాయి.
* ఒత్తిడిని, నొప్పులు, కండరాల టెన్షన్ తగ్గించడంలో మసాజ్‌లు ప్రభావవంతమైన చికిత్సగా పనిచేస్తాయని అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. మసాజ్ కండరాల నాణ్యతను మెరుగుపరచడంలో సహ కరిస్తాయి.
* భరించలేని దీర్ఘకాలిక కండిషన్లలో చికిత్సనిమిత్తం రక్తసరఫరాను మెరుగుపరుస్తాయి.
* శారీరక నాడీవ్యవస్థ, సర్క్యులేటరీ లింఫటిక్, మస్క్యులోస్కెలెటల్ వ్యవస్థలపై అనుకూల ప్రభావం చూపుతాయి.
* టెన్షన్‌ను, తలనొప్పి, మానసిక ఒత్తిడులను తగ్గించడంతోపాటు ఏకాగ్రతను, విశ్రాంతితో కూడిన నిద్రను మెరుగుపరుస్తాయి.
* యాంగ్జయిటీ, జీర్ణసంబంధిత లోపాలు, ఒత్తిడికి కారణం అయ్యే నిద్రలేమి, సాఫ్ట్ టిష్యూ స్ట్రెయిన్లు లేదా గాయాలు, జాయింట్ నొప్పులను పరిష్కరించడంలో సహకరిస్తాయి.

పోశ్చర్‌ను సరిచేసుకోవడంలో సహకరిస్తాయి.

అయితే చాలావాటి మాదిరే మసాజ్ థెరపీలోనూ కొన్ని ఇబ్బందులు లేకపోలేదు. సాధారణంగా మసాజ్ థెరపీ సురక్షితమైనదే. అయితే కొన్ని చిన్న చిన్న దుష్ప్రభావాలుంటాయి.

అలాగే, రక్తం పల్చబడడానికి మందులు వాడే వారికి లేదా బ్లీడింగ్ సమస్యలుగలవారికి కాలిన, తగ్గుతున్న గాయాలు గలవారికి,డీప్ వెయిన్ థ్రాంబోసిస్ గలవారికి, ఫ్రాక్చర్లు, తీవ్ర ఆస్టియోపోరోసిస్ గలవారికి మసాజ్ థెరపీ ఆచరణీయం కాదు.

సరిగ్గా, సక్రమంగా మసాజ్ థెరపీ చేసినప్పుడు సరదాగా, హాయిగా, ఆహ్లాదంగా, ఒత్తిడితగ్గించే విధంగా వుంటుంది. గాయాలు, ఇతర కండిషన్లలో చికిత్సగా ఉపకరిస్తుంది. విలాసవంతంగా, సేదతీర్చగల శక్తి ఉంటుంది.

బి.హిమబిందు


Courtesy : SAVVY

అక్కడంతా చాలా రిచ్‌గా వుంది
యువతీ యువకులు అలాగే వున్నారు
ఓ ప్రేమజంట విడిపోతున్నారు
ఇంతకాలం ప్రేమించుకున్న
ఆ ఇద్దరికీ పొసగలేదట
అందుకే ఆ బ్రేకప్ పార్టీ
అప్పటివరకు వాళ్ళు ఒకరికొకరు
ఇచ్చుకున్న గిఫ్టులు కూడా తిరిగి
ఇచ్చేసుకున్నారు
అంతా చప్పట్లు, హ్యాపీ ముచ్చట్లు
విడిపోవడానికి
బ్రేకప్ పార్టీలా?!!
ఎంత గొప్ప కల్చర్?!
ఎటువైపు వెళ్తున్నాం మనం!!!
వారెవరికీ ప్రేమించే హృదయం లేదా?!!

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

లవ్లీ సీరియల్

# హృదయం ఎక్కడున్నదీ...

లో చదవండి

9.2.2018 సంచికలో ప్రారంభం

# జైహింద్ నినాదమిచ్చిన నేతాజీ

**భా**రతదేశ స్వాతంత్ర్యం ఎందరో భారతీయుల త్యాగఫలం. తమ జీవితాలను పణంగా పెట్టి భరతమాత స్వాతంత్ర్యంకోసం పోరాటం చేశారు. బ్రిటీష్ పాలకుల చేతికి చిక్కి బందీలవటం ఇష్టంలేక ప్రాణత్యాగం చేసినవారున్నారు. అటువంటి మహావీరుల త్యాగఫలాలను క్రమంగా మరుగునపడేలా చేసింది స్వతంత్ర భారత ప్రభుత్వం.



**అ**యినా ఎంతగా అదిమిపెట్టాలని చూసినా, ఎంతగా చెరిపివేయాలని అనుకున్నా సాధ్యం కాక, మళ్ళీమళ్ళీ ఆ వీరుడిగురించి ఈ జాతి తలచుకుంటున్నదంటే, ఆ నేత ఇంకా ఎక్కడో ఒకచోట బతికేవున్నాడని అనుకుంటున్నదంటే-

ఆయన మరణించివుంటాడని నమ్మలేకపోతున్నదంటే ఆ వీరుడు ఈ జాతిని ఎంతగా కదిలించివుంటాడో ఊహించవచ్చు. ఆ విప్లవ సేనాని,స్వాతంత్ర్య సమరవీరుడే నేతాజీ సుభాష్ చంద్రబోస్.

నేటికీ ఆయన ఇచ్చిన నినాదం 'జైహింద్' అనేది దేశమంతా మారుమోగుతుంది. ఇటీవలి పరిశోధకుల అభిప్రాయం, లభించిన పత్రాల ఆధారంగా బ్రిటీష్‌వారు ఈ దేశం వదిలి వెళ్ళిపోవటంలో సుభాష్ చంద్రబోస్ పాత్రే కీలకమంటారు.

ఆయన లేవనెత్తిన స్వతంత్ర జ్వాల భారతీయ యువతలో తీవ్రంగా పాకిందని, ఇక దానిని ఆపటం అంత సులభం కాదని భావించిన బ్రిటీష్ పాలకులు క్రమంగా సర్దుబాట్లు చేసుకుని, బోస్‌వంటి నేతను మరుగునపడేసే వ్యక్తి చేతిలో అధికారం పెట్టి వెళ్ళిపోయారు. ఆ వ్యక్తి బ్రిటీష్‌వారి నమ్మకాన్ని వమ్ముకానివ్వలేదు.

బోస్ ఎప్పుడైనా, ఎక్కడైనా పట్టుబడితే ఆయన్ని బంధించి బ్రిటీష్‌వారికి అప్పగించేందుకు సంతకం పెట్టినవాడు ఆ దేశాధినేత.

బోస్ అనేది బెంగాలీ ఇంటి పేరు అని ఒప్పుకోలేనంతగా తెలుగువారితో మమేకమైన నాయకుడు సుభాష్ చంద్రబోస్.

బోస్ మాతృభాష బెంగాలీ అయినా ఆయన పుట్టింది నేటి ఒడిషాలోని కటక్‌లో. అది నాటికి బెంగాల్ రాష్ట్రంలో భాగం.

నేతాజీ జనవరి 23, 1897లో పుట్టాడు. పైచదువులకు కలకత్తా చేరాడు. చదువుకన్నా తన మతం గురించి ఆలోచించాల్సిన అవసరం వుందనుకుని ఒక దశలో చదువు వదిలి రామకృష్ణుని, వివేకానందుని మార్గం ఎంచుకున్నాడు.

భారతీయ విద్యార్థులను అవమానించిన బ్రిటీష్ టీచర్ చెంప పగలగొట్టి కొంతకాలం సస్పెండ్ అయ్యాడు. అయితే ఆ తరువాత సర్దుబాటు చేసుకుని తిరిగి చదువు కొనసాగించాడు.

తొలి ప్రపంచ యుద్ధం సుభాష్ చంద్రబోస్‌ని ప్రభావితం చేసింది. జాతీయ భావాలు పెంపొందించుకున్నాడు.

1918లో బి.ఎ. ఫిలాసఫీలో ఉత్తీర్ణులయ్యారు. ఆ రోజుల్లో యువత కల ఐ.సి.ఎస్. ఆఫీసర్ అవటం. అలాంటి అధికారిగా చూడాలన్నది చంద్రబోస్ తండ్రి కల. ఆ కలను నిజం చేసేందుకు ఇంగ్లండ్ వెళ్ళి ఐ.సి.ఎస్‌లో నాల్గవ ర్యాంకర్‌గా నిలిచినా, ఆ సర్వీస్‌లో చేరి బ్రిటీష్‌వాడికింద పనిచేయనన్నాడు.

ఐ.సి.ఎస్.ని వదులుకుని 1921లో భారత్ తిరిగి వచ్చాడు. బెంగాలీ జాతీయభావాలను ప్రజలలోకి తీసుకువెళ్ళిన చిత్తరంజన్‌దాస్ శిష్యరికంలో కాంగ్రెస్ పార్టీలో పనిచేశాడు. ఆలిండియా యూత్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయ్యాడు.

బెంగాల్ శాఖ కార్యదర్శిగా పనిచేశాడు. 1928లో ఎ.ఐ.సి.సి. సభలు కలకత్తాలో నిర్వహించారు.

ప్రారంభం నుండి సుభాష్‌చంద్రబోస్‌ది ధిక్కార స్వరమే. సైనిక దళాల యూనిఫాం ధరించి కనిపించేవాడు. బూట్లు టక్‌టక్ ధ్వనిచేస్తూ నడిచేవాడు.

**బో**స్ మాటల్లో ఆవేశం వుండేది. తిరుగుబాటుని ప్రోత్సహించేవాడు.దీనితో గాంధీకి బోస్ అంటేనచ్చేది కాదు. అయినా బోస్‌కున్న ప్రజాభిమానాన్ని మన్నించి ఆయన్ని పార్టీలో కొనసాగించాల్సి వచ్చింది.

1938లో జరిగిన కాంగ్రెస్ అధ్యక్ష పదవికి బోస్ పోటీపడ్డాడు. ఆయన్ని ఎన్నికల్లోనుండి తప్పుకుని గాంధీ ప్రతిపాదించిన పట్టాభిసీతారామయ్యని ఏకగ్రీవం చెయ్యమని కోరారు. కాని బోస్ వినలేదు. పోటీ పోటీనే అన్నాడు.

ప్రజాస్వామ్యంలో ఓడినా పరవాలేదన్నాడు. చివరికి కాంగ్రెస్ ఓటర్లు గాంధీ అభ్యర్థిని కాదని సుభాష్ చంద్రబోస్‌ని గెలిపించారంటే నాడు ఆయనపట్ల వున్న అభిమానం అర్థమవుతుంది.

బోస్‌ని అధ్యక్ష స్థానంలో చూడటానికి ఇష్టపడని గాంధీ, 'పట్టాభి ఓటమి నా ఓటమి' అని ప్రకటించి బోస్‌ని విసిగించి, పార్టీలో పనిచేయలేని పరిస్థితి సృష్టించి బోస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి వెళ్ళిపోయే పరిస్థితి సృష్టించాడు.

బోస్‌ది నాటినుంచి ఒంటరి పోరు. ఫార్వర్డ్ బ్లాక్ పెట్టుకున్నాడు. 'అజాద్ హింద్ ఫౌజ్'ని నిర్మించాడు. జైహింద్ నినాదం ప్రజలకు అందించాడు.బ్రిటీష్ వారు అరెస్టుచేస్తే వారి కన్నుగప్పి జైలునుండి పారిపోయి ఐరోపాలో తేలాడు.

బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న జర్మనీతో చేతులు కలిపాడు. హిట్లర్‌తో సమావేశమయ్యాడు. జపనీయులతో జతకట్టాడు.

జర్మనీ నుండి జలాంతర్గామిలో ఆఫ్రికా ఖండం వరకు ప్రయాణం చేసి, మడగాస్కర్ నుండి జపాన్ వారి జలాంతర్గామికి మారి సాహస ప్రయాణంచేసినవాడు బోస్. అండమాన్ ద్వీపాలను బ్రిటీష్‌వారి నుండి విడిపించి స్వతంత్ర భారత ప్రభుత్వ స్థాపన ప్రకటన చేసిన వీరుడు సుభాష్ చంద్రబోస్.

'అజాద్ హింద్ ఫౌజ్'లో నాడే మహిళా వింగ్‌ని ఏర్పాటుచేసినవాడు సుభాష్ చంద్రబోస్. మహిళలను కదనరంగంలో నడిపించిన శక్తివంతమైన నేతాజీ చివరిరోజువరకు పోరాటంలో నిలబడినవాడు.

**ప**రిస్థితులు ప్రతికూలమైనప్పుడు విమానంలో ఫార్మోజా వెళ్ళిపోయి, సోవియట్ యూనియన్ సహాయంతో తిరిగి స్వాతంత్ర్య పోరాటం నడపాలనుకున్నాడు. కాని దురదృష్టం... ఆయన విమానం కూలిపోయింది. అయితే ఆయన మరణించాడా! లేదా! అన్నది నేటికీ ఒక మిస్టరీ.

అసలు బోస్ ఏమయ్యాడు! ఆయన మరణించాడంటే నమ్మలేమన్నారంతా.కాని విచారణా సంఘాలు ఆయన మరణంపై భిన్న నివేదికలు ఇచ్చాయి.

నేటికీ బోస్‌పై రహస్య పత్రాలు అలాగే వున్నాయి. ఏమయినా భారతీయులు మరచిపోలేని మహామనిషి బోస్. ఆయన జీవితం యువతకు ఆదర్శం.

విజయార్కె

# స్లీపర్ కోచ్ శోభనం

దేశాన్ని ప్రేమించేవ్యక్తి, దేశాన్ని కాపాడేయోధుడు తన భార్యను చాలా గొప్పగా ప్రేమిస్తాడు... ప్రియంవద. ఆ గదిలో అల్లరి మొదటిరాత్రి అనుభవాలతో కబుర్లు చెబుతోంది.

ఆ గదిలో నవ్వులు సిగ్గులతో పోటీ పడి ఎర్రబారిన బుగ్గల పువ్వులను పూయిస్తున్నాయి.

ఆ గది ఈ కథకు వేదిక....

అద్దంలో చూసుకుంది ప్రియంవద. తను ఇంతందంగా ఉంటుందా? అనుకుంది.



అలా అనుకుంటూఉండగానే గదిలో చిన్న సవ్వడి. అది తన మదిలో నుంచి రిఫ్లెక్ట్ అయ్యిందా? అనిపించింది. తనవెనుక అడుగుశబ్దం. ఆ శబ్దం తన గుండె చెవులకు సుపరిచితం.

తనతో ఏడడుగులు నడుస్తున్నప్పుడు విన్న అడుగుల శబ్దం.

ఒక్కో అడుగు తన అడుగులో అడుగువేసి తను నడుస్తున్నప్పుడు తన పాదాల్లో చిన్న ప్రకంపన. ఆ వైబ్రేషన్ తనపాదాలనుంచి శరీరమంతా పాకిపోయిన ఫీలింగ్. కళ్ళు మూసుకుంది.

కళ్ళు తెరిస్తే ఎదురుగా అద్దంలో కొద్దిగంటల ముందే తన మెడలో మూడుముళ్ళు వేసిన తన పురుషుడు కనిపిస్తాడు.

సిగ్గుతో ఎర్రబారిన తన బుగ్గలను చూసుకోవడానికి సిగ్గేసింది. ఒకవేళ అయినా సరే... తను చూస్తే... ఇది కలని తెలిస్తే... అందుకే కళ్ళు మూసుకుంది. కలైనా, నిజమైనా ఫీలింగుని అనుభవించాలి... అనుభూతించాలి.

అతని చేయి ప్రియంవద మెడను చుట్టింది. ఆ చేతిస్పర్శ ఆమె మెడక్రిందిభాగానికి తగులుతోంది. అతని చేయి కిందికి కదులుతోంది.

అతని చేతిస్పర్శ తన దేహంతో మాట్లాడుతోంది. కావాలనలేని సిగ్గు. వద్దనలేని బిడియం. అతని స్పర్శ తన మెడ ఒంపులో వేడిగా తగులుతోంది.

తనవల్ల కాని తమకం... ఒక్కసారిగా అతని వైపు తిరిగి అతనిగుండెల్లో తలదాచుకుంది. "ఇలానే నన్నెత్తుకుపోండి. మీకోసం ఇరవైరెండేళ్ళు తపస్సుచేస్తే దొరికారు.." అంది అల్లుకుపోతూ... గారాలుపోతూ...

"ప్రియంవదా..."

"ష్... మా ఏకాంతాన్ని డిస్టర్బ్ చేయొద్దు" మెల్లిగా గొణిగింది.

"హలో..." గట్టిగా వినిపించేసరికి కళ్ళు తెరిచింది. ప్రియంవద... కళ్ళెదురుగా కల... అలా ఆమె ఊహల్లోకి వెళ్ళిపోయింది.

"అప్పుడే ఊహలోకి వెళ్ళావా?" ఫ్రెండ్స్ కామెంట్స్‌తో సిగ్గుపడలేదు.

"తొందరగా పనిచూసుకుని వెళ్ళండే" అంది ముద్దుగా కసురుకుంటూ... ఫ్రెండ్స్ అలానే చూస్తూ ఉండిపోయారు.

"నువ్వు ప్రియంవదవి కావు. ప్రియం'వధ'వి... అయినా నువ్వేమో అతిసుకుమారివి. అతనేమో ఆర్మీ మనిషి. అంకుశంలో రాజశేఖర్‌లా ఉంటాడు.

నీకెలా నచ్చాడే... ఎప్పుడుచూసినా యుద్ధాలు... తుపాకులు... సరిహద్దుల్లో కాపలాలు..." ఇంకా ఏదో అనబోతుండగా వాళ్ళ నోళ్ళుమూసింది తన మాటలతో ప్రియంవద.

"దేశాన్ని ప్రేమించే మనిషి తన భార్యను ఇంకా అద్భుతంగా ప్రేమిస్తాడు. వందకోట్ల ప్రజల కోసం ఒక్కడు సైన్యమై కదిలే మనిషి, తన ఒక్కగానొక్క భార్యకోసం తానే అమ్మానాన్న అన్నీ తానై ఉంటాడు. ఇది నా స్ట్రాంగ్‌ఫీలింగ్.

అందుకే ఏరికోరి అగ్నిహోత్రతో మూడుముళ్ళు వేయించుకున్నాను. ఏడడుగులు నడిచాను. అతని కోసం ఎన్నివేల అడుగులైనా నడుస్తాను" స్థిరంగా చెప్పింది ప్రియంవద.

ఫ్రెండ్స్ అలానే చూస్తూ ఆ మాటలు వింటూ ఉండిపోయారు. ప్రియంవద ప్రాక్టికల్‌గా ఆలోచిస్తుంది. అనాథశరణాలయంలో పిల్లలను కాపాడ్డం కోసం తన ప్రాణాలను రిస్క్‌చేసిన అగ్నిహోత్ర సాహసాలను టీవీలోచూసింది.

అతని కాంటాక్ట్ నంబర్ తీసుకుంది. అమ్మానాన్నలను ఒప్పించింది. పెళ్ళి చేసుకుంది.

"ఆల్ ది బెస్ట్ ప్రియా... నువ్వెప్పుడూ రైటే..." సిన్సియర్‌గా అన్నారు ఫ్రెండ్స్. ఒక్కొక్కరు వెళ్ళిపోయారు. చివరగా ఆ గది దగ్గర ఆ సంభాషణ విన్న అగ్నిహోత్ర కూడా ముందుకు కదిలాడు.

భార్యమాటలు విన్న అతని ఛాతీ మరో రెండు అంగుళాలు పెరిగింది.

వాళ్ళ మొదటిరాత్రికి చిన్న బ్రేక్ పడింది. సరిహద్దుల్లో ఉగ్రవాదులు తెగబడ్డారు. దొంగదెబ్బతో మన సైనికుల మీద ఎటాక్ చేశారు. తెగబడిన



ముష్కరులకు బుద్ధి చెప్పే ఏకవ్యక్తి సైన్యం కావాలి. సీక్రెట్‌గా సర్జికల్ స్ట్రైక్ చేసే మెరుపువీరుడు కావాలి. మూడో కంటికి తెలియకుండా కుక్కకాటుకు చెప్పు దెబ్బ కొట్టాలి. చావుదెబ్బ కొట్టాలి.

అందుకే హోమ్ శాఖ అగ్నిహోత్రకు అత్యవసర సందేశాన్ని పంపింది. అర్ధరాత్రి రెండు గంటలకు ప్రత్యేక విమానంలో హైదరాబాద్ నుంచి బయలు దేరమని చెప్పింది.

అగ్నిహోత్ర ఎదురుగా తలొంచుకుని నిలబడి ఉంది ప్రియంవద. ఒక్కక్షణం ప్రియంవదను అలా చూస్తోంటే బాధగా అనిపించింది. తన గుండెలకు హత్తుకుని ఓదార్చాలనిపించింది.

మెల్లిగా తలెత్తి అగ్నిహోత్రవైపు చూసింది.

"నన్ను మీ గుండెలకు హత్తుకుని ఓదార్చాలని అనిపించడంలేదా?" అడిగింది అతనివైపే చూస్తూ.

ఎప్పుడూ సీరియస్‌గా ఉండే అగ్నిహోత్రకు నవ్వొచ్చింది. ఆశ్చర్యమూ కలిగింది. తన మనసులోని ఫీలింగ్ భార్యకెలా తెలిసింది?

"ఎలా తెలుస్తుంది అంటే మీరు కట్టిన తాళి నా గుండెలకు వేలాడుతుంది కాబట్టి. అది మీ మనసును ట్రాన్స్‌లేట్ చేస్తుంది" మంగళసూత్రాన్ని కళ్ళకు అద్దుకుని మొగుడివైపు చూస్తూ చెప్పింది.

అగ్నిహోత్ర ప్రియంవద వైపు చూసి "ఇప్పుడేం చేద్దాం?" అనడిగాడు.

"ఫస్ట్ నైట్ చేసుకుందాం" అనాలనిపించింది. అలా అంటే ఆర్మీ గుండె షాక్ తింటుందని ఆగిపోయింది. దానికి తోడు సిగ్గు అడ్డొచ్చింది. కాని అర్జెంటుగా తను యుద్ధభూమికి వెళ్ళాలి. ఎలా?

అప్పటికే సిటీలో వున్న హోటల్స్ పెళ్ళిళ్ళ సీజన్ కాబట్టి అన్నీ బుక్ అయ్యాయి.

ఇంట్లో అరేంజ్ చేద్దా మంటే బామ్మ ఆరోగ్యం బాగాలేదు. సిగ్గు విడిచి ఫ్రెండ్స్ ఇళ్ళుకూడా సెర్చ్ చేసింది. అసలే సమ్మర్.

పరీక్షల సీజన్... అలా అని అతడిని ఒంటరిగా పంపించడం ఇష్టం లేదు. అతని జ్ఞాపకం తన దగ్గర ఉండాలి. అతను ఎప్పుడు వస్తాడో తెలియదు. అతడితో మూడుముళ్ళు వేయించుకున్నాక అతనికి దూరంగా ఉండడం తనకు ఇష్టంలేదు.

అతను మరోవారం రోజులు ఉంటానన్నాడు. ఈ హడావుడి తగ్గాక హనీమూన్‌కు కాశ్మీర్‌లో ప్లాన్ చేశారు. కానీ ఈలోగా తప్పక వెళ్ళని పరిస్థితి.

సడెన్‌గా ఈ సీజన్‌లో రూమ్స్ దొరకడంకూడా కష్టమే. "పోనీ నేను మీతో రానా?" అమాయకంగా అడిగింది ప్రియంవద.

"నేను వెళ్ళేది యుద్ధానికి... హనీమూన్‌కు కాదు" మెల్లిగా అన్నాడు అగ్నిహోత్ర.

"ఫస్ట్ నైట్ కూడా యుద్ధమే" అందామనుకుంది కాని మొగుడు తట్టుకోలేడని ఆగింది.

"నేను అలా వెళ్ళి ఇలా వస్తాను" భార్యను అనునయిండానికి అన్నాడు అగ్నిహోత్ర.

"అలా వెళ్ళి ఇలా చిటికెలో, చిరు విరామంలో

రావడానికి మీలో ఎవరు కోటీశ్వరుడు ప్రోగ్రామా?" మొహాన్ని సున్నాలా చుట్టి అంది.

"నేను తిరిగి రానేమోనన్న భయమా?"

వెంటనే అతని పెదవులమీద తనచేతిని ఆన్చింది. ఆమె కళ్ళలో సన్నటి కన్నీటిపొర. "మీతో మూడుముళ్ళు వేయించుకున్నాక... మీ స్పర్శ నా వెన్నంటే ఉందనే ఫీలింగ్ కోసం..." అంతకుమించి చెప్పలేకపోయింది. ఆమె ఇష్టాన్ని, ఆమె కోరికను, ఆ కోరిక వెనుకవున్న తపనను అర్థంచేసుకున్నాడు.

"ఓకే...ఇప్పుడు మన ఫస్టనైట్ జరగాలి. అంతేకదా... ఫస్ట్ నైట్ తర్వాత నాతోపాటు నువ్వు ఎయిర్‌పోర్ట్‌కు వచ్చి నన్ను యుద్ధరంగానికి వీరపత్నిలా పంపించాలి... ఓకేనా?" ఆమె చుబుకాన్ని పైకెత్తి అడిగాడు.

చిన్న సంతోషం ఆమెను చుట్టేసింది అతనిలా వచ్చి. అగ్నిహోత్ర రంగంలోకి దిగాడు. పదినిమిషాల్లో ఆపరేషన్ శోభనానికి రంగం సిద్ధమైంది.

## ఎత్తుకున్నవారే

మధ్యతరం తార లిజి ముద్దుల కుమార్తె, 'హలో' నటి కల్యాణి ప్రియదర్శన్ చిత్రసీమలో అందరూ తనను ఎత్తుకున్నవారేనంటూ మురిపెంగా చెప్పుకున్నది. "టాలీవుడ్‌లో ఈ జనరేషన్ మినహాయించి, కోలీవుడ్, మాలీవుడ్‌లలో అందరితోనూ పరిచయాలున్నాయి. కొన్నాళ్ళు విదేశాల్లో ఉండడంవల్ల కొంత గ్యాప్ వచ్చింది.

ఎక్కడికైనా ఫంక్షన్‌కు వెళ్తే అమ్మ ఎవరోఒకర్ని పరిచయంచేస్తూ ఇదుగో నువ్వు ఎత్తుకుని తిరిగిన పిల్ల అని చెప్తుంటుంది. మా అమ్మ నటిగాకంటే ఓ వ్యక్తిగా నాకు ఎంతో ఇష్టం. చాలా పాజిటివ్‌గా వుండే వ్యక్తి" అని చెప్పింది.

"వాట్...? ఆశ్చర్యం... ఆనందం రెండూ కలిసిన గొంతుతో అడిగింది.

"యస్... స్లీపర్ కోచ్ శోభనం... హోటల్స్, గెస్ట్ హౌసెస్... చివరికి కళ్యాణ మండపాలు కూడా ఖాళీ లేవు. అందుకే హైదరాబాద్ టు విజయవాడ వెళ్ళాల్సిన స్లీపర్ కోచ్‌ను బుక్‌చేశాను.అన్ని బెర్త్‌లు మనవే... హైదరాబాద్ అంతా తిరుగుతుంది. సరిగ్గా అర్ధరాత్రి రెండు గంటలకు ఎయిర్‌పోర్ట్ దగ్గర ఆగుతుంది... అప్పటివరకూ మనం...'వెంటనే అతని పెదవులను తన పెదవులతో మూసేసింది.

ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది.ఇది కలా? నిజమా? స్లీపర్ కోచ్‌లో శోభనమా? సముద్రగర్భంలో పెళ్ళిచేసుకున్న వార్తలు చదివింది. గాల్లో అంటే ఆకాశంలోవిమానం ఎగురుతుండగా పెళ్ళి చేసుకున్న వాళ్ళను చూసింది. ఫస్ట్‌టైమ్...ఇలా స్లీపర్ కోచ్‌లో... ఆమె ఆనందం అందుక్కోదు... తన కోసం... తనను అపార్థంచేసుకోకుండా అర్థంచేసుకుని క్షణాల్లో ఇటువంటి ఆలోచన చేసినభర్తప్రేమ గుర్తొచ్చినందుకు.

అందరూ ముక్కున వేలేసుకునేలోగా హైదరాబాద్ టు విజయవాడ వెళ్ళే స్లీపర్ కోచ్ బయలుదేరింది. స్లీపర్‌కోచ్‌లోకి అడుగుపెట్టిన ప్రియంవద ఆశ్చర్యపోయింది. స్లీపర్ కోచ్‌ను శోభనంగదిలా అలంకరించిన భర్త ప్రేమకు దాసోహం అంది.



"ప్రియంవద... ఫీల్ ఫ్రీ... ట్యాంక్ బండ్, బిర్లా మందిర్, గోల్కొండ ఫోర్ట్, చార్మినార్... ఇలా అన్నీ చుట్టేసి... మనం మొదటిరాత్రి జరుపుకోబోతున్నాం" చెప్పాడు అగ్నిహోత్ర.

స్లీపర్‌కోచ్‌లో నీలిరంగు బల్బ్ వెలుతురు పహారా కాస్తోంది... స్లీపర్ కోచ్ వెళ్తూ ఉంది. విద్యుద్దీపాల కాంతిలో నగరం సుందరంగా కనిపిస్తోంది. మాయాబజార్‌లో లాహిరి లాహిరి లాహిరిలో అని జలవిహారం చేసినట్టు... స్లీపర్ కోచ్‌లో సరికొత్త అనుభవం.

డ్రైవర్‌కేబిన్ పూర్తిగామూసివేయబడిఉంది.భర్తను గట్టిగా చుట్టేసింది. ఇలాంటి భర్త తనకు మాత్రమే దొరుకుతాడు...యస్... ఆమెకళ్ళు తడిబారాయి.

స్లీపర్ కోచ్ ట్యాంక్ బండ్ దగ్గరికి వచ్చింది. అర్ధరాత్రి కావడం వల్ల జనసంచారం తక్కువగానే ఉంది. బుద్ధవిగ్రహం విద్యుద్దీపాల వెలుగులో వెలిగిపోతోంది. స్లీపర్‌కోచ్ మధ్యలో బ్లూ కార్పెట్‌మీద పడుకుంది.

పైట పక్కకు తప్పుకుంది. స్వచ్ఛందంగా... వాళ్ళ మధ్య తాను అడ్డు ఉండకూడదని... తెల్లటి పలుచటి ఆమె పొట్టమీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు అగ్నిహోత్ర "శృంగారం కూడా ఒక యుద్ధమే కదూ. యుద్ధంలో శత్రువులు ఉండకూడదు.... మన మధ్య సాన్నిహిత్యానికి ఈ ఆచ్ఛాదనలు శత్రువులేకదా.." అన్నాడు.

ఆమె సిగ్గుపడలేదు... బిడియపడలేదు...

ఆ క్షణమే వాళ్ళ శరీరాలనుంచి శత్రువులు తరిమివేయబడ్డారు. స్లీపర్ కోచ్ వెళ్తూనే ఉంది. బిర్లా మందిర్ కనిపిస్తోంది. అసెంబ్లీ దాటిపోతోంది.

"ఇక్కడ ప్రతిపక్షాలు అధికార పక్షాలు వైరివర్గాలు. కానీ మొదటిరాత్రి నఖక్షతాలు చుంబనక్షతలు ప్రత్యర్థులు... ఒకరినొకరు గెలిపించుకుంటారు" ఆమె హృదయభాగమ్మీద చుంబనక్షతం పలకరింపు సంతకాన్ని చేసింది.

స్లీపర్ కోచ్ కుదుపులు, రెండు శరీరాల మేనివిరుపులు... ఏసీ బస్సులో కూడా చెమటల్లు పడుతున్నాయి. స్లీపర్ కోచ్ గోల్కొండ ఫోర్ట్‌ను చుట్టేస్తోంది... నాటి చరిత్ర దర్పానికి, వాళ్ళిద్దరి మధ్య జరుగుతోన్న రోమాంచిత యుద్ధానికి కాలమే సాక్షి.

ప్రియంవద రెండు చేతులు అగ్నిహోత్రను చుట్టేశాయి. అతనికి గమ్మత్తుగా వుంది. శత్రువు, ఆయుధాలు యుద్ధాలు...ఇదీ తనప్రపంచం... ఇప్పుడు తన ప్రపంచం...ఒకసారి రెండుచేతులతో తననుచుట్టేసిన ప్రియంవదను చూశాడు. ఆమె ఒంటిమీద ఏ ఆచ్ఛాదనాలేదు. తననేదుప్పటిలా చుట్టేసుకుంది.

స్లీపర్ కోచ్ రోడ్డుమీద పరుగులు తీస్తూనే ఉంది. ఒంటరితనాన్ని... ఇద్దరూ వేరువేరనే ఏర్పాటును తరిమేసిన అపూర్వ సంగమం.... మనోశరీరాల సమాగమం. సమయం చకచకా కదులుతోంది. భావోద్వేగాలు స్పందిస్తున్నాయి. కిలికించితాలు నిట్టూర్పు లను ఆహ్వానిస్తున్నాయి.

చార్మినార్ వీళ్ళ ప్రేమను ఆశీర్వదించింది. భాగ్యనగరం వీళ్ళ ముచ్చట చూసి మురిసిపోయింది.

అర్ధరాత్రి- రెండు గంటలు కావడానికి పదినిమిషాలు మిగిలి ఉంది. స్లీపర్ కోచ్ ఆగింది.

మొదటిరాత్రికి మూడవసారి వీడ్కోలు చెబుతూ ఇద్దరూ లేచారు. అతను ఆర్మీ దుస్తుల్లోకి మారాడు. ఆమెభర్త తనకోసంతెచ్చిన పింక్‌కలర్ శారీ కట్టుకుంది. స్లీపర్ కోచ్ నుంచి బయటకు వస్తూ... "వెళ్ళి రానా?" అన్నాడు.

తల అడ్డంగా, నిలువుగా ఊపి అతని వైపు చూసింది. అతని ప్రేమ తాలూకు హ్యాంగోవర్‌లో నుంచి ఆమె ఇంకా బయటకు రాలేదు.

ప్రత్యేక విమానం రన్ వే మీద ఉంది...

అతనికి వీడ్కోలు చెబుతూ అంది...

"యుద్ధక్షేత్రమైనా, శృంగక్షేత్రమైనా గెలుపు మీదే.. నన్ను గెలిచిన మీరు...శత్రువులను గెలిచి వచ్చేవరకూ ఎదురుచూస్తాను. అప్పటివరకూ మీ జ్ఞాపకాలతో సంగమిస్తూనే ఉంటాను" విమానం గాల్లోకి ఎగిరింది. స్లీపర్ కోచ్ ఒక జంట మధురోహాలను తన జ్ఞాపకాల్లో పదిలపర్చుకుని అగ్నిహోత్రకు టాటా చెప్పింది.

ఇరవైనాలుగు గంటల తర్వాత...

బ్రేకింగ్ న్యూస్... తెగబడ్డ ఉగ్రవాదులను ఉగ్రనరసింహమై తెగనరికిన భారతీయ సింహం సర్జికల్ స్ట్రైక్... అన్న వార్త... అగ్నిహోత్ర ఫోటో...

ప్రత్యేక విమానం మరికొద్దిక్షణాల్లో హైదరాబాద్‌లో ల్యాండ్ కాబోతోంది.

ఎయిర్‌పోర్ట్‌లో నిలబడి అభిసారికలా ఎదురు చూస్తోంది ప్రియంవద అగ్నిహోత్ర రాకకోసం... ఆమెతోపాటు స్లీపర్ కోచ్ కూడా... ⓢ



# ప్రత్యక్షనారాయణుడి పుట్టినరోజు

ఎంతటి సామాన్యుడైనా కూడా తనపుట్టిన రోజుని తన శక్తిమేరకి జరుపుకుంటాడు. ఆ రోజున అతని తల్లిదండ్రులు పొందే ఆనందం అంతా ఇంతా కాదు.

మరి మన పుట్టినరోజుని ఇంత గొప్పగా జరుపుకుంటూ-ఈ ప్రపంచాన్ని ప్రతిరోజూ తాను ఉదయించి మనకి చూపిస్తున్న ఆ సూర్యుని పుట్టినరోజుని మాత్రం ఎందరో చేయడంలేదు.

వేదీ మధ్యే లలిత కమలే కర్ణికాయాం రథస్థః

సప్తార్కో ౨ శ్వో ౨ రుణరుచి వపు స్సప్తరజ్జుర్ద్వి **బాహుః** అంటూ ఆ సూర్యభగవానుని స్తుతిస్తూ వివరాలు తెలుసుకుందాం!

## పుట్టుపూర్వాలు

అరవైసంవత్సరాల్లోనూ మొదటిదైన ప్రభవ అనే సంవత్సరంలో, ఆ సంవత్సరంలోని రెంటిలో మొదటిదైన ఉత్తరాయణంలో, ఆ అయనంలోని మూడు ఋతువుల్లోనూ చివరిదైన శిశిర ఋతువులో.

ఆ ఋతువులో ఉండే రెండు మాసాల్లోనూ మొదటిదైన మాఘమాసంలో, ఆ మాసంలోని రెండు పక్షాల్లో మొదటిదైన శుద్ధపక్షంలో, ఆ పక్షంలో ఉండే తిథుల్లో ఏడవదైన సప్తమీ తిథిలో,

వారంలో మొదటిదైన ఆదివారంనాడు, నక్షత్రాల్లో మొదటిదైన అశ్వనీ నక్షత్రంలో, తల్లిదండ్రులైన అదితి-కశ్యపులకి పుట్టాడు సూర్యుడు. అందుకే ఈయనకి 'ఆదిత్యుడు, కాశ్యపేయుడు' అనే పేర్లు ఆ పేర్లున్న తల్లిదండ్రుల కారణంగా వచ్చాయి.

ఎర్రని గంధాన్ని పూసుకుని, ఎర్రని పూమాలలు వేసుకుని, ఎర్రని రంగు రథంలో, ఎర్రని గొడుగు కింద, ఎర్రని జెండా రథం వేగంగా వెళ్తూంటే, ఎర్రని వస్త్రాలని ధరించి కన్పిస్తాడు సూర్యుడు.

(రక్తవర్ణం రక్తగంధం రక్తపుష్పం... మేరుం ప్రదక్షిణీ కుర్వాణమ్)

ఈయనకిష్టమైన లోహం బంగారం. ఆకారం గుండ్రనితనం. తన ప్రతాపాన్ని చూపే వారం ఆదివారం. తన శక్తిని విజృంభించి చూపించే ఋతువు గ్రీష్మం. తనకిష్టమైన మాసం వైశాఖం. తన వేడిమిని కలిగిన నక్షత్రం కృత్తిక. తన పేరుతో సమానమైన పేరున్నఆకారమున్న తన రంగుతో పోలిక ఉన్నఫలం రేగుపండు.తనపేరుతో ఉండేపత్రం జిల్లేడాకు.

అందుకే ఈ రథసప్తమి నాడు చెరో భుజం మీద చెరో జిల్లేడాకునీ వేసి తలమీద మరో జిల్లేడాకునుంచి వాటిమీద రేగుపండ్లని పెట్టుకుని ఒకసారీ, అలాగే రెండోసారీ (ఇక్కడికి 3+3 ఆరు జిల్లేడాకులూ, 3+3 రేగుపండ్లూ నదినీటిలోకి వెళ్ళిపోతాయి) ఇక మూడో సారి మాత్రం కేవలం శిరసుమీదే జిల్లేడాకునీ, రేగుపండునీ పెట్టి మునుగుతారు.

మొత్తానికి 7 ఆకులూ 7 పళ్ళుతో స్నానాన్ని ముగిస్తారు సంప్రదాయధోరణిలో.

ఆదిత్యహృదయ స్తోత్రాన్ని గాని, సూర్యునికి సంబంధించిన శ్లోకాన్ని గాని, ఇవేమీ రానిపక్షంలో 'ఓం మిత్రాయ నమః' అంటూ గాని తలారా పారే నీటిలో స్నానాన్ని చేయాలి ఈ రోజున.

**'యద్యద్ జన్మకృతం పాపం మయా జన్మసు సప్తసు, తత్తత్ జన్మకృతం పాపం హర మే రథసప్తమి'** అనే శ్లోకాన్ని ప్రసిద్ధంగా చదువుతూ స్నానంచేస్తారు.

## గడియారం ఈయన చలవే!

మనం గడియారాన్ని చూడగలుగుతున్నామంటే అది సూర్యుని చలవే. ఈ గడియారపు గుండ్రనితనం సంవత్సరం.దీనిలో కన్పించే 12 అంకెలూ 12 నెలలు. 12 అంకె నుండి 6 అంకె వరకూ నిలువుగా గీతగీసి దీన్ని రెండుచేస్తే అవే ఉత్తరాయణ దక్షిణాయనాలౌతాయి. ఇటు ఆరూ అటు ఆరూ క్రమంగా ప్రతి రెండు నెలలుగానూ విడిపోయి 6 ఋతువులౌతాయి. అవే వసంతం గ్రీష్మం వర్షం శరత్ హేమంత శిశిర ఋతువులనేవిగా పిలువబడుతున్నాయి.

కాలాన్ని కొలిచే మూడు ముళ్ళలో సెకన్లముల్లు వర్తమానానికి సంకేతం. దీనిమీద ఆధారపడ్డ నిమిషాల ముల్లు భవిష్యత్తుకి సంకేతం. ఎంతకాలం జరిగిపోయిందో తెలియజేసే చిన్నముల్లు భూతకాలానికి సంకేతం. ఇలా 3 కాలాలూ ఉంటాయని చెప్పే గడియారం తద్ధర్మకాలానికి సంకేతం.

ఈ గడియారాన్ని సరిగా నడిచేలా తన అధీనంలో ఉంచుకుని నడిపేవాడు శ్రీహరి **(ఋతుస్సుదర్శనః కాలః - కాలో ౨ స్మి లోకక్షయకృత్ - శుక్లాంబరధరం విష్ణుమ్...)**

ఈయన లేనిదే 84 లక్షల జీవరాసులకీ అన్నమే లేదు. ఉండదు. ఆరోగ్యం క్షీణిస్తుంది కూడా. తన కిరణాన్ని భూమి లోపలిదాకా ప్రసరించేలా చేసి భూమిమీద ఉన్న చెట్లకింది వేరుకి భూమిలో అడుగున దాగిన నీటిని పైకి రప్పించి మరీ అందించి వాటి ప్రాణాల్ని కాపాడుతూ ఉంటాడు.

తనవంశంలో జన్మించిన రామచంద్రుడు రావణ యుద్ధఘట్టంలో చింతాక్రాంతుడై ఉన్నప్పుడు తన శక్తిని అగస్త్యుని ద్వారా రామునికి పంపించాడు. అదే ఆదిత్యహృదయ స్తోత్రంగా అయింది. సూర్యునికి కొత్తబియ్యంతో ఆవుపేడపిడకల మీద పొంగలిని వండి నేడు నైవేద్యంగా పెడితే చెప్పలేనంతటి ఆరోగ్యాన్ని స్తాడాయన. ది ౨ యోయోనః ప్రచోదయాత్.

రథసప్తమి 24.1.2018

# అంతా రాజకీయమే

## మాయ దెబ్బ

గుజరాత్‌లో గెలిచిన బి.జె.పి., ఓడిన కాంగ్రెస్‌లు రెండూ తమ పార్టీ పరిస్థితులను అంచనావేసుకుంటున్నాయి. నిన్నటివరకు తమతో వున్న వర్గాలు ప్రభుత్వ నిర్ణయాలతో దూరంగా జరిగాయని బి.జె.పి. భావిస్తుండగా, కాంగ్రెస్ పార్టీ తమ ఓటమిని మాయ దెబ్బ శాసించింది అనుకుంటున్నారు. గుజరాత్ ఎన్నికల్లో కాంగ్రెస్‌కి మద్దతు ఇవ్వలేదు మాయావతి.

బహుజనుల పార్టీ బి.ఎస్.పి. ఆ పార్టీ అభ్యర్థులు పలు నియోజకవర్గాలలో పోటీచేశారు.

ఇప్పుడు ఫలితాలను విశ్లేషిస్తే దాదాపుగా 12 నియోజక వర్గాలలో కాంగ్రెస్ ఓటమికి బి.ఎస్.పి. అభ్యర్థి కారణమని తేలింది.

ఆ పన్నెండు నియోజకవర్గాలలో బి.జె.పి. అభ్యర్థులు గెలిచింది వెయ్యి ఓట్లకులోపు మెజారిటీతోనే కాగా, బి.ఎస్.పి. అభ్యర్థులు 2000 ఓట్ల వరకు సాధించారు. బి.ఎస్.పి. పోటీలో లేకుంటే ఆ ఓట్లన్నీ తమకే దక్కి ఆ పన్నెండు సీట్లతో తాము గుజరాత్‌లో అధికారంలోకి వచ్చి వుండేవారం అని కాంగ్రెస్ భావిస్తున్నది. ◆

## ఆర్థికంగా అటూ...ఇటూ

భారత ఆర్థిక వ్యవస్థ ఊగిసలాటలో వుంది. భారత్ అభివృద్ధి సూచిక గత నాలుగేళ్ళలో కనిష్ఠ స్థాయికి పడిపోయినా ప్రపంచంలోని పలు ఇతర దేశాలకన్నా మెరుగ్గావుండటం ఒక విశేషం.

అయితే ఇది తాత్కాలిక వెనకడుగే కాని మున్ముందు పెరుగుతుందనే, ప్రపంచంలోని ఆర్థిక వ్యవస్థలో మూడో స్థానానికి చేరుతుందని కొన్ని సంస్థలు అంచనావేస్తున్నాయి.

దీనికి సాక్ష్యంగా కొన్ని రంగాలలో అతివేగంగా పెరుగుతున్న పెట్టుబడులు చూపుతున్నారు.మరోవైపు భారత్ ఆర్థిక పరిస్థితిమీద ఆందోళన ప్రకటిస్తున్నాయి అంతర్జాతీయ పత్రికలు కొన్ని.

ఆశించినమేరకు ఆర్థిక వృద్ధిలేక పరిశ్రమలు కుదేలు అవుతున్నాయి. ఉద్యోగాలు ఊడుతున్నాయి. మేక్ ఇన్ ఇండియా ఏమైందో తెలియటం లేదు అన్నది ఆ పత్రికల వివరణ.

ఇటువంటి ఊగిసలాటలో వున్న ఆర్థికరంగానికి కొత్త పుష్టిని తీసుకురాగలిగిన సత్తా నరేంద్రమోడీ ప్రదర్శించాల్సి వుంటుంది. ◆

## కరెంట్ షాక్‌లు

ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాలుగా విడిపోయినప్పుడున్న విద్యుత్ గోల ఇప్పుడు లేదు.

ఈ మూడున్నర ఏళ్ళలో ఎవరి విద్యుత్ గోలలో వారున్నారు. ఒకరు రైతులకు 24 గంటల విద్యుత్ అని ప్రచారం చేసుకుంటున్నారు... మరొకరు విద్యుత్ ధరలు పెంచటంలేదు చూశారా అని గొప్పలు చెప్పుకుంటున్నారు. హఠాత్తుగా రెండు రాష్ట్రాలకు విద్యుత్ ఎక్కడినుండి వస్తోంది! ఏమన్నా సొంతంగా ఉత్పత్తి పెంచుకున్నారా!

ఒకవేళ ఉత్పత్తి పెంచుకునివుంటే విద్యుత్ ఛార్జీలు తగ్గించాలి కదా!

రెండు రాష్ట్రాలలో యూనిట్ ధర తగ్గలేదు. అసలు ఘనత కేంద్రంలోని మోడీ ప్రభుత్వానిది. ఆయన మంత్రి పీయూష్ గోయల్‌ది.

విద్యుత్ సరఫరాని మెరుగుపరిచి,ఒక ప్రాంతంలోని అదనపు విద్యుత్‌ని మరో ప్రాంతంలోకి అందించగలిగిన వ్యవస్థను రూపొందించాడు పీయూష్ గోయల్.

దీనితో ఎవరు విద్యుత్ కొనుక్కుంటామంటే వారికి విద్యుత్ అందుబాటులో వుంది.

అయితే ఇతర రాష్ట్రాలనుండి తక్కువ ధరకు కొంటున్న సమయంలో కూడా ప్రజలకు మాత్రం యూనిట్ ధర తగ్గించకుండా లాభం పొందుతున్న పరిస్థితి రాష్ట్రాలలో వుంది. ◆

## ప్రాంతీయ కట్టడి

వచ్చే లోక్‌సభ ఎన్నికల్లో గెలవాలంటే ఉత్తర భారతదేశంలో తగ్గ సీట్లను ఇతర రాష్ట్రాలనుండి సంపాదించుకోవాలన్నది బి.జె.పి. ఆలోచన.అందుకోసం బి.జె.పి దృష్టిసారించే రాష్ట్రాలన్నింటిలో ప్రాంతీయ పార్టీలు అధికారంలో వున్నాయి.

ఆ ప్రాంతీయ పార్టీల నేతలు శక్తివంతులు. వారు ఇతర రాష్ట్రాలలోకి ప్రచారంలోకి దిగితే బి.జె.పికి ఇబ్బందులు తప్పవు.

అందుకని ఆ ప్రాంతీయ పార్టీల నేతలను వారి వారి రాష్ట్రాలకే పరిమితం చెయ్యాలన్నది అమిత్ షా ఎత్తుగడ. ఆ ఎత్తుగడలో దాదాపుగా విజయం సాధించాడు బెంగాల్‌లో.

మమతా బెనర్జీ ఇప్పుడు బెంగాల్ దాటిరాలేని పరిస్థితి. త్రిపురలో ప్రచారానికి వెళితే భంగపడతానేమోనన్న భయం మమతాబెనర్జీలో తెప్పించాడు అమిత్ షా. ఇక నవీన్ పట్నాయక్ పరిస్థితి మరీ ఇబ్బంది.ఆయనకు ఒడిషా భాషే సరిగా రాదు.

ఇక పొరుగు రాష్ట్రాలకు వెళ్ళలేడు. అక్కడ బి.జె.పి. చేసే ప్రచారం ఆయన్ని ఇబ్బందిలో పడేస్తున్నది. ఇప్పుడు ఎ.పిలో చంద్రబాబును అలాగే నిర్బంధనం చేయాలన్నది ఎత్తుగడ. తమిళనాడులో రజనీకాంత్‌ని చూపి ఇతర ప్రాంతీయ పార్టీలను నిలువరించే పనిలో వున్నాడు అమిత్‌షా. ◆

## మరో అవినీతి మంత్రి

ఇతర రాష్ట్రాలలో అవినీతి అధికారులు అధికంగా పట్టుబడుతుంటే కేరళలో మంత్రుల అవినీతి బయటపడుతోంది. కేరళలో అధికారంలో వున్నది. నిరంతరం పేదలకోసమే అని చెప్పుకునే వామపక్ష ప్రభుత్వం. ఆ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత అవినీతి ఆరోపణలో దొరికిన నాల్గవమంత్రి ఒక మహిళా మంత్రి.

ఆ రాష్ట్రంలో ఆరోగ్య, సామాజిక న్యాయ శాఖలు నిర్వహించే కె.కె.శైలజ తన భర్త అనారోగ్యంతో ఆసుపత్రిలో చేరితే ఆ ఖర్చు బిల్లులన్నీ ప్రభుత్వం నుండి తీసుకుంది. అదేమి తప్పు అని ఆమె వాదిస్తోంది. అయితే ఆమె భర్త హెడ్మాస్టర్‌గా చేసి పింఛను అందుకుంటున్నాడు.

ఆయనకు పింఛనుదారుడిగా ప్రభుత్వంనుండి ఆరోగ్య సౌకర్యాలు అందుతున్నాయి.

వాటితోపాటుగా ఈ దొంగబిల్లుల డబ్బులు పొందటమే ఆ మంత్రిగారి కక్కుర్తి.ఆమె 23 వేల రూపాయలు పెట్టి ఒక కళ్ళజోడు కొనుక్కుని ఆ బిల్లును ప్రభుత్వమే చెల్లించేలా చేసింది.

ఇవన్నీ కేరళ ప్రభుత్వం విజిలెన్స్ విభాగపు దర్యాప్తులో బయటపడ్డాయి. ◆

## తలాక్ రాజకీయం

తలాక్‌లిచ్చి భార్యను వదిలించుకునే ముస్లిమ్ మగాళ్ళమీద సుప్రీమ్‌కోర్టు కన్నెర్రచేసి కొత్త చట్టం తెమ్మని కేంద్రాన్ని ఆదేశించింది.

దానికి అనుగుణంగా కొత్త చట్టాన్ని తెచ్చింది మోడీప్రభుత్వం. ఆ బిల్లుతో ముస్లిమ్ మహిళలకు మేలు చేకూరుతుంది.వివాహ భద్రత వస్తుంది.

ఆ బిల్లు లోక్‌సభలో ప్రవేశపెట్టినప్పుడు ఎటువంటి అభ్యంతరం చెప్పని కాంగ్రెస్‌పార్టీ ఆ బిల్లు రాజ్యసభకు రాగానే అడ్డుపడింది.

ఆ బిల్లును సెలక్ట్ కమిటీకి పంపాలని పట్టుపట్టింది. అయితే అసలు కారణం తలాక్ చట్టాన్ని రాజకీయం చెయ్యాలనేదే.

అందువల్ల రాజ్యసభలో తలాక్ బిల్లును అడ్డుకుని ముస్లిమ్ పురుషుల ఓట్లు ఆకట్టుకోగలం కదా అని కాంగ్రెస్ థింక్‌టాంక్ అనుకున్నదట.

అందుకే లోక్‌సభలో 'నో' చెప్పని కాంగ్రెస్ పార్టీ రాజ్యసభలోకి వచ్చేసరికి బిగ్గరగా 'నో' అంటూ అడ్డుపడుతోంది.

డబ్బు విషయంలో ఎదురుదెబ్బలు తగలకుండా వుండాలంటే సమస్యను మొగ్గలోనే తుంచేయాలి. అలా తుంచివేస్తే వరుసగా దెబ్బలు తగలటాన్ని నిరోధించగలుగుతారు. మీ ఎదుగుదలను అలా పైపైకి పెంచుకుంటూ పోయే సంఘటనలు ఏర్పాటు చేసుకోవాలనుకుంటే మీ వేగాన్ని కొంచెం కూడా తగ్గించకండి.



సురేష్ పద్మనాభన్

There is no rule for trying




Cell : 81860 00039 www.themoneyworkshop.com

మంచు చరియలు విరిగిపడటం అనేది చిన్న చిన్న రాళ్ళు లేదా మంచు బంతులు జారిపడటంతో మొదలవుతుంది. ఆ తర్వాత నెమ్మదిగా ఆ మంచుబంతుల పరిమాణం పెరుగుతుంది. మంచు జారటం అధికమవుతుంది. అలా జలజలా రాలే ఆ మంచు పెనుప్రమాదంగా మారి వేలవేల టన్నుల మంచుగా కురిసి మనుషులను, చివరిగా గ్రామం మొత్తాన్ని ముంచివేస్తుంది.

సరిగ్గా డబ్బుకు అటువంటి సూత్రమే వర్తిస్తుంది. డబ్బు పెరగటం వరుసగా జరుగుతుంది. అదే విధంగా డబ్బు పోవటం మొదలుపెడితే అంతేవేగంగా పోతుంది. ఒక వరుసలో డబ్బులు పోతాయి.

ఆరోజంతా మహా హుషారుగా గడిచిపోతుంది.

మీరు సృష్టించిన ఆ అనుకూల వాతావరణం వల్ల అన్ని పనులు మీరు అనుకున్న రీతిలో సాగిపోతుంటాయి. ఇది మీరు కోరుకున్నా, వద్దనుకున్నా జరిగేటువంటిది.

మంచుచరియ విరిగిపడేవరకు ఎందుకు వేచి వుండాలి. మీరే అది విరిగిపడేలా చేయవచ్చుకదా.

ఉన్నతస్థానంలో కావలసినన్ని ఖాళీలు వున్నాయని అంటారు. కాని ఆ స్థానాలను పనికిమాలినవారు ఆక్రమించి తిష్ఠవేస్తే? పనికిమాలినవారనేదానికి మన నిర్వచనం ప్రకారం అసమర్థులైనవారు.

కాని వారు మీ సంస్థలో భాగస్వాములు. వారు సంస్థలోనుండి బయటకు తోసెయ్యాల్సిన ఆ పనికిమాలిన వ్యక్తి ఎవరు అనేటువంటిది.

పనికిమాలినవారిలో కూడా కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. ఒకసారి ఒక ఉన్నతస్థానానికి చేరిన తర్వాత తన చుట్టూ చేరిన చవటగాడిదలవల్ల వారి స్థానానికి ఎటువంటి ముప్పు వుండదు.

కనుక వారితో వుండటంలో సౌఖ్యం పొందుతారు. తెలివిగలవారు సమర్థులు తమ దగ్గరకొస్తే ఇబ్బంది పడతారు. అందుకే సమర్థతగలవారంతా ఏదో ఒక చిన్నా చితకా పనిలో ఎప్పుడూ నిమగ్నమయివుండేలా చూస్తారు. ఆ పనికిమాలిన వ్యక్తి మీకు బాగా ఆప్తుడై వుండవచ్చు లేదా మీ బాబాయి, మామయ్య వంటి

## ఇది చదివినవారికి డబ్బు వశమవుతుంది

కాబట్టి డబ్బు విషయంలో ఎదురుదెబ్బలు తగలకుండా వుండాలంటే సమస్యను మొగ్గలోనే తుంచేయడం మంచిది. ఆవిధంగా తుంచివేయడం వల్ల వరుసగా దెబ్బలు తగలటాన్ని నిరోధించగలుగుతారు.

మీ ఎదుగుదలను అలా పైపైకి పెంచుకుంటూ పోయే సంఘటనలను ఏర్పాటుచేసుకోవాలనుకుంటే మీ వేగాన్ని ఏమాత్రం తగ్గించకండి.

ఒక్కక్షణం ఆగి మీ దగ్గరున్న డబ్బును లెక్కపెట్టుకోవటం కూడాచేయకండి. అలా ఆగితే మీ దృష్టి ప్రధాన అంశం మీది నుండి మరలొచ్చు లేదా సంపాదించింది చాలులే అన్పించవచ్చు.

మరీ ఎక్కువసేపు ఆగిపోతే మీ ఎదుగుదలమీద మీకే సందేహం ఏర్పడవచ్చు. కాబట్టి మీ ప్రయాణం సాగించండి. దీనినే అలలపై స్వారీ చేయటం అంటారు. ఇటువంటి అనుభవం మీకు దినవారీ పనుల్లో కూడా కనిపిస్తుంది.

ఉదాహరణకు మీరు ఒకరోజు ఉదయాన్నే చేపట్టిన పని అనుకూలంగా జరిగిందనుకోండి.అప్పుడు

తమ బాస్‌లకు అనుకూలంగా తెలివిగా రాజకీయాలు నడపటంద్వారా ఆ స్థానంలో స్థిరపడ్డారు. ప్రతి సంస్థ ఇటువంటి సిబ్బందిని కలిగివుంటుంది.

వీరు తమ చేష్టలతో పైవారిని ఆకట్టుకుంటారు. సంస్థ అభివృద్ధిని అడ్డుకుంటారు. ఇతర ఉద్యోగస్తుల మనోస్థైర్యాన్ని దెబ్బతీస్తారు.

వారు చేసేటువంటిపనుల వల్ల కంపెనీకి ఒనగూడే లాభం చిలిగవ్వవుండదు. ఇది చదువుతుంటే మీలో రెండురకాల ప్రతిస్పంద నలు కలుగుతాయి. ఒకటి మీలో కోపం, తీవ్ర కోపం కలుగవచ్చు.

ఒకవేళ మీకు కోపం వచ్చివుంటే ముందుగా మిమ్మల్ని మీరు పరిశీలించి చూసుకోండి.

మీలో కూడా ఆ పనికిమాలినవారి లక్షణాలున్నాయేమో! లేదా మీకు ఆనందం కలుగవచ్చు. మీరు ఎదుర్కొంటున్న సమస్యను ఎవరో ఒకరు గుర్తించి దాని పరిష్కారం గురించి ఆలోచన చేస్తున్నారనే భావం వల్ల ఆనందం కలుగవచ్చు.

అయితే మీరు స్పష్టంగా తెలుసుకోవాల్సింది మీ

బంధుగణంలోనివాడై వుండవచ్చు.

అయినా ఫరవాలేదు.వారిలో మనం పైనవర్ణించిన లక్షణాలు సరిపోతాయి కదా.మరి ఇటువంటివారిని సంస్థలన్నీ ఎందుకు భరిస్తున్నట్టు?ఎందుకంటే సంస్థ అత్యున్నతస్థానంలోని వ్యక్తులకు వీరు బాగా 'సోప్' రాస్తారు. వారికి బాగా తైరుకొడుతుంటారు.

వారికి ఆ 'సోప్' ఆనందంగా వుంటుంది. ఇప్పుడు మీరు ఏదో ఒకదాన్ని ఎంచుకోవాల్సివుంటుంది. సోప్ పూయటమా,డబ్బా,పని సామర్థ్యమా, డబ్బును, పని సమర్థతను మీ అస్త్రాలుగా ఎంచుకుంటే పైనవున్న పనికిమాలినవారిని మెడపట్టి గుమ్మంలోనుండి బయటకు నెట్టివేయగలుగుతారు.

మీరు కూడా సోప్ పూయటమనే మార్గమే ఎంచుకున్నట్లయితే మిమ్మల్ని మరెవరోతోసేవరకు ఎదురుచూస్తూ కూర్చోండి. కాబట్టి పనికిమాలినవారిని తోలివేయటమో లేక మీ స్థానమే కదిలిపోవటమో ఈ రెండింటిలో ఏదో ఒకటి ఎంచుకోండి.

(వచ్చేవారం వస్తా)




# ఆన్‌లైన్ కొనుగోలుపై "అదుపు ఎలా"

ఇప్పుడు ఇష్టమైనవి కొనుక్కోవటం చాలా సులభమైంది. ఇదివరలోలాగా తయారై షాపింగ్‌కి వెళ్ళనవసరంలేదు. షాపింగ్‌కి ఎవరు తోడు వస్తారా అని అడగనక్కరలేదు. ఒక్కొక్క షాపుమెట్లు ఎక్కి దిగాల్సిన అవసరం లేదు. అన్నీ తీయించి కొనకపోతే షాపువాడు ఏమైనా అనుకుంటారేమోనన్న మొహమాటం లేదు. ఇప్పుడంతా ఆన్‌లైన్‌లోనే.

అలా టిక్‌టిక్‌మనిపిస్తే కోరుకున్న వస్తువు ఇంటి గుమ్మంలోకి వస్తుంది. లెక్కలేనన్ని 'E' షాపింగ్ సంస్థలు వచ్చాయి. తాము అందించగలిగిన వస్తువులన్నింటిని అందంగా ప్రదర్శిస్తున్నాయి.

చీరలు కట్టుకుంటే ఎలా వుంటుందో మోడల్స్‌కి కట్టి మరీ చూపిస్తున్నారు.ఒక్కొక్క వస్తువు ఎలా పని చేస్తుందో కూడా స్క్రీన్ మీద ప్రదర్శిస్తారు. చెయ్యవలసిందల్లా నచ్చినదానిని ఎంచుకోవటం, దానికి తగిన డబ్బు ఆన్‌లైన్‌లో చెల్లించటం.

కొందరు వస్తువు మీ చేతికి చేరినతర్వాత డబ్బు చెల్లించే సౌకర్యం ఇస్తున్నారు.షాపింగ్ ఎంతోసులభమైంది. 'E' షాపింగ్‌కి చాలామంది భారతీయులు అలవాటుపడుతున్నారు. ముఖ్యంగా మహిళా వినియోగదారులు ఈ పద్ధతిని వినియోగిస్తున్నారు.

గడచిన మూడు సంవత్సరాలలో ఆన్‌లైన్‌లో వస్తువులు కొనుగోలుచేసేవారు 8 కోట్ల నుండి 9 కోట్లకు చేరారు. వీరంతా కలిసి కొనుగోలు చేస్తున్న వస్తువుల విలువ 2016లో దాదాపు 5 లక్షల కోట్లుగా వుండగా అది 2018 నాటికి దాదాపు 9 లక్షల కోట్లకు చేరుతుందని అంచనా.ఇంతగా అమ్మకాలు పెరగటానికి కారణం ఆ అమ్మకాలు అందించే సౌకర్యమే.

భారతీయులలో పెరిగిన ఆన్‌లైన్ కొనుగోలు ఆసక్తిని విదేశీ కంపెనీలు బాగా ఉపయోగించుకుని లబ్ధిపొందుతున్నాయి. దుస్తులు, పాదరక్షలు వంటివి ఇప్పుడు అధికశాతం ఆన్‌లైన్‌లోనే కొంటున్నారు.

అందాన్ని ఇనుమడింపచేసే వస్తువులు ఆ పద్ధతిలో కొంటున్నారు. సౌకర్యం సంగతి మాట ఎలా ఉన్నా భారతీ యులు ఆర్థికంగా భారీగా నష్టపోతున్నారని సర్వేలు తెలియజెపుతున్నాయి.

ఆన్‌లైన్ కొనుగోలుకు అలవాటుపడి అవసరం లేని వస్తువులను ఎక్కువగా కొంటున్నారు. వ్యాపార ప్రకటనలు ఒకవైపు, ఆ యా సంస్థలు అందించే ఆఫర్స్ మరోవైపుకలిసి భారతీయ మహిళలను కళ్ళు తిప్పుకోనివ్వనివిధంగా ఆన్‌లైన్ బానిసలుగా మారుస్తున్నాయి. ఖాళీదొరికితే ఆన్‌లైన్ వెబ్‌సైట్‌లోకి వెళుతున్నారు. అందులోదొరికే వస్తువులన్నింటిని వెతుకుతున్నారు. పిల్లలు అమెరికాలో వుంటే ఆన్‌లైన్ కొనుగోళ్ళు మరింత పెరుగుతున్నాయి.

అమెరికా ఒకసారి వెళ్ళి వచ్చిన తర్వాత అక్కడ పిల్లల ఇళ్ళల్లో కనిపించినవన్నీ తమ ఇంటిలోకి సేకరించుకునే యత్నం చేస్తున్నారు.

విదేశీ వాతావరణం, అవసరాలు భిన్నమైనవనే విషయం మరచిపోతున్నారు. విదేశాలలో వున్నవారి ఆదాయాలు భిన్నమైనవి. వారితో పోల్చుకుని చేస్తున్న వృథా ఖర్చు, ఆన్‌లైన్ బ్యాంకింగ్ సౌకర్యం ద్వారా కరెన్సీ కళ్ళఎదుట కనిపించకుండా చెల్లింపులు జరిగిపోతున్నాయి. ఇదంతా తమ సంపదను పరోక్షంగా దోచేస్తున్న వైనం మరచిపోతున్నారు.

ఆన్‌లైన్ కొనుగోలు ఒక హాబీగా తయారైంది. ఇది ఇంటి బడ్జెట్‌ని దెబ్బతీస్తున్నది. వున్నవారిని చూసి మధ్యతరగతివారు అనుకరించి క్రెడిట్‌కార్డు ఊబిలో ఇరుక్కుపోతున్నారు. అటువంటి ఆన్‌లైన్ అలవాటునుండి బయటపడాల్సిన అవసరముంది. అందుకు తగిన మార్గాలున్నాయి. వీటిని అర్థంచేసుకుని, అనుసరిస్తే ఆదాచేసుకున్నవారవుతారు.

## → అవసరమైతేనే

ఏదైనా ఒక వస్తువు కొనాలనిపించినపుడు వెనువెంటనే కొనక ఆ వస్తువు అవసరమా! కాదా! అనే విషయం ఆలోచన చేయటం అవసరం.

ఒక వస్తువు మీద ఇష్టం వుండటం వేరు, దానిని కొని ఉపయోగించటం వేరు. అందంగా కనిపించిన ప్రతిదీ ఉపయోగపడుతుందని లేదు. కాబట్టి ఆన్‌లైన్‌లో స్క్రీన్‌మీద అందంగా కనిపించగానే ఆ వస్తువు మీద క్లిక్ కొట్టక ఆ వస్తువు అవసరం గురించి కొద్దిసేపు ఆలోచించాలి. వస్తువు కొనటం అనేది అవసరం మీద ఆధారపడితేనే దానికి అర్థం.

స్క్రీన్‌మీద చూసిన ప్రతి వస్తువు అందంగానే వుంటుంది. అద్భుతంగా పనిచేసే వస్తువుగానే దాని ప్రచారం వుంటుంది. వాస్తవంలో స్క్రీన్‌మీద చూసిన వాటిలో 90 శాతం వస్తువులు కొనాలని అనిపిస్తాయి.

# ఆన్‌లైన్‌కి బడ్జెట్

కాని వాటి అవసరం వుండదు.

తొందరపడి కొని డబ్బు నష్టపోయి,ఇంటిలోపనికి రాని వస్తువులు పేరుకుపోవటం కన్నా కొనేముందు ప్రతి వస్తువును ఇంటిలో వున్న వస్తువులతో పోల్చి చూసుకోవాలి. ఉదాహరణకు నల్లరంగు షూస్ బాగున్నాయి, కొనమని మనసు ప్రోత్సహిస్తుంది.

అప్పటికి ఇంట్లో నల్లరంగు షూస్ అనేకం వుండి వుంటే వాటికి అదనంగా మరొక జతను చేర్చుకోవటం అవసరం లేదు. అవసరం లేనివాటిని అనవసరంగా కొనను అనే పట్టుదల మనసులో ఏర్పరచుకోవాలి.

ఒకసారి కంటితో చూసి, ఇష్టపడినదానిని కొనకుండా వుండలేని బలహీనత వెంటాడుతున్నదా! అంతేకాదు అప్పటికప్పుడు ఆన్‌లైన్‌లో కొనమని తొందరపెడుతున్నదా! అలా తొందరపడి కొని ఆ తర్వాత తీరికగా గతంలో చింతించారా!


Courtesy : FEMINA

అయితే అటువంటి పరిస్థితి ఎదురవకుండా వుండాలంటే ఒక చక్కని మార్గముంది. ఆన్‌లైన్‌లో కొనేటప్పుడు తొలిసారి మీ వ్యక్తిగత వివరాలు,బ్యాంక్ కార్డ్ వివరాలు వంటివన్నీ ఇచ్చివుంటారు. అవన్నీ ఆన్‌లైన్‌లో అమ్మకాలు చేసే వారిదగ్గర రికార్డ్ అవుతాయి. ఇక అప్పటినుండి మీరు ఇలా ఒక వస్తువును ఎంపికచేసుకోగానే మిగిలిన వివరాలన్నీ వాటంతటఅవి తెరమీద ప్రత్యక్షమవుతాయి. చెయ్యవలసింది కేవలం పేమెంట్‌ని ఓ.కె. చెయ్యటమే. అది అతివేగంగా జరిగిపోతుంది.ఆ తర్వాత తీరికగాఆలోచించుకుంటే అనవసరంగా ఆ వస్తువుకొన్నానే అనే దిగులు ఏర్పడుతుంది. ఇచ్చిన ఆర్డర్‌ని క్యాన్సిల్ చేసుకునే అవకాశం అన్ని రిటైల్ సంస్థలు ఇవ్వకపోవచ్చు. వారి ఎకౌంట్‌లోకి చేరిన డబ్బుతిరిగి వెనక్కి పంపడంలోనూ పలు రకాల అంశాలు పాత్ర వహిస్తాయి.

## → మెయిల్స్ చూసి మోసపోవద్దు

కొంతమంది ఆ ఆర్డర్ రద్దు చేసినా డబ్బు వెనక్కి ఇవ్వరు. భవిష్యత్తులో మీరు మరో వస్తువు ఆర్డర్ చేసినపుడు అడ్జస్ట్ చేస్తామంటారు.అలా డబ్బు వెనక్కి తీసుకోలేక, ఆ డబ్బుకోసం ఏదో ఒక వస్తువు, పనికి రానిదే మళ్ళీ కొన్నవారవుతారు.

కాబట్టి ఆన్‌లైన్‌లో మీరు వస్తువు కొన్నప్పుడు ఇచ్చిన వివరాలన్నింటిని వెనువెంటనే తొలగించండి. దీనివలన మీరు మరోసారి మరో వస్తువు కొనాలనుకున్నప్పుడు ఆ వివరాలు తెరమీదకు రావు.

ఒక వస్తువు కొనాలనుకున్న ప్రతిసారి ఆ వివరాలన్నింటిని ఇచ్చే పద్ధతి పాటించండి. ఆ వివరాలు ఇవ్వటానికి సమయం పడుతుంది. ఆ సమయంలో ఆలోచన మారుతుంది.

వినియోగదారుని ఆకట్టుకునేందుకు ఉత్పత్తిదారులు పలురకాల యత్నాలు చేస్తారు. అత్యంత తియ్యని మాటలతో బుట్టలో వెయ్యగలిగిన నేర్పున్న సేల్స్‌మెన్‌లను పంపించటం పాత పద్ధతి.

ఇప్పుడు ఆన్‌లైన్‌లో వస్తువులను ఎలా వాడాలో ఉపయోగించి చూపే మోడల్స్‌తో కూడిన వ్యాపారప్రకటనలు ఆన్‌లైన్‌లో పెడుతున్నారు. ప్రత్యేకంగా ఆన్‌లైన్ అమ్మకాల ఛానల్స్ పనిచేస్తున్నాయి. ఆన్‌లైన్‌లో అమ్మకాలు చేసే సంస్థలు అందమైన సందేశాలు ఇమెయిల్‌లో, ఫోన్ ద్వారా పంపుతుంటారు.

ఒకసారి ఆ సందేశం తెరచి చూస్తే ఇక ఆ తర్వాత కుప్పలుతెప్పలుగా మెయిల్స్ వస్తాయి. దానినిండా అందమైన వస్తువులు. చూడగానే కొనాలనిపించే పద్ధతిలో వాటిని ప్రదర్శిస్తారు.

అందుకే మీకు వస్తున్న వ్యాపారసంబంధిత మెయిల్స్ విషయంలో జాగ్రత్తగా వ్యవహరించండి. ఒకవేళ తెరచిచూసినా వెనువెంటనే ఆర్డర్ పెట్టవద్దు. ఇటువంటి మెయిల్స్‌ని వీలైనంతత్వరగా అన్‌సబ్‌స్క్రైబ్ చెయ్యండి.దీనితో కొత్తకొత్త వస్తువులవ్యాపార ప్రకటనలతో సంస్థలు మిమ్మల్ని వేధించలేవు.

## → హాబీ కానివ్వకండి

ఏమీతోచక ఆన్‌లైన్‌లో వస్తువులు అమ్మే వెబ్‌సైట్స్‌ని చూస్తుంటారు కొందరు. ఆఫీసు అయిపోయినతర్వాత ఇంటికిరావటానికి గంటవరకు ప్రయాణంచేస్తుంటారు. అటువంటి ప్రయాణ సమయంలో ఏంచెయ్యాలోతోచక స్మార్ట్‌ఫోన్‌లో కంప్యూటర్‌లో ఆన్‌లైన్ మార్కెటింగ్ అంశాలు చూస్తుంటారు.

చూస్తూ ఏదోక వస్తువును ప్రతిరోజూ ఆర్డర్‌ఇవ్వటం ఒక అలవాటుగా మార్చుకుంటున్నారు. డబ్బును వృథా చేసుకునే ఆన్‌లైన్ అలవాటుకు దూరం అవడం మంచిది.

*బి.రాజశేఖర్*

డబ్బు ఖర్చుచెయ్యటంలో ఒక క్రమశిక్షణ అవసరం. అది ఏ పద్ధతిలో చేసే ఖర్చు అయినా సరే. చేతిలోనుండి డబ్బుపోతున్నప్పుడు కొంత స్పృహ వుంటుంది. కాని కరెన్సీ కళ్ళముందు కనిపించని క్రెడిట్/డెబిట్ కార్డు చెల్లింపుల్లో ఎంత డబ్బు పోతున్నదన్న స్పృహ వుండదు. అందుకే ఖర్చుకి బడ్జెట్ అవసరం.

నెలలో చేసేఖర్చులకు కేటాయింపు చేసుకుంటారు. ఆ కేటాయింపులో ఆన్‌లైన్ కొనుగోళ్ళకు ఉపకేటాయింపు చేసుకోవాలి. ఆ పరిమితి దాటి కొనకూడదు. ఆన్‌లైన్ కొనుగోళ్ళను విచ్చలవిడిగా చేస్తున్నారు నేటి గృహిణులు.

లెక్కాపత్రంలేకుండా మరెవరితోనోపోల్చుకుంటూ లేదా పోటీపడుతూ చేస్తున్న కొనుగోళ్ళు ఇంటిని గుల్ల చేస్తున్నాయి. నెల చివరిలో బ్యాంక్ నుండి స్టేట్‌మెంట్ వచ్చే వరకు తాము అంత డబ్బు ఆన్‌లైన్‌లో ఖర్చు చేశామన్న విషయం వారికి తెలియడం లేదు.

ఉద్యోగినులు తమ నెలజీతం మించి ఆన్‌లైన్ కొనుగోళ్ళు చేస్తున్నారని తేలింది. ఆన్‌లైన్ కొనుగోళ్ళ మీద అదుపు అవసరం అనేది అంగీకరిస్తే ఆ తర్వాత అందుకు నెలవారీ పరిమితి విధించుకుని, ఆ పరిమితినిమించి అనుమతిలేని క్రెడిట్‌కార్డును ఉపయోగించడం మంచిది.

దీనివలన ఎంత డబ్బు నెలనెలా ఆన్‌లైన్ కొనుగోళ్ళకు వాడుతున్నది సులభంగా తెలుసుకోగలుగుతారు. ఈ పద్ధతి ఆచరించదగ్గది.◆

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 27 జనవరి 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

# నేనెవరో తెలుసా!

తెలుగువారికి మాత్రమే ప్రత్యేకమైనవి కొన్ని వున్నాయి. అందులో పద్యం ఒకటి.అది మరే ఇతర భాషలోనూ కనిపించని ప్రక్రియ. చందోబద్ధ కవిత్వంకూడా తెలుగువారి సొంతం. వీటితోపాటుగా అష్టావధానం, శతావధానం వంటి ప్రక్రియలు కూడా ఇతర భాషలలో కనిపించవు.

నేటికీ ఆ రెండు ప్రక్రియలలో సాధనచేసి పేరు సంపాదించినవారు, కృషిచేస్తున్నవారు ఎందరో వున్నారు. వీటితోపాటుగా జంటగా కవిత్వం చెప్పటం కూడా తెలుగువారి ప్రత్యేకత అనిపిస్తుంది.

అటువంటి జంట కవిత్వ సాంప్రదాయంలో స్వయంగా సోదరులైనవారూ వున్నారు.

పదహారేళ్ళ వయసులో మిగిలిన పిల్లలు ఇంకా ఏం చదువుదామని ఆలోచిస్తున్న కాలంలోనే వీరు కవిత్వంలోకి వచ్చారు.పద్యాలు చెప్పటం ప్రారంభించారు.వారికి మాటంటేతెలియదు.అంతా పద్యమే...

అయితే అందులో ఒక విమర్శలేకపోలేదు. అతి వేగంగా పద్యం చెపుతున్నప్పుడు దానిలో ఏది తప్పో, ఏది ఒప్పో ఎవరికి తెలుస్తుంది. అదంతా గొప్ప సాహిత్యం కిందికి ఎక్కడ వస్తుంది.

వేగంగా కవిత్వం చెప్పటంకూడా ఒక ప్రతిభ అని అనలేం అంటూ వారికన్నా ముందుతరం జంటకవులతో వారు ఈసడింపబడ్డారు.

నిజమే వారి నోటినుండి అతివేగంగా దొర్లే ఆ పద్యాలను రాసుకునే మార్గము ఉండేది కాదు.

అలా రాయటం జరిగితే కదా మరల మరల దానిని చదివేందుకు ఒకసారి వారు చెప్పిన పద్యం తిరిగి వారే చెప్పగలిగిన అవకాశం నాడు వుండేది కాదు. కాని అత్యంత వేగంగా పద్యం వారి నోటినుండి వచ్చేది. ఆ ఒక్క విషయం అంగీకరించక తప్పేది కాదు.ఆ అన్నదమ్ముల మధ్య ఎడం రెండేళ్ళు.

అన్న 1885న పుడితే తమ్ముడు 1887లో పుట్టాడు. వారి సొంత ఊరే వారి ఇంటి పేరు. వారిది పండిత వంశమే. వారికి ముందు, తర్వాత కూడా వారి వంశంలో సాహిత్యంతో సంబంధంవున్నవారు, రచనలు చేసినవారున్నారు. అటువంటి వంశంలో పుట్టిన వారిలో సహజ కవిత్వం అబ్బింది.

ఇద్దరూ ఒక గురువుల దగ్గరే విద్యను అభ్యసించి, మెలుకువలు నేర్చుకున్నారు. పదహారేళ్ళ వయసు వచ్చేసరికి ఇద్దరి నోట వెంట ఆశువుగా పద్యాలు రావటం మొదలయ్యాయి. వారిది అసాధారణ ప్రతిభ అని,వరంగా వచ్చినదానికి సాధన జతయింది కాబట్టి వారికి తిరుగులేదని పెద్దలు దీవించి పంపారు.

అలా 1908లో సోదర కవులుగా జైత్ర యాత్ర మొదలుపెట్టారు.నాటి సంస్థానాలవారు అనేకం వారిని ఆహ్వానించి కవిత్వం చెప్పించేవారు. అష్టావధాన, శతావధాన ప్రదర్శనలు ఏర్పాటుచేసేవారు.

ఆశు కవితా ప్రదర్శన వుండేది. ఇటు ఆంధ్ర తీర ప్రాంతం, అటు నైజాం ప్రాంతంలో వున్న చిన్నా, పెద్ద సంస్థానాలన్నింటినీ వారు దర్శించారు.

ఒక రకంగా తాము వెళ్ళిన ప్రతిచోట ఒక రకమైన సవాలును విసిరినట్టుగా వుండేది. వారితో పోటీపడి పద్యం చెప్పటం ఆ యా సంస్థానాలలో వున్నవారికి సాధ్యం అయ్యేది కాదు. గద్వాల, మడికొండ వంటి చోట్ల ఆ సోదర కవులను చూసి ఆశ్చర్యపోయారు.

చెన్నపట్నం, గుంటూరు, ఏలూరు వంటిచోట్ల వాళ్ళు చేసిన అవధాన ప్రదర్శనలు మరువలేనివంటారు. దాదాపు 150 ప్రదర్శనలను వారు చేశారు.

అష్టావధానం చెయ్యటమే కష్టమైన ప్రక్రియ అనుకుంటే ఇక శతావధానం చెయ్యటం మరింత కష్టమైనది. అటువంటి శతావధానం రోజుల తరబడి సాగుతుందనేవారు. కాని ఈ జంట కవులు ఒకే రోజున రెండు శతావధానాలుచేసి రికార్డు సృష్టించారంటారు. అటువంటి మరో రికార్డు వారి పద్య రచనా వేగంలోనూ వుంది.

ప్రబంధశైలిలో పద్యాలు చెప్పటంలో వీరిది ప్రత్యేకత. ఒక సభలో గంటలో నాలుగు వందల పద్యాలు చెప్పారు. అంటే నిమిషానికి ఎనిమిది పద్యాలు. ఇది నమ్మటం చాలా కష్టమైన విషయమే.

అయినా నమ్మాల్సిన విషయం. మరో సందర్భంలో వారు మూడుగంటల సభలో, సదస్సులు కోరిన అంశాలమీద ఆసువుగా నాలుగు వందల పద్యాలు చెప్పి సభను రంజింపచేశారని ఆ సభకు అధ్యక్షత వహించిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ప్రకటించారంటే అది నమ్మి తీరాల్సిందే మరి.

పద్యం వేగంగా చెపుతారు కాబట్టి అదంతా యాంత్రికంగా గ్రామ్‌ఫోన్ రికార్డులాగా సాగుతుందనుకునేందుకు వీలులేదు. అంత వేగంగా చెప్పినా అందులో రమణీయత వుండేది.

సుందరంగా వుండేవి ఆ పద్యాలు. సాటి కవుల ఆక్షేపణలు వున్న ప్రజల ఆదరణ దక్కింది. పలు సన్మానాలు పొందారు. ఎన్నో బిరుదులు పొందారు. ఆ రోజుల్లో కవి, పండితులకు గజారోహణ సన్మానం విశిష్టమైనది. అది కూడా అందుకున్నారు.

వారి కవితా వేగంవల్లనో లేక అది నేర్పగలిగిన విద్య కానందునో తెలియదు కాని వారు శిష్యులను తయారుచేసుకోలేదు. సాధారణంగా గురువుల పేరు ప్రతిష్టలను ముందుకు తీసుకువెళ్ళగలగేది,మరెంతో గుర్తింపునిచ్చేది శిష్యులే.

అటువంటి శిష్యులు పరిమిత సంఖ్యలో వున్నందున, ఆ శిష్యులు అంత గొప్ప కవితా వారసులు కానందున ఆ జంటకు రావాల్సినంత గుర్తింపు రాలేదంటారు. అయితే తెలుగు భాషకు వారు చేసిన సేవ, ఆంధ్ర ప్రాంతానికి వారు తెచ్చిన గుర్తింపు తిరుగులేనిది.

వారి ప్రతిభకు మెచ్చి సంస్థానాధీశులు, ఇతర పెద్దలు సమర్పించిన బంగారం రెండు కిలోలపైన వుండేది.అంత బరువు బంగారు ఆభరణాలు నిత్యం ధరించి ప్రయాణంచేసేవారు.

ఆ రోజుల్లోనే వారికి వ్యక్తిగత భద్రతా సిబ్బంది వుండేవారు. ఆశు కవిత్వంలో మీరంత గొప్పవారైతే నా సవాలు స్వీకరించండి.

కవిత్వం మధ్యలో ఆపితే మీ చేతులు నరికివేస్తా అంటూ విజయనగరం సంస్థానంవారు సవాలు విసిరితే "మేము ఆపితే నరుక్కోండి" అని చేతులు చాచి వుంచి అరగంటకుపైగా అనర్గళంగా ఆశు కవిత్వం చెప్పివారి ధైర్య సాహసాలు, వారి కవితాశక్తి మీదున్న విశ్వాసం ప్రదర్శించారు.

కావ్యాలను మొత్తం అలా గంటల్లో చెప్పగలిగే వారు వారి జీవితకాలంలో మూడు లక్షల పైచిలుకు పద్యాలను చెప్పారంటారు. కాని దానిని నమోదుచేసే మార్గం లేదు. చివరికి వారి ఇల్లే కవిత్వపు పుట్టిల్లు అనే పేరు స్థిరపడింది.

**అలా ఒక తరాన్ని అందించిన ఆ జంట కవులలో జ్యేష్టుడు 1932లో మరణిస్తే ఆ తర్వాత తమ్ముడిని జంట కవిత్వంలో కలుపుకుని తమ సాహితీ సేవను మరో పదేళ్ళు కొనసాగించి మరణించటంతో జంట కవుల సాహిత్య సేవ ఆగిపోయింది. వారు రాసిన గ్రంథాలకు ఏ కారణం చేతనోగాని అంతగా ప్రచారం రాలేదు.**

**ఆశు కవిత, అవధాన ప్రక్రియలలో మాత్రమే గొప్పవారిగా మిగిలిపోయారు వారు. ఇంతకీ...**

***1. ఆ జంట కవులు ఎవరు?***

***2. ఆ జంట కవుల పూర్తి పేర్లు ఏమిటి?***

5.1.2018 సంచికలో ప్రచురించబడిన **'నేనెవరో తెలుసా!'** శీర్షిక సమాధానాలు :
1. టి.వి.రాజా, 2. టింగ్‌రంగా.
**₹ 500/- బహుమతి పొందిన విజేత:**
ఎమ్.జె.జస్వంతి, శ్రీ చైతన్య టెక్నో స్కూల్, కృష్ణరాజేశ్వరం, 100 అడుగుల రింగ్ రోడ్, విజయనగరం 535 002.




# రాళ్ళల్లో ఇసకల్లో రాశాము...

## సీతారామకళ్యాణం

ప. అ. రాళ్ళల్లో ఇసకల్లో రాశాము ఇద్దరి పేర్లు
కళ్ళుమూసి తిన్నగా కలిపి చదువుకో ఒక్కసారి
కలలలోన తీయగా గురుతుతెచ్చుకో

ఆ. రాళ్ళల్లో ఇసకల్లో రాశాము ఇద్దరి పేర్లు
కళ్ళు మూసి తిన్నగా కలిపి చదువుకో ఒక్కసారి
కలలలోన తియ్యగా గురుతు తెచ్చుకో

చ. అ. కలలన్ని పంటలై పండెనేమో-కలిసింది కన్నులపండగేమో
ఆ. చిననాటి స్నేహమే అందమేమో-అది నేటి అనురాగ బంధమేమో
అ. తొలకరి వలపులలో పులకించు హృదయాలలో ॥2॥
ఎన్నాళ్ళకీనాడు విన్నాము సన్నాయి మేళాలు
ఆ. ఆ మేళ తాళాలు మన పెళ్ళి మంత్రాలై
వినిపించువేళలో-ఎన్నెన్ని భావాలో ॥రాళ్ళల్లో॥

చ. అ. చూశాను ఎన్నడో పరికిణిలో-వచ్చాయి కొత్తగా సొగసులేవో
ఆ. హృదయాన దాచిన పొంగులేవో-పరువాన పూచెనె వన్నెలేవో
అ. వన్నెల వానల్లో-వన్నెలైన జలకాలలో ॥2॥
మునగాలి తేలాలి తడవాలి ఆరాలి మోహంలో
ఆ. ఆ మోహదాహాలు మన కంటిపాపల్లో
కనిపించు వేళలో-ఎన్నెన్ని రాగాలో ॥రాళ్ళల్లో॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం బాలు, సుశీల




# ష్...అమ్మమ్మమ్మమ్మా చలి!

## సోగ్గాడు

ప. అ. ష్......... అమ్మమ్మమ్మమ్మా చలి!
ఉహుహుహూహూ చలి! హా!
చలి వేస్తుంది - చంపేస్తుంది
కొరికేస్తుంది - నులిమేస్తుంది
రా! రా! కప్పుకుందాం
నన్ను నువ్వు నిన్ను నేను కప్పుకుందాం ॥చలి॥

చ. అ. పాడు చలి ఆగనంటూంది
ఆః! హాః హాః!
యాడేడో పట్టిపట్టి లాగుతూంది
ఆ. గట్టిగా ఇంకా గట్టిగ - అబ్బా!
కట్టగా ఒకటే కట్టగా - ఆహా!
చుట్టచుట్టుకుందాము - పట్టు విడువకుందాము ॥చలి॥

చ. ఆ. కౌగిలింత చాలదంటూంది... ఆహాః! ఊః!
వేడి పుట్టే దారి ఏదో వెతుకుతూంది
అ. పట్టుకో అదిమి పట్టుకో - ఆః!
వేసుకో మెలిక వేసుకో - హా!
లోన అగ్గి పుట్టాలి - పైన ఒణుడు తగ్గాలి
ఆ. అబ్బా! లోన అగ్గి పుట్టాలి - పైన ఒణుగు తగ్గాలి ॥చలి॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం బాలు, సుశీల

సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త

## సి.శివరామమూర్తి

**అందుకనే సామ్రాట్‌లో బలమయిన సువిశాల సామ్రాజ్య విస్తరణ ఆకాంక్ష! కాని ఈ ఆకాంక్ష కచుడిలో 'ఉన్నదా' అని సామ్రాట్ సందేహం. కేవలం రాజ్య విస్తరణకోసం, తన అహంకారం సంతృప్తికోసం రాజు యుద్ధాలు చేస్తే అది ప్రజాక్షేమానికి దారితీయదు.**

**పోనీ సముద్రగుప్తుడికి పట్టం కడదామంటే ఆ సుకుమార రాకుమారుడు దండనీతిని ఎలా ఆచరిస్తాడు? ఎలా రాజ్యాన్ని నిర్వహించగలుగుతాడు?**

చంద్రగుప్తుడు జగన్మాత విగ్రహం భద్రకాళీవైపు మరోసారి నిశ్చల ఏకాగ్రతతో పరికించాడు. మెడలో కపాలాలు ధరించి రక్తవర్ణంతో మెరుస్తున్న నాలుకను భయంకరంగా బయటకు చాపి అనుగ్రహ దృక్కులతో మెరుస్తోన్న భద్రకాళిని మనసులో స్మరించుకొని సామ్రాట్ కళ్ళుమూసుకున్నాడు.

"జగన్మాతా! జగద్ధాత్రీ! నీ బిడ్డకు కర్తవ్యాన్ని బోధించు... సత్ నిర్ణయాన్ని ప్రేరేపించి భావిభారత సౌభాగ్యానికి దారితీయించు తల్లీ!"

సామ్రాట్ అలా ఎంతసేపు ఏకాగ్రతతో కూర్చున్నాడో తెలియదుకాని మళ్ళీ స్పృహ వచ్చేటప్పటికి పైన నెత్తి మీద గంటలు మ్రోగుతున్నాయ్!

రాజదంపతులు ఇరువురూ తల ముక్కలు అయ్యేంత ఆశ్చర్యముతో తలపైన ఊగుతూ మోగుతున్న గంటల వైపు అలాగే చూస్తుండిపోయాడు.

'మూసివున్న ఈ గర్భగుడిలోకి ఎవరు వచ్చారు? గంటలు అదేపనిగా ఎలా మోగుతున్నాయ్!'

మహారాజుగారి మహారాణులు ఇరువురూ కూడా ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు. కుమారదేవి కళ్ళల్లో నీడలాంటి భయం కొంతసేపు అయ్యాక తేరుకొని ముందుగా-

సామ్రాట్ "ఆశ్చర్యంగా ఉందే...!" అని ఆశ్చర్యపోతూ అన్నాడు.

కుమారదేవి ప్రత్యుత్తరంగా "ఇది భద్రకాళి మహిమకాదుకదా!"అన్నది.

సామ్రాట్ అప్రయత్నంగా తలను అడ్డంగా తాటించి కొన్నిక్షణాలు ఆలోచించి "అలా అనుకోవడం లేదు. ఈ సంఘటన వెనుక గర్భగుడిలో మాయమైపోయిన కాపాలికుడి హస్తం ఉండివుండాలి" అన్నాడు.

అప్పటికిగాని కుమారదేవికి స్ఫురణకు రాలేదు. ఈసారి ఆమె కళ్ళల్లో స్పష్టంగా ప్రతిబింబించిన భయవీచికలు గమనించిన సామ్రాట్ "భయం లేదు మహారాణీ!" అన్నాడు.

కుమారదేవి సన్నని గొంతుకతో "నా గురించి కాదు ప్రభూ...! మీ గురించి. కాపాలికుడు మీకు ఏ మారుమూలనుండో హాని చేయడు కదా ప్రభూ!" అంది.



సామ్రాట్ నవ్వి "చెప్పానుకదా దేవీ చేయడు.నాకైతే అటువంటి సంకల్పం ఉన్నవాడిలా తోచడంలేదు"అన్నాడు.

కుమారదేవి ఆలోచనలో పడింది. ఈసారి సామ్రాట్ పూర్తి ఆలోచనలు కాపాలికుడు మీదకు మళ్ళాయ్!

### గత సంచికలో జరిగిన కథ

సామ్రాట్ చంద్రగుప్తుడు,మహారాణి కుమారదేవి పాటలీపుత్ర నగర దేవత అయిన భద్రకాళీ ఆలయానికి వస్తారు. రాజదంపతుల చుట్టూ మూడు గిరికీలు కొట్టి ఓ డేగ వెళ్ళిపోవడం అందర్నీ ఆశ్చర్యానికి గురిచేస్తుంది.

సింహద్వారందగ్గర తారసపడిన కాపాలికుడు శక్తిమంతుడని,మహిమాన్వితుడు అని తెలియజేస్తాడు రాజపురోహితుడు మైత్రేయుడు.

గర్భగుడిలోకి వెళ్ళిన కాపాలికుడు మాయమవడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. తన కుమారులైన కచగుప్తుడు, సముద్రగుప్తులలో ఎవరు తన రాజ్యాన్ని ధర్మబద్ధముగా పరిరక్షించగలరోనని భద్రకాళి ఆలయములో దీర్ఘ ఆలోచనలో పడతాడు సామ్రాట్ చంద్రగుప్తుడు.

తీరని రాజ్యవిస్తరణ ఆకాంక్ష కలిగినవాడు కచగుప్తుడు. సుందరుడు, సుకుమారుడు యుద్ధమంటే ఏవగింపు కల్గినవాడు సముద్రగుప్తుడు. వీరిలో రాజ్యాన్ని అధిష్ఠించగలిగిన వారసుడు ఎవరు?

కాపాలికుడు 'సమయం ఇంకా రాలేద'ని చెప్పటంలోని ఆంతర్యం ఏమిటో ఎంతకీ అర్థంకాదు.

కాపాలికుడివలన మనకు ఏమీ నష్టంలేదని మహారాణికి చెబుతాడు చంద్రగుప్తుడు. ఇక తరువాత జరగబోయేది చదవండి.




ఈ తతంగం వెనక కాపాలికుడి ఆంతర్యం ఏమిటో... అతడిమీద ఆగ్రహించినందుకు తనమీద కినుకా...లేక తన అద్భుత శక్తులు ప్రదర్శించాలని ఒక ఆరాటమా... నిజంగా కాపాలికుడు కళ్ళముందు నుంచి ఎలా అదృశ్యము అయ్యాడు?" అంతుపట్టని ప్రశ్నకు సామ్రాట్‌లో తీరని ఆశ్చర్యం.

ఉన్నట్టుండి ఒక్కసారిగా కుమారదేవి కెవ్వున కేకవేసింది.

ఆ కేకకు సామ్రాట్ చేయి అప్రయత్నముగా రాజఖడ్గం ఉన్న ఒరమీదకు

వెళ్ళింది. అయితే ఒర తేలిగ్గా ఖాళీగా ఉంది. అప్పుడుగానీ గుర్తుకురాలేదు. ఇంతకుముందే తను ధ్యానం చేసే ముందు భద్రకాళి పాదాలయందు తన రాజ ఖడ్గాన్ని ఉంచాడు.

రాజు కళ్ళు ఆ స్థానాన్ని వెతికాయ్...! సరిగ్గా అదే సమయంలో కుమారదేవి చూపుడువేలు కూడా అదే స్థానాన్ని చూపిస్తోంది.

"ఏమయింది ప్రభూ! ఏమయింది? మీ ఖడ్గం ఏమయింది కన్పడటం లేదే" భయవిహ్వలైన మహారాణి కుమారదేవి సామ్రాట్‌ను హఠాత్తుగా హత్తుకొని పోయింది.సామ్రాట్‌కి ఈసారి నిజంగా మతిపోయినట్టైంది. "నిజమే! ఖడ్గమెక్కడికి మాయమయ్యింది?"

ఎంత ఆలోచించినా సామ్రాట్‌కు అంతుపట్టలేదు. 'ఇది కూడా కాపాలికుడు మాయేనా?' అంతేకాదు, సామ్రాట్‌కు ఓడిపోయినవాడిలా మొహం జేవురించుకుపోయింది. బయటకు ఈ విషయం తెలిస్తే...

ఏం చేయాలో పాలుపోవడంలేదు ఆ ఇరువురికి. చంద్రగుప్తుడు గర్భగుడిలోని అణువణువు శోధించాడు. ఎక్కడ కూడా మూడో మనిషి తారట్లాడిన ఆచూకీ లేదు. చీమకూడా బయటకు వెళ్ళలేని ఈ గర్భగుడిలో కాపాలికుడు ఎలా మాయమయ్యాడు?"

కుమారదేవి బలహీన స్వరంతో "ప్రభూ! రాజ ఖడ్గం లేకుండా రాజధానికి తరలివెళ్ళడం..." ఆ తర్వాత మాటలు పెకలటంలేదు.

చంద్రగుప్తుడు గొంతెత్తి బిగ్గరగా అరిచాడు "కాపాలికా! ఎక్కడున్నావ్... బయటకురా... నీకు ఎటువంటి హాని చేయను..."

ఎక్కడనుండి సమాధానం లేదు. చంద్రగుప్తుడి స్వరం ప్రతిధ్వనించి తిరిగి గుడిలోనే లయమైంది. చంద్రగుప్తుడు ఈసారి నిశితంగా ఆలోచించి మహారాణితో అన్నాడు "పద దేవీ!"

కుమారదేవి ఆశ్చర్యంగా "మరిరాజ ఖడ్గమో" సందిగ్ధంగా చూసింది.

చంద్రగుప్తుడు మహారాణి కళ్ళలోకి చూసి "పద దేవీ" మరోసారి అన్నాడు. ఆ తర్వాత ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని వడివడిగా గుడి బయటకు అడుగులు వేశాడు.

బయట మంత్రి, సామంత, అంతఃపుర పరివారం ఉత్కంఠతో ఎదురు చూస్తూ రాజదంపతుల పునఃదర్శనంతో ఊపిరిపీల్చుకున్నారు.

చంద్రగుప్తుడు "మహామంత్రీ! తిరిగి మా ఉత్తర్వు అందేవరకు లోపల గుడిలోకి ఎవరూ ప్రవేశించరాదు"

ఆ మాటలకు మహామంత్రి, పురోహిత పరివారం ఒకరి మొహాలు ఒకరు ఆశ్చర్యంగా పరికించుకొన్నారు.

సామ్రాట్ అంతరంగం ఎవరికి అర్థం కావడంలేదు. కుమారదేవికికూడా రాజు వాలకం ఆశ్చర్యంగా ఉంది. మహామంత్రి కనుసైగ చేశాడు. వెంటనే పురోహిత పరివారం గుడి తలుపులు బయట గడియపెట్టారు. హఠాత్తుగా మహామంత్రి చూపులు ఖాళీగా ఉన్న సామ్రాట్ ఒర మీదకు వెళ్ళాయ్!

"మహాప్రభూ! ఖడ్గాన్ని గుడిలో మరిచినట్టున్నారు"

సామ్రాట్ నిజమైన ఇరకాటంలో పడ్డాడు. పైగా మహామంత్రి ఆ మాట అనగానే అక్కడున్నవారందరూ ఖాళీగా ఉన్న ఖడ్గపు ఒరపై చూపులు మరల్చారు. "ఇప్పుడేం చేసేట్టు?"

సామ్రాట్ తగ్గిన కంఠస్వరంతో "లోపల ధ్యానం చేస్తూ రాజఖడ్గాన్ని భద్రకాళీ విగ్రహం ముందు ఉంచాను కశ్యపా!" అన్నాడు.

వెంటనే మహామంత్రి ఆతృతగా పురోహిత పరివారాన్ని ఆదేశించాడు "వెంటనే తలుపులు తెరవండి"

సామ్రాట్‌కు ఆ తర్వాత ఏం మాట్లాడాలో తోచక సతమతమవుతున్న ఆ కొద్దిపాటి క్షణంలోనే లోపలకు వెళ్ళిన రాజపురోహితుడు మైత్రేయుడు తిరిగి సామ్రాట్ ఎదుట ప్రత్యక్షమవటం జరిగిపోయింది. ఈసారికూడా సామ్రాట్‌కు, కుమారదేవీలకు ఆశ్చర్యముతో నేల కింద భూమి చీలుతున్నట్లయింది.

మైత్రేయుడి చేతిలో రాజఖడ్గం తళతళమని మెరుస్తోంది. "ప్రభువులు ధ్యానంలో పడి రాజఖడ్గాన్ని మరచిపోయారు. శుభమస్తు! విజయోస్తు!" ఖడ్గాన్ని అందజేస్తూ అన్నాడు.

చంద్రగుప్తుడు, కుమారదేవీలు ఆ వెనువెంటనే మాట్లాడకుండా రథారూఢులై పాటలీపుత్ర నగరానికి తిరిగి బయలుదేరారు. బయలుదేరబోయే ముందుగా కశ్యపుడు అత్యంత క్లుప్తంగా ఇచ్చిన సందేశం -

వారసుడిని నిర్ణయించటానికి మరి కొంత వ్యవధి అవసరమవుతుంది. ప్రజలందరు దీన్ని ఆ జగన్మాత నిర్ణయంగా భావించాలని సామ్రాట్ దంపతులు కోరుకుంటున్నారు.

కశ్యప బ్రహ్మమాత్రం ఇలాంటిది ఏదో జరగబోతోందని ఊహిస్తున్నాడు. ముఖ్యంగా గర్భాలయంలోకి వెళ్ళి తత్తరపాటుతో రాజఖడ్గం లేకుండా తిరిగివచ్చిన సామ్రాట్ దంపతులను చూసినతర్వాత. దీనికితోడు కాపాలికుడు హఠాత్తుగా గర్భాలయములో అదృశ్యమవటం.

పైగా అతడు సామ్రాట్‌కు చేసిన హెచ్చరిక 'ఇది సమయంకాదు' అని. సామాన్య ప్రజానీకం ఎంతో హతాశులయ్యారు. కశ్యప మహామంత్రి మళ్ళీ వివరణ ఇచ్చాడు. అక్కడ గుమిగూడి వున్న ప్రజానీకానికి.

'రాజ్య శ్రేయస్సు కోసం తీసుకొన్న నిర్ణయం ఇది. రాజ్య వారసుడిని ప్రకటించేందుకు మరో సుముహూర్తం నిర్ణయింపబడిందని, అత్యంత సమీప భవిష్యత్తులో తన వారసుడి గురించి నిర్ణయం ప్రకటించబడుతుందని'.

ప్రజల సందేహాలకు, చర్చల నుండి తప్పుకునేందుకు కశ్యపబ్రహ్మ కూడా చాకచక్యంగా నిష్క్రమించాడు రాజదంపతుల వెనువెంటనే. మధ్యాహ్నం వరకు ప్రయాణం సాగింది.

ఇంతలో దూరంగా సామ్రాట్ రాజధాని సరిహద్దులలో ఆనుకునివున్న మరో భద్రకాళీ ఆలయం దగ్గర ఆగిపోయాడు రాజపరివార సహితంగా.

సామ్రాట్ రథం నుండి దిగి ఒంటరిగా ఆ ఆలయంలోకి వెళ్ళాడు.

కాళీ విగ్రహాముందు శిరస్సువంచి నమస్కరించాడు. కళ్ళుమూసుకుని భక్తి ప్రవృత్తులతో ప్రార్థన చేస్తున్నాడు సామ్రాట్. హఠాత్తుగా అలికిడి.

కళ్ళు విప్పి చూశాడు. ఆ కాళీమాత విగ్రహానికి కుడివైపుగా నుంచునివున్న కాపాలికుడు.సామ్రాట్‌కి ఈసారి మతి చలించినట్లయింది. అలా కొన్నిక్షణాలు మాటలుడిగి, నుంచుండిపోయాడు.

---

**ప్రతిపక్ష నేతగా వుంటూ సి.ఎమ్.ని చంపుతా అంటున్నాడు. ఇక సి.ఎమ్. అయితే ఎలా వుంటుందో ఆలోచించండి.**

**-తులసీరెడ్డి, కాంగ్రెస్ నేత**



---



## ఆ లెక్కలు కుదరవు

ఏబై సినిమాలను స్థిరంగా పూర్తిచేసేసిన కాజల్ అగర్వాల్‌కు ఏదోక కారణం కోసం సినిమాలు చేయకూడదు అన్న సిద్ధాంతం ఉందట.

"క్రియేటివిటీ గల చిత్ర పరిశ్రమలో ప్రతి సినిమా ఓ సరికొత్త విషయాన్ని నేర్పిస్తుంటుంది. అందుకనుగుణంగా మారుతుంటాం. అంతేతప్ప ముందే మనస్సులో ఒకటనుకుని సినిమా చేస్తే ఆ ప్రయాణాన్ని ఆస్వాదించలేం.

వ్యక్తిగత జీవితాన్ని ఓ పద్ధతిగా, ప్రణాళికాబద్ధంగా కొనసాగిస్తాం కాని, కెరీర్‌లో అటువంటి లెక్కలు కట్టుకుంటూ సాగాలంటే కష్టం" అంటూ ఫ్రాంక్‌గా చెప్పుకొచ్చింది కాజల్.

కళ్ళు నులుముకొని మళ్ళీ మళ్ళీ చూశాడు. ఎదురుగా నుంచొని ఉన్నది సాక్షాత్ ఆ కాపాలికుడే, సందేహంలేదు. ఇంతలో వెనకనుండి ఎవరో పిలుస్తున్న ధ్వని... అది మహామంత్రి కశ్యపుడి గొంతుక. "ప్రభూ! లోపలకు రావటానికి మీ అనుమతి కోరుతున్నాను"

అసంకల్పితంగా చంద్రగుప్తుడు గర్భాలయం నుండి బయటకు వెళ్ళి, ఆ వెనువెంటనే కశ్యపుడితో తిరిగి మళ్ళీ లోపలకు వచ్చాడు. "కశ్యపా చూశావా ఈ విచిత్రం?" అంటూ.

"ఏమైంది ప్రభూ, ఏం జరిగింది"

మళ్ళీ సామ్రాట్‌లో దిగ్భ్రమ.

"ఎదురుగా కాపాలికుడు లేడు!!" తేరుకోవటానికి సామ్రాట్ కొద్ది వ్యవధి తీసుకొని కశ్యపుడికి జరిగినది అంతా వివరించాడు. ఇద్దరికీ ఏం చేయాలో పాలుపోలేదు. అర్థంకాని ఆశ్చర్యం అయోమయంలో మిళితమైన విచిత్రావస్థలో ఆ ఇద్దరు బయటకొచ్చారు.

అశ్వికులు, అంగరక్షులు, రథాలు తిరిగి పాటలీపుత్రానికి తిరుగు ప్రయాణం కట్టాయ్! రాజును, మహామంత్రిని, రాజపరివారాన్ని వెంట తీసుకుని.

యువరాజు సముద్రుడు తన రాజసౌధంలో కూర్చొని మందిర గవాక్షం నుండి బయట వైపుకు చూస్తున్నాడు.

మంద్ర మంద్రంగా జారుతున్న ఆ చీకటితెరలు ప్రకృతిని కప్పి వేస్తున్న నల్లని మేలిముసుగులా ఉంది.

దూరంగా సరస్సులోని కలువలు ముకుళించుకొని నిద్రకు సమాయత్తమవుతున్నట్టుగా అనుభూతి, వినీలాకాశంలో మిణుగురు పురుగుల్లాంటి నక్షత్రాలు... శుక్లపక్ష సప్తమినాటి నెలవంక అర్థచంద్రాకారంలో వెన్నెలను వెదజల్లుతోంది.

సముద్రుడిలో ఆలోచనా తరంగాలు. 'వారసుడి ప్రకటన జరగలేదు. తనవరకుమాత్రం ఈ వార్తతో ఆనందాన్ని ఇచ్చింది. రాజధానిలో పుకార్లు- తనకే పట్టంకట్టాలని సామ్రాట్ నిర్ణయం తీసుకున్నాడని. కానీ ఈ రాజ్యమూ, రాజ్యకాంక్ష, అధికార పదవీవ్యామోహాలు తనకెన్నడూ కలగలేదు.

అందుకుగానూ ఆ సర్వేశ్వరుడికి సమయం దొరికినప్పుడల్లా మనసులో ధన్యవాదాలు చెప్పుకునేవారు.

ఈ ముళ్ళ కిరీటం, దానివెనుక అనునిత్యం రాచరిక బాధ్యతలూ, ఆ వెనువెంట నిరంతరం వెన్నాడే సమస్యలు, అశాంతి సర్వేశ్వరా వీటినుండి తప్పించు! సముద్రుడు ఆ కాళీమాతకు ప్రార్థనలు చేసేవారు. ఈ జీవితం ఒక అందమైన మధుపాత్ర.

రాకుమారుడిగా జన్మనిచ్చి తనను భోగమయ ప్రపంచానికి యువరాజును చేశాడు ఆ విధాత. ఇది విధాత తనకి ఇచ్చిన వరం. ఈ అరుదైన అవకాశాన్ని పూవులో మకరందాన్ని గ్రోలే భ్రమరంలా అనుభవించమని ఆ విధాత తనకు రాసిన లలాట లిఖితం. దీన్నెందుకు కాదనాలి...?'

అలాగే అనుభవించే యవ్వనాన్ని, సౌందర్యాన్ని, అరుదైన ఈ రాకుమారుడి అద్భుత జన్మను కూడా ప్రసాదించాడు ఆ సర్వేశ్వరుడు.

ఇలా సముద్రుడిచుట్టూ పరిభ్రమిస్తోన్న ఆలోచనలు. సముద్రుడి ఆలోచనలకు అంతరాయం కల్గిస్తూ-

"యువరాజా... తమ దర్శనంకోసం కాషాయాంబరిధారయిన ఒక వృద్ధుడు సింహద్వారం దగ్గర ఎదురుచూస్తున్నాడు..." రాజ పరిచారిక విన్నవించుకొంది యువరాజు అనుజ్ఞకోసం.

సముద్రుడిలో విస్మయం.

"ఇపుడా... సమయంకాని ఈ అసమయంలోనా" కొంచెంసేపు ఆలోచించాడు. పరిచారిక వర్ణనప్రకారం ఆ వచ్చినవారు ఎవరో యతీశ్వరుడిలా ఉన్నారు. సముద్రుడిలో రెట్టింపయిన విస్మయం. ఆ వెనువెంట కుతూహలం. "ప్రవేశపెట్టు"

కొంత సమయం గడిచాక ఆ వృద్ధుడు యువరాజు సముద్రుడికి ఎదురుగా ఆశీనుడైవున్నాడు.

సముద్రుడు అపుడు తేరిపార చూశాడు. చూడగానే భక్తిప్రవృత్తులు కలిగాయ్ యువరాజుకు. లేచి నిలబడి అభివాదం చేశాడు.

"ఆయుష్మాన్భవ... అఖండ ప్రాభవ వైభవప్రాప్తిరస్తు"

ఆ ఆశీస్సులకు సముద్రుడిలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం.

"మీరెవరు మహాపురుషులని మనసు చెపుతోంది. మీకు ఏమి సేవచేయాలో ఆజ్ఞాపించండి..." తొంభైపదుల ఆ వృద్ధుడి మొహంపై చిరుదరహాసం.

"యువరాజా... ఆజ్ఞాపించటానికి రాలేదు. జ్ఞానార్థినయై వచ్చాను"

యువరాజులో విస్మయం! "జ్ఞానమా.. నేనా, మీకు జ్ఞానాన్ని బోధించడమా!"

"ఇప్పుడు నీ వయసు ఇరవైఅయిదు సంవత్సరాలు... కాని గడిచిపోయిన నీ జన్మగురించి నీకు తెలియదు. కానీ నాకు తెలుసు. అందుకే జ్ఞానార్థినయి నీ వద్దకు వచ్చాను"

వృద్ధుడు కొన్నిక్షణాలు కళ్ళుమూసుకుని మళ్ళీ తెరచి... "సముద్రా... ఎన్నో సంవత్సరాలుగా తపస్సు చేశాను. జీవితానికి పరమావధి ఏమిటో ఇంకాస్పష్టాస్పష్టంగానే ఉంది. యువరాజా ఈ అస్పష్టతను నిర్వచించాలి" సముద్రుడు ఆ వృద్ధుడివైపు అదోలా చూశాడు.

"ఇది నా మనసులోని సందేహమే యువరాజా. ఈ సందేహనివృత్తి నువ్వే చేయగలవ్. కాములకు... మోక్షకాములకు ఏకైక గమ్యమంటూ ఏదయినా ఉన్నదా" అని అడిగాడు.

యువరాజు ఆ ప్రశ్న అడగటంలో వృద్ధుడి చిత్తశుద్ధిని గ్రహించాడు.

"అవును... మహాబాగా... ఉన్నది... ఒకటే ఉన్నది... కాములకు మోక్షకాములకు... చరాచర సృష్టిలోని ప్రతి జీవికి ఏకైక గమ్యం ఒక్కటే"

వృద్ధుడు ఆలకిస్తున్నాడు.

"అది ఆనందం మహాబాగా సమస్త పాపులకూ, పుణ్యులకూ - సమస్త సృష్టిలోని ఈ సమస్త జీవులకూ ఏకైకగమ్యం ఆనందం..ఆ ఆనందంమాత్రమే"

వృద్ధుడు నవ్వాడు "అందువల్లనే కాబోలు రాకుమారుడు ఆనందసామ్రాజ్యానికి యువరాజు అయ్యాడు"

సముద్రగుప్తుడి పెదవులపై చిరులాస్యం "భగవంతుడు నన్ను ఈ భూమికలో సృష్టించాడు. నా చుట్టూతా ఈ ప్రపంచాన్ని... ఈ ఆనందాన్ని సృజించాడు. అతడే నా చేతికి జీవిత మధుపాత్రను అందజేశాడు. ఆయన సంకల్పాన్ని శిరసా వహించమని నా



లక్ష్యాలను అందుకోవాలనుకున్నప్పుడు కొన్ని త్యాగాలు చెయ్యక తప్పదు.

-కరణం మల్లేశ్వరి, ఒలింపిక్ మెడలిస్ట్

## బావుందండోయ్

ఇతర విషయాలు ఏవీ పట్టనట్లు టచ్‌మినాట్ ధోరణిలో తళుకులాడి తమన్నా తన పని తాను చేసుకుంటూ వెళ్ళిపోతుంటుంది.

అప్పుడప్పుడు అడుగులు తడబడినా స్థిరంగా సాగిపోతున్నది. ఓ దశలో 'ఐరన్ లెగ్' ముద్రపడినా తమ్ము ఏమాత్రం తొణికినట్లు కనపడనే లేదు.

అందాన్ని అయితే ఇసుమంతైనా తగ్గనీయక, ప్రత్యేక పాటలనుంచి గ్లామరస్ రోల్స్ దాకా చేసేస్తోంది.

స్పెషల్ సాంగ్స్‌తో పారితోషికాలూ భారీగానే అందుకుంటున్నది. ఇప్పుడైతే తమన్నా వెరీ బిజీ. చేతిలో సినిమాల సంఖ్య బాగానే ఉంది. గో ఎ హెడ్!



# చిలిపి

ఆపదలో ఆదుకునేవాడు.
సినిమా హీరో.

"వార్తలు ముగించేముందు విశేషాలు మరోసారి" ఎందుకు చదువుతారు?
వేరే విశేషాల్లేక.

ఈ ప్రపంచంలో కొనుక్కోకుండా వచ్చిన సుఖం ఏది?
నిద్ర.

దురదృష్టవంతుడికి యాక్సిడెంట్ అయితే?
కవి సమ్మేళనంలో పడ్డాడట!



చుట్టాలను వీలైతే రైలుస్టేషన్‌వరకు సాగనంపుతారు ఎందుకు?
తిరిగొస్తారని ముందు జాగ్రత్త!!!

నెలకు ముప్ఫై ఫస్టు తారీకులుంటే?
ఏముంది, ఏ రోజు జీతం ఆ రోజు తీసుకోవాలి.

నీ దేవుడెవరు?
నేను ఎక్కిన బస్సును నడిపే డ్రైవర్!

మీ ఇంట్లో శ్రావణమాసం స్పెషల్ ఏంటి?
రోజూ 'శనగల కూర'

ప్రహరీ గోడలు ఎందుకు?
పిడకలు కొట్టడానికి.

నెల తప్పిందంటే?
'జూన్' జూలై అవడమేగా.

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కినట్లు అంటే?
కథ రాయలేనమ్మ నవల రాసినట్లు.

వివాహం స్త్రీకి ముఖ్యమా? పురుషునికి ముఖ్యమా?
'ఇద్దరికన్నా ఇతరులకు ముఖ్యం'

---

మనసు నన్ను నిర్దేశిస్తోంది"

వృద్ధుడు మరికొద్ది క్షణాలు మవునంగా ఉండిపోయాడు ఆ మాటలకు. తర్వాత మంద్ర స్వరంతో "రాకుమారా! నేను ఇంత తపస్సు చేసినా నాలో భోగ వాంఛలు అంతరించలేదు.కారణం"

ఆ మాటలకు సముద్రగుప్తుడు ఆ వృద్ధుడ్ని అదోలా చూశాడు. వృద్ధుడు అంతటి వయసులో చెప్పిన సత్యం రాకుమారుడ్ని చకితుడ్ని చేసింది.

కాని సత్యాన్ని ఆ వయసులో నిర్మొహమాటంగా చెప్పినందుకు రాకుమారుడికి ఆ వృద్ధుడంటే గౌరవం మరోసారి రెట్టింపు అయింది. "దీనికి కారణం మన మనసు మహాపురుషా!"

సముద్రగుప్తు అన్నాడు "పూర్తిగా మనసు నశించేంతవరకు మనిషికి సుఖదుఃఖాలు తప్పవు... వాంఛలు తప్పవు", "మనసు నశిస్తే మనమెలా జీవించగలుగుతాం రాకుమారా!"

రాకుమారుడు ఆ మాటల్ని అర్థం చేసుకున్న తీరే వేరు. వృద్ధుడు శెలవు తీసుకుంటానని కోరుతున్నాడనుకున్నాడు. వృద్ధుడు ఈసారి స్వచ్ఛంగా నవ్వి "రాకుమారా! సూర్యాస్తమయానికి మరికొద్ది క్షణాలుమాత్రమే మిగిలి ఉన్నాయ్! సూర్యాస్తమయ్యేలోగా నేను ఈ దేహాన్ని విసర్జిస్తున్నా" అన్నాడు.

సముద్రగుప్తుడు ఆ మాటలకు అవాక్కయ్యాడు.

"అవును. రాకుమారా! నా మరణ ముహూర్తమెపుడో నా తపశ్శక్తి ద్వారా తెలుసుకోగలిగాను. నేను నీ చేతిలో మరణించాలని వచ్చాను. నిజానికి అది ఈశ్వర సంకల్పం కూడాను"

సముద్రగుప్తుడు చాలా ఆశ్చర్యంగా చూస్తున్నాడు."రాకుమారా! నేను మహా పండితుడ్ని. వేదవేదాంగ పారంగతుడ్ని. యాభై సంవత్సరాలు కఠోర తపస్సు చేసినవాడిని.రాబోయే నా జన్మకు నీకు అవినాభావసంబంధమున్నది. అందుకనే ఇక్కడకు వచ్చాను"

"ఏమిటది"

"నీకు అర్థమయ్యే రోజు వస్తుంది రాకుమారా! అంతవరకు వేచియుండక తప్పదు" అన్నాడు.

"సముద్రగుప్తా! నీకు అమూల్యమైన కొన్ని తాళపత్రాలు ఇస్తున్నాను. జీవితంలో ఎప్పుడైనా ఘోర సంక్లిష్ట స్థితి ఎదురయినపుడు ఇందులో రేపటిగురించిన నీ జీవిత పుస్తకం ఉన్నది. నీవు ఈ పత్రాలను ఆశ్రయించు. మేలు జరుగుతుంది" వృద్ధుడు అంత వరకూ తను కప్పుకున్న శాలువాలో నిక్షిప్తమైన తాళపత్రాలను తీసి ఇద్దరి మధ్య ఉన్న గంధపు పెట్టెపైన ఉంచాడు. ఈసరికి సముద్రగుప్తుడిలో తీరని సంచలనం. ఎదురుగా గవాక్షం నుంచి సూర్యాస్తమయం కనపడుతుంది.

సంధ్యారేఖలు ఆ వృద్ధుడి శరీర ఛ్ఛాయలో కలసి వింత తేజస్సును సంతరించుకుంటున్నాయ్!

అలా చూస్తూవుండగా వృద్ధుడిలో సన్నని వణుకు. మరికొద్ది లిప్తలలో అతడిలో చేష్టలుడిగిపోతున్నాయ్!

సముద్రగుప్తుడు ఒక్క ఉదుటున లేచి ఆ వృద్ధుడ్ని దరి చేరాడు. చేతులతో చుట్టివేశాడు. వృద్ధుడు అప్పటికే ఒక పక్కకు ఒరిగిపోయాడు.

"ఏమైంది... ఏమైంది..." సముద్రగుప్తుడు వృద్ధుడు భుజాల్ని కుదిపాడు. కాని ఆసరికే అతడి ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమయ్యాయి.

రాకుమారుడికి జరిగినదేమిటో అర్థమయి శిలావిగ్రహములా నిల్చుండిపోయాడు. ఆ తర్వాత మరి కొద్ది ఘడియల్లోనే జరగవలసిన విషయాలు జరిగిపోయాయ్!

రాజవైద్యుడు వచ్చి వృద్ధుడు మరణాన్ని ధృవీకరించాడు. అంతేకాదు... అతడి మరణవార్త రాజప్రసాదమంతా అంచెలంచెలుగా పాకిపోయింది.

చూస్తుండగా యువరాజు సముద్రగుప్తుడి ప్రాంగణం అంతఃపుర పరివారంతో కిక్కిరిసిపోయింది. సముద్రగుప్తుడిలో ఒక ప్రక్కన చింతన, మరొక పక్కన అణచుకోలేని ఆశ్చర్యం. 'తన మృత్యువును ముందుగా తెల్సుకోగలగటం ఎంత అద్భుత విషయం. మరణించిన ఈ పురుషుడు నిస్సంశయంగా ఒక మహాతపస్వియే' రాకుమారుడు ఆదేశాలిచ్చాడు. **ఇంకా ఉంది**



**అవినీతి కేసుల్లో వెనకపడిన వర్గాల నేతలకే ఎందుకు జైలుశిక్షలు విధిస్తున్నారో అర్థంకావటంలేదు.**
-లాలూప్రసాద్ యాదవ్, ఆర్.జె.డి. నేత

పర్సనల్ ఎజెండా

# మోనికా డోగ్రా



ప్రముఖ చిత్ర నిర్మాత, అమీర్‌ఖాన్ భార్య కిరణ్ రావ్ నిర్మించిన సినిమా 'ధోభీ ఘాట్'లో మురిపించిన మోనికా డోగ్రా తన ఇష్టాయిష్టాల జాబితాను ఇలా విప్పింది.

- **నేను ప్రేమించేది :** సంగీతాన్ని
- **అసహ్యించుకునేది :** కపటంగల వ్యక్తులను
- **నేను భయపడేది :** నాకున్న సంపూర్ణ సామర్థ్యం మేరకు జీవించడంలేదని
- **బాగా నచ్చే విషయం :** నాకోసం ఎవరైనా వంట చేయడం నాకు ఎంతో సంతోషాన్ని ఇస్తుంది
- **అతిపెద్ద భయం :** ఆహారంలో బొద్దింకలు
- **నా బలం :** నాలోని స్ఫూర్తి
- **నా బలహీనత :** ప్రేమ
- **నాకు అత్యవసర అంశం :** మెడిటేషన్
- **నాలోని సెక్స్ అప్పీల్ :** నా విజ్ఞానం
- **నాకు నచ్చేవి :** ప్రయాణాలు
- **నాకు ఉన్న పెద్ద ఆస్తులు :** బహువిధాలా క్రమశిక్షణ, నాతో బోర్‌కొట్టకపోవడం
- **నా ఫేవరెట్ బెడ్‌లైన్ :** ఎదుటి వ్యక్తి కొంచెం కొంచెంగా బుర్రలోకి ప్రవేశించాలి
- **నాకు నచ్చే ఆస్తులు :** నా పుస్తకాలు
- **బాగా అలసట కలిగించేవి :** నా ఉద్యోగాలు
- **బాగా టచ్ చేసేది :** చిన్నపిల్లలు
- **నా పుట్టినరోజు:** అక్టోబర్ 25



అనిల్

# Indonesia

Indonesia has over 17000 islands! The five biggest islands are Sumatra, Java, Kalimantan, Sulawesi and Irian Jaya.

**orang utan**

Orang utan means "man of the jungle". Do you think orang utans look like people?

**Komodo dragon**

A Komodo dragon is not really a dragon. It's the world's largest lizard. It sometimes eats goats!

**Minangkabau house**

Don't you think the houses of the Minangkabau people look like water buffaloes' horns?

**water buffalo**

In a Madura bull race, you have to stand on a piece of wood between two bulls as they run!

**bull race**

The Balinese dancers look like moving dolls. Even their eyes move at the same time!Listen to the gamelon orchestra-can you hear the gongs,drums,flutes, zithers and wooden xylophones?

**gamelan orchestra**

**Balinese dancers**

An Angklung is made of bamboo. Each angklung can play only one note. You need many people with different angklungs to play a tune!

**angklung**

Marshall Cavendish Education



In the Indonesian rainforest, you can find the world's biggest, smelliest flower, the Rafflesia. It smells like rotting meat!

## Rafflesia

## Krakatau



Krakatau used to be an island with a volcano. In 1883, it blew up so hard that most of the island disappeared! There was so much ash that the sun was blocked out for two days.

The famous Buddhist temple of Borobudur lay buried for 900 years by ash from volcanoes!



## Borobudur

Gado gado is made of spicy vegetables with peanut sauce. It is a favourite dish of many Indonesians. Do you think you would like it?



## gado gado

This woman is making batik. The cloth has some wax on it. When she puts it in coloured water, the colour only stays on the parts of the cloth that have no wax.



## batik

During festivals, Dayak tribes people wear animal masks while they dance.



## Dayaks

Let's watch the monkey dance. In the story, the monkey god is thrown into a ring of fire. These men are pretending to be the fire, with the monkey god in the middle.



## monkey dance

## wayang kulit

During a wayang kulit performance, the audience never sees the puppets. Instead, they watch the puppets' shadows from behind a screen!



# పేరు మహాత్మ్యం



పేరులో ఏముందిలే, పిలవడానికి ఏ పేరయితే ఏమిటట- అని అనుకునేవారు బహుశా అస్సలు ఉండరేమో! ఎందుకంటే పేరులో ఏముందీ అంటే చాలా ఉంది! ఆ వ్యక్తికి ఆ పేరు ఎంతో ముఖ్యం. అదో ఐడెంటిటీ!

పేరున్న ప్రముఖుల జాబితాలోకి ఆ పేరు చేరితే మరింతగొప్ప ఆపాదించబడుతుంది. బిడ్డ కడుపులో పడింది మొదలు ఏం పేరు పెట్టాలన్న ఆలోచనలు కాబోయే అమ్మానాన్నలనుంచి ఇంటిల్లిపాదికీ కలుగుతుంటాయి. అనేకానేక అంశాలను విశ్లేషించుకుని, ఆచితూచి తమచిన్నారికిచక్కని పేరు పెట్టుకుంటారు. ముద్దుగా, ముచ్చటగా పిలుచుకుంటారు.

బిడ్డ ఎదిగి స్కూలులో అడుగుపెట్టాక ఓ రోజు ఇంటికి వస్తూనే 'నా పేరు నాకు నచ్చలేదు' అంటూ పేచీకి దిగి ఏడుపు లంకించుకుంటే, పేరు ఎంపిక కోసం చేసిన కసరత్తు తాలూకూ కష్టం ఒక్కసారిగా కళ్ళముందు ఆవిష్కృతం అవుతుంది.

తోటిపిల్లలు తన పేరును ముక్కలుగా విడదీసి గేలిచేస్తున్నారనో, ఇతర పేర్లు ఆపాదించి పిలుస్తున్నారనో చెప్తూ అదేపనిగా పేరుమార్చేయమని పేచీలు వేస్తుంటారు. కాని, పేరు మార్చాలంటే అది కుదరని వ్యవహారం అని ఆ చిన్నారి బుర్రలకు అర్థంకాదు. ఓసారి పేరు పెట్టేశాక దాన్ని వెంటనే మార్చేయడం కుదరదన్నది వారికి అవగతం కాని విషయం.

దేవుడి పేరనో, పాత పేరనో, ఫ్యాషన్‌గా లేదనో తమ పేరు పట్ల విముఖత పెంచేసుకుంటారు. ఎంత సర్దిచెప్పినా, సముదాయించినా వారి బుర్రల్లోకి ఎక్కదు. ఇది చాలామంది తల్లిదండ్రులు ఇప్పుడు ఎదుర్కొంటున్న సమస్య.

ఈ సందర్భంగా ఓ ఆసక్తిదాయకమైన విషయాన్ని ప్రస్తావించుకోవాలి. సులువుగా పిలవడానికి వీలయిన పేరు గలవారు పొడవాటి, క్లిష్టమైన పేరుగల వారికంటే అత్యంత విశ్వసనీయంగా, ఆమోదకర ధోరణితో వుంటారని 2014 నాటి న్యూజిల్యాండ్ విక్టోరియా విశ్వవిద్యాలయ పరిశోధనల్లో గుర్తించారు. అంటే పేరులో అంత గొప్పతనం ఉందన్నమాట.

అయితే ఇటువంటి సమీక్షలు ఇప్పటికే క్లిష్టంగా గల సమస్యను మరింత క్లిష్టం చేస్తున్నాయి.

## ⇛ విముఖత తాత్కాలికం

తనపేరును ఎగతాళిచేస్తున్నారన్న కారణంగా పేరును మార్చేయాల్సిందిగా మారాంచేసే దశ ఓ వయస్సు దాకే వుంటుంది. ఇటువంటి ఆహ్లాదరహిత పరిస్థితులు పిల్లల వ్యక్తిత్వంపై ప్రభావం చూపుతాయి. అయితే ఇదంతా వారి మానసిక పరిపక్వత మెరుగయ్యేదాకా మాత్రమే ఉంటుంది.

వారిలో లాజికల్‌గా కారణాలను గుర్తించే సామర్థ్యం వచ్చేవరకు సదరు పిల్లలకు, తల్లిదండ్రులకు కూడా కష్టంగానేవుంటుంది. ఇటువంటి దశలో అంటే పేరుపట్ల అసంతృప్తితో సతమతం అవుతున్నప్పుడు వారికి ఎమోషనల్ సపోర్ట్‌అవసరం ఎంతగానో వుంటుంది. పేరుపట్ల తనమిత్రబృందంనుంచి ఎటువంటి ప్రతికూలత వ్యక్తంఅవుతున్నా, అది చిన్నిబుర్రలపై పెద్ద ప్రభావం చూపుతుంది. పిల్లలు ఎదుగుతున్నకొద్దీ వారిలో క్రమక్రమంగా పరిణతి కనపడుతుంది.

ఈ పరిణతి పేరుగురించిన ఇష్టాయిష్టాల విశ్లేషణపై స్పష్టతనుఇస్తుంది. తన పేరులోని అర్థం, పేరులోని మాధుర్యం స్వయంగా అవగాహన చేసుకుని తన పేరుపట్ల గర్వపడడాన్ని ఆరంభిస్తారు.

తన పేరులోగల అసమానతను అర్థంచేసుకుని ప్రశంసించుకోవడాన్ని మొదలుపెడతారు. అప్పటికీ తమ పేరును అస్సలు ఇష్టపడలేకపోతుంటే ప్రత్యామ్నాయాలు చూడాల్సిన పరిస్థితి రావచ్చునేమో!

## ⇛ ఆత్మస్థైర్యం

పేరు పిల్లల ఆత్మస్థైర్యాన్ని ప్రభావితం చేస్తుందంటే అతిశయోక్తి కాదు. చాలామంది బుర్రల్లో పేరుకు అనేక నిక్షిప్త సంబంధాలుంటాయి.

ఇటువంటి బంధాలు ఒక్కోసారి నియంత్రణ తప్పుతాయి. ఇమేజ్‌లు, అభిప్రాయాలు, వ్యక్తి రూపాన్ని చూడగానే తక్షణం రూపొందితే, పేరు ఆధారంగా

Courtesy: OUTLOOK MONEY



Courtesy : PARENT CIRCLE

లక్షణాలు రూపొందుతాయి. పిల్లలకు బాగా నచ్చే, మెచ్చే పేరు ఉన్నట్లయితే వారిలో తెలియకుండానే ఆత్మస్థైర్యం తొణికిసలాడుతుంది.

అసాధారణ, అరుదైన పేరు గురించిన ఇతరులు ప్రదర్శించే ఆసక్తివారికి గొప్ప సంభాషణగా కనపడుతుంది. తన పేరుపట్ల ఇతరులు ప్రదర్శించే ఆసక్తి పిల్లలకు ఎంతో ఇష్టంగా అనిపిస్తుంటుంది.

వ్యక్తిత్వానికి సంబంధించి పేరు ప్రభావంవారిపై ఎంతగానో వుంటుందని పరిశోధకులు పేర్కొంటున్నారు. తన గురించి తాను ఆత్మవిశ్వాసాన్ని పొందే ప్రక్రియలో పిల్లలు ముందుగా తమ తల్లిదండ్రుల నుంచి సందేశాలు అందుకుంటారు.తదుపరి టీచర్లు, తోటిపిల్లల నుంచి అందుకుంటారు.

ప్రతి సంస్కృతిలోనూ పేర్లు అనుకూలభావాలు నెలకొల్పడంలో ప్రధానపాత్ర వహిస్తుంటాయి. అలాగే, అవే పేర్లు ఎగతాళికి, చమత్కారానికి, జోకులకు కారణం అవుతుంటాయి. ఇటువంటి ప్రతికూలత ఎదుర్కొంటే వారిలో ఆత్మస్థైర్యం ప్రభావితం అవుతుంది. ఎగతాళి చేస్తారన్న భయంతో ఆత్మన్యూనత పెంచుకుంటారు. ఈ న్యూనత తోటిపిల్లలకు దూరంగా వుంచుతుంది. కొందరి విషయంలో తీవ్రమైన సర్దుబాటు సమస్యలు కూడా ఏర్పడే అవకాశం ఉంటుందనేది విశ్లేషకుల అభిప్రాయం.

## ⇛ ఏం చేయాలి

పిల్లల్లో వ్యతిరేకత ఉంది కదా అన్న కారణంతో పేరు మార్చడం సాధ్యం కాని విషయం. కాబట్టి, భవిష్యత్తులో ఎన్నో పరిణామాలు ఎదురుకావచ్చునన్న ముందుచూపుతో పేరును జాగ్రత్తగా ఎంచుకోవాల్సిన అవసరం ఉంది.

విషయాలు ఎలా మారతాయన్న విషయంలో ఖచ్చితత్వాలు ఏవీ వుండవు కాని, వాటి సమీక్షలు, విశ్లేషణలు పేరు ఎంపికలో ఉండాలి. కొన్ని అంచనాలను వాస్తవిక దృక్పథంతో వేసుకోవాలి. పేరు ఎంపికలో తమ ప్రాధాన్యతాక్రమాలు అనుసరిస్తూనే, క్లిష్టతరమైన పేర్ల జోలికి వెళ్ళకూడదు.

పేరు ఎంపికలో అనేకానేక పరిస్థితులను అంచనా వేసుకోవాలి, సమీక్షించుకోవాలి. పేరుపట్ల పిల్లల్లో అసంతృప్తి పొడచూపుతున్నప్పుడు ఆ పేరు చుట్టూ గల కథను, ప్రత్యేకతను వారికి వివరించాలి.ఎందుకు ఆ పేరు పెట్టారో వారికి తెలియజెప్పాలి. తన పేరు గురించి గర్వంగా ఫీలయ్యేలా చూడాలి.

అయితే, పేరుపట్ల ఏర్పడిన అసంతృప్తి తగ్గకపోగా, మరింతగా పెరుగుతూ, అదే ఓ సమస్యగా పరిణమిస్తుంటే మాత్రం పునఃసమీక్షించక తప్పదు. కొత్తపేరుఎంపికలో వారి అభిప్రాయాన్నే తీసుకుంటూ, అందుకు అవసరమైన ఏర్పాట్లు చేసుకోవాలి.

## ⇛ ఎందుకు మార్చాలి

పేరును ఎందుకు మార్చుకోవాలన్నదానికి అనేక కారణాలుంటాయి. చిన్నతనంలో కలిగిన అసంతృప్తి తాత్కాలికం. ఏళ్ళు గడిచేకొద్దీ అది సమసిపోతుంది. తర్వాత పేరును మార్చుకోవడానికి ప్రధానంగా కొన్ని కారణాలను పేర్కొనాల్సివుంటుంది.

**న్యూమరాలజీ :** కొన్ని విషయాలు వరసగా అననుకూలంగా మారుతుంటే న్యూమరాలజీ ప్రకారం, అదృష్టసంఖ్య ఆధారంగా పేరులోని అక్షరాలు మార్చాల్సిందిగా న్యూమరాలజిస్టు సూచించవచ్చు. ఇంటి పేరు నుంచి కాని,పేరునుంచి కాని అక్షరాన్ని తగ్గించడమో, పెంచడమో చేస్తుంటారు.

**నచ్చకపోవడం :** పుట్టినప్పుడు అమ్మానాన్నలు పెట్టిన పేరు నచ్చకపోవడం మార్చుకోవడానికి మరో కారణం అవుతుంది. ట్రెండీగా లేదన్న కారణంగా ఎదిగాక తమ పేరు మార్చేసుకుంటుంటారు.

**పలికేతీరు :** పేరును పలికేతీరు నచ్చక కొందరు తమ పేరు మార్చేసుకుంటుంటారు. వ్యక్తిగత ఛాయిస్ కంటే పేరును ఉచ్ఛరించే తీరు నచ్చకపోవడం ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది.

**ప్రదేశానికి అనువుగా :** ఉద్యోగరీత్యా విదేశాల్లో ప్రయాణం చేయాల్సివచ్చినప్పుడు పేరుకొన్నిసార్లు అక్కడ ఫిట్ కాకపోవచ్చు. విదేశాల్లో కొన్ని పేర్లు పలకడం క్లిష్టంగా వుంటుంది. పదేపదే పేరును ఉచ్ఛరిస్తూ చెప్పినా వారికి అర్థంకాదు. కాబట్టి సెటిలవ్వాలనుకునే ప్రదేశంలోని వారు సునాయాసంగా పిలవడానికి అనువుగా పేరు మార్చుకోవాల్సివస్తుంది.

**వినోదపరిశ్రమ :** ఇక్కడ కొన్నిసార్లు పేరు మార్పు వ్యక్తిగతంగా అనివార్యం అవుతుంటుంది. ఇందుకు అనేక పరిస్థితులు దారితీస్తాయి.

**చట్టపరమైన కారణాలు :** చట్టసంబంధిత పత్రాల్లో పేరును తప్పుగా పేర్కొన్నట్లయితే అనివార్యంగా మార్చుకోవాల్సివస్తుంది.

ఉదాహరణకు పాస్‌పోర్ట్‌లో పేర్కొన్నకారణంగా బాలీవుడ్‌తార రాణిముఖర్జీ తన పేరును Mukheree నుంచి Mukerji గా మార్చుకున్నది.

పేరులో ఇన్ని విషయలు దాగున్నాయన్నమాట! అప్పుడు పేరులోనే ఏముంది అనికాకుండా పేరులోనే అంతా ఉంది అని చెప్పుకోవాల్సివుంటుంది.

కె.మనస్విని







# వారఫలం

జనవరి 18 నుండి 24, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. యత్నీకృత కార్యలాభాలుంటాయి. ఆదాయం, ఖర్చు రెండూ సమానంగా ఉండగలవు. మనశ్శాంతికి భంగం వాటిల్లకుండా కొన్ని విషయాలలో వ్యవహరించుకోవాలి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు తగిన గుర్తింపులు పొందుతారు. ఉపాధులకు చేయు యత్నాలు అనుకూలించగలవు. అర్హతలకు ప్రాధాన్యతనిచ్చుకోండి. యంత్ర, వాహనాల వాడకంలో తగు జాగ్రత్తలు తీసుకోండి. కొన్ని తప్పనిసరి చెల్లింపులకు, సలకరింపులకు ప్రాధాన్యతనీయవలసి రావచ్చును. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, బుధవారాలు చాలా అనువైనవి.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. అతిని ప్రదర్శించి చులకన కాగలరు. సమస్యలను మీరంతట మీరు కొనితెచ్చుకోకండి. సమయ-సందర్భాలకు ప్రాధాన్యతనీయాలి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు శ్రమలు పెరుగుతాయి. ఇచ్చి-పుచ్చుకొను విధానాలకు ప్రాధాన్యతలు ఇచ్చుట మేలవ్వగలదు. ప్రయాణాలు, ప్రయత్నాలందు మీకవసరమైనవాటికి యత్నించుకోండి. స్పెక్యులేషన్లకు, క్రయ-విక్రయాలకు దూరంగా ఉండండి. గత సమస్యలు పునరావృత్తంగా కాకుండా జాగ్రత్తపడండి. వీరికి శుక్ర, శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా. దృఢమైన సంకల్పములతో సాగుతారు. అధికారుల తీరుచే చిన్న తరహా ఒత్తిడులున్నా సంతృప్తికరంగా వ్యవహరించుకోగలరు. ఆదాయాలు మీ ఊహలకు తగినట్లు ఉంటాయి.శ్రమనకు తగిన ఫలితాలను పొందుతారు. దూర ప్రాంతాలకు ప్రయాణాలు చేపట్టుకోగలరు. కుటుంబసభ్యులచే సహకారాలు పొందగలరు. విద్యార్థులకు, పోటీపరీక్షలకు యత్నించుకునేవారికి శుభాలు ఏర్పడగలవు. భవిష్యత్ కార్యాలోచనలు వేగవంతమవ్వగలవు. ఈ రాశివారు ఆది, సోమ,బుధవారాలందు ముఖ్యమైన పనులను చేపట్టుకోండి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. గత పొరపాట్లు కొన్ని సరిదిద్దుకోలేనివిగా చికాకునివ్వగలవు. ఒత్తిడులకు గురికావుటయేకాక ఆలోచనలు తీవ్రంగా సాగు సూచనలు ఉన్నాయి.ముఖ్య విషయాలందు కుటుంబ వ్యక్తులను కలుపుకుని యత్నించుకోండి.ఆదాయాలు అనుకూలం.ఖర్చులను నియంత్రించుకోగలరు. బంధుమిత్రులతో ఇచ్చిపుచ్చుకొను విషయాలందు జాగ్రత్తలు అవసరం.మీ ముఖ్యపనులను ఇతరులకు అప్పగించక మీరే స్వయంగా చూసుకుంటూ, ఆలోచనలకు ఎక్కువ ప్రాధాన్యతనీయుట మేలవ్వగలదు. శుక్ర, శనివారాలందు మరిన్ని జాగ్రత్తలు అవసరం.



**సింహం:** మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. ప్రణాళికాబద్ధంగా సాగుటకు ప్రాధాన్యతనీయండి. తొందరపాటుతనాలు వద్దు. శ్రమలు పెరుగుతాయి. ఆర్థికంగా పరవాలేని విధంగా ఉండుటయే కాక ఖర్చులకు తగిన ప్రయోజనాలు పొందుతారు. ఇతరులకు ఇచ్చు సలహాలందు బహుముఖ ఆలోచనలు అవసరం. బంధుమిత్రులచే కొన్ని విమర్శలు ఎదుర్కోవలసి రావచ్చును. చేపట్టుకున్న ప్రయాణాలను వాయిదా వేసుకోవలసి రావచ్చును.వివాహాది శుభ యత్నీకులకు శుభవార్తలు ఉంటాయి. ఈ రాశివారికి గురు, శుక్ర, శని వారాలు ముఖ్యమైన పనులుచేయుటకు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. గృహమునందు శుభసంకల్పాలకు బలం చేకూరకొనగలదు.భవిష్యత్ అవసరాలను దృష్టిలో పెట్టుకుని పనిచేయగల్గుతారు.వృత్తి,ఉద్యోగ, వ్యాపారాలందు మీదైన తరహాలకు గుర్తింపులేర్పడతాయి. కొన్ని నిర్ణయాలను వేగవంతంగా తీసుకొనుటచే శ్రమలను ఏర్పరచుకునేవారైనా అనుకూల ఫలితాలను పొందగలరు. బంధుమిత్రులచేకూడా కొన్ని సలహాలు, సహకారాలు పొందగలరు. భాతృవర్గమున ఉత్సాహాలందు పాల్గొనవలసి రావచ్చును. ఈ రాశివారికి శుక్ర, శని, ఆది, సోమవారాలు ముఖ్యమైన పనులు చేపట్టుటకు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2,3పా. సంకోచాలకు తావివ్వకుండా వ్యవహరించుకోవాలి. మానసిక ఘర్షణలకు దూరంగా ఉంటూ మీ కర్తవ్యాలకు ప్రాధాన్యతనిచ్చుకోవాలి. బంధుమిత్రులవంటివారిచే మేలును పొందగలరు. అన్నిటా మిశ్రమ ఫలితాలు- కొన్ని చికాకులను ఏర్పరచగలవు. అవసరాలకుమించి ఖర్చులు సూచితము. అధికారులువంటివారిచే సహకారాలు పొందుతారు. పూర్వార్జితములనుండి ఏర్పడు ఆదాయాలు మీ ఆర్థిక వ్యవహారాలను బ్యాలెన్స్ చేయగలవు. విద్యార్థులకు వ్యాసంగాలు చురుకుగా సాగగలవు. ఈ రాశివారికి ఆది, సోమ, బుధవారాలు చాలా అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. దృఢమైన సంకల్పములతో సాగవలసి ఉంటుంది. ఘర్షణలు కొనితెచ్చుకోకుండా ఆలోచనలకు ప్రాధాన్యతనీయండి. నూతనమైన పరిచయాలు కొన్ని ఉండగలవు. ఖర్చులందు మెలకువలు అవసరం. మాతాపితరులపై శ్రద్ధ వహించవలసి రావచ్చును. యంత్ర, వాహనాల వాడకంలో స్వల్ప జాగ్రత్తలు పాటించుకోండి. చేపట్టుకున్న ప్రయాణాలు కొన్ని వాయిదావేసుకోవడం కాని, కొన్ని విరమించుకోవడంగాని ఉండగలవు. సుబ్రహ్మణ్యారాధనలు తప్పనిసరిచేయండి. వీరికి గురు, బుధవారాలు ముఖ్యమైన పనులు చేపట్టుటకు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. మీ పనులు కొన్ని విమర్శలను ఏర్పరచుతాయి. స్వలాభాపేక్షతతో వ్యవహరించుకొనునప్పుడు ఆలోచనలకు ప్రాధాన్యతనీయండి. వృత్తి, ఉద్యోగాలందు ఒత్తిడులకు గురికాకుండా, సాధ్యాసాధ్యాలను గుర్తెరిగి సాగాలి. తోటివారిచే ఆవేశాలు, ఒత్తిడులకు గురిచేయు యత్నాలను ఎదుర్కోవలసి ఉంటుంది.కుటుంబ వ్యవహారాలను, వారి వ్యక్తిగతాలను సంయమనములతో సాగవలసి ఉంటుంది. ఆర్థికంగా ఒకింత ఉత్సాహంగా ఉంటుంది. శుక్ర, శని,ఆదివారాలు అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. శుభఫలితాలు ఏర్పడతాయి. వృత్తి, ఉద్యోగాలందు ఒత్తిడులున్నా సంతృప్తిని పొందగలరు. కొన్ని విషయాలందు మిశ్రమ ఫలితాలుంటాయి. స్పెక్యులేషన్లనందు, పెట్టుబడులందు సంతృప్తి సిద్ధించగలదు. గతంలో రావనుకున్న బకాయిలువంటివి వసూలవ్వగలవు. ఉద్యోగ, ఉపాధి మార్గాలకై యత్నించుకునే వారికి మేలుతనాలుంటాయి.క్రయ-విక్రయాలు అనుకూలంగా సాగుతాయి.దూర ప్రాంతాలకు తలపెట్టుకున్న ప్రయాణాలు ఉపకరించగలవు. రాహు-కేతువులకు కాలభైరవాష్టక పారాయణలు ఉపకరించగలవు. ఈ రాశివారికి గురు, ఆది, సోమవారాలు ముఖ్యమైన పనులు చేపట్టుటకు చాలా అనువైనవి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1,2,3పా. ఈ వారమంతా ఉత్సాహంగా సాగగలదు. యత్నీకృత కార్యలాభాలుంటాయి. ఆదాయం, ఖర్చు సమానంగా ఉంటాయి. స్వల్ప అనారోగ్య భావనలు వంటివి ఉంటాయి. అధికారులతో వ్యవహారాలందు పరిధులను గుర్తెరిగి వ్యవహరించుకోండి. ప్రయాణాలు, ప్రయత్నాలు సౌకర్యవంతంగా సాగుటయేకాక ప్రయోజనకరంగా ఉంటాయి.శుభకార్యయత్నాలు కొంత జాప్యంగా సాగుతాయి. ఆదిత్య ఆరాధనలకు ప్రాధాన్యతనీయండి.శుక్ర,శని,బుధవారాలు అనువైనవి.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. శుభాశుభమిశ్రమంగా ఉంట్టుంది. శ్రమలు తలపించినా ఉత్సాహంగా వ్యవహరించుకోగలరు. ఖర్చులందు నియంత్రణలు అవసరం. వ్యాపార, వ్యవహారాలను తలపెట్టినప్పుడు మీకు తగినట్లుగా ఉండేటట్లు చూసుకోండి. బంధు-మిత్రులచే సహకారాలు పొందగలరు. విద్యావ్యాసంగాలు అనుకూలంగా సాగుతాయి.నూతన వస్తువులను కొన్నిటిని కొనగలుగుతారు. మీనుండి హామీలను పొందిన వ్యక్తులపట్ల తగు జాగ్రత్తలు పాటించుకోండి. ఈ రాశివారికి గురు, ఆది, సోమవారాలు ముఖ్యమైన పనులు చేయుటకు అనువైనవి.

## గుణాల్లోనూ ఘాటు

మిరప అంటే అమ్మో మంట అనే వాళ్ళు ఎక్కువమంది ఉంటారు.కడుపులో మంట అని, గ్యాస్ అని దాని జోలికేపోనివాళ్ళూ వుంటుంటారు.

ఐతే మామూలు కారానికి బదులు పచ్చిమిరపకాయ వాడితే మంచిది అంటున్నారు నిపుణులు.

పచ్చిమిరపకాయల్లో 'సి' విటమిన్ వుంటుంది. జీర్ణక్రియ బావుంటే ఆరోగ్యం బావుంటుంది. ఇటువంటి జీర్ణప్రక్రియ సజావుగా సాగడానికి పచ్చిమిరపకాయ ఉపకరిస్తుంది.

టెన్షన్‌కు తట్టుకోగల శక్తిని ఇచ్చే గుణమూ మిరపకాయల్లో ఉందని అధ్యయనాల్లో గుర్తించారు. అంతే కాదు- ఎర్రరక్త కణాలను వృద్ధిచేసే గుణాలూ వున్నాయి. ◆

## కొలెస్ట్రాల్ తగ్గిస్తుంది

దాల్చినచెక్కకు ఆయుర్వేదం నుంచి ఆధునిక వైద్యందాకా ప్రాముఖ్యం ఉంది. దీని వాడకంవల్ల కలిగే ప్రయోజనాల గురించి ఎప్పటికప్పుడు కొత్తవిషయాలు గుర్తిస్తూనే వున్నారు.

కొలెస్ట్రాల్‌ను బాగాతగ్గించే గుణం దాల్చినచెక్కలోకూడా వుందని కొత్తగా గుర్తించారు.క్రమంతప్పకుండా కొద్దిగా దాల్చినచెక్కపొడిని తీసుకుంటుంటే రక్తంలోని హానికర ట్రైగ్లిజరాయిడ్స్, కొలెస్ట్రాల్ తగ్గుముఖం పడతాయని నిపుణులు చెప్తున్నారు. ◆

## వదిలేయాలి

బరువు తగ్గాలని భావిస్తున్నప్పుడు శరీరానికి తగినంత పోషకాలు ఇవ్వాలన్న విషయంపైనే దృష్టి కేంద్రీకరిస్తారు. శరీరాన్ని చక్కగా పోషించగల పదార్థాల్ని జతచేర్చడంతోనే సరిపోదు.

ఆరోగ్యానికి మంచివి కాని పదార్థాలకు కూడా దూరంగా వుండాలి.

వైట్ బ్రెడ్, పాస్తా, పిజ్జా, కుకీలు, ఆర్టిఫిషియల్ పానీయాలు పూర్తిగా మానేయాలి. కొన్నాళ్ళు వీటిని జాగ్రత్తగా పాటిస్తూ ఉంటే గమనిక వ్యత్యాసం ఇట్టే తెలిసిపోతుంది. ◆



Courtesy : AROGYA SANJEEVANI

## రోగనిరోధకశక్తి

శరీరంలో రోగనిరోధకశక్తి పుష్కలంగా ఉంటే రుగ్మతలనేవి దూరంగా వుంటాయి. రోగనిరోధకశక్తిని ఎక్కువగా పెంచడంలో కమలాపండ్లు తొలి వరుసలో ఉంటాయి.

రోజుకు ఒక కమలాపండు తింటుంటే గుండె, మూత్రపిండాలు, కాలేయం ఆరోగ్యంగా పనిచేస్తాయి.

కమలారసం తాగుతూ ఉంటే శరీరంలో రోగనిరోధకశక్తి బాగా పెరిగి, ఆరోగ్యంగా వుంటారు. దీనిలో వుండే యాంటీ ఆక్సిడెంట్లు అధిక రక్తపోటును నియంత్రణలో ఉంచగలవు.

కమలారసంలో కొద్దిగా మిరియాల పొడి, ఉప్పు కలుపుకుని తాగితే కొవ్వు కరగడంలో సహకరిస్తుంది. పండును యథాతథంగా తింటుంటే జీర్ణప్రక్రియ శీఘ్రంగా సాగుతుంది. ◆

## సహజధోరణి

ఎప్పుడూ ఇంట్లో కొంగుపట్టుకు తిరిగే పిల్లలు కౌమారదశ వచ్చేసరికీ అంటీముట్టనట్లు వ్యవహరించడం బోల్డెంత బాధ కలిగిస్తుంది.

తనగురించే ఆలోచించుకుంటూ, ఇంట్లోని తమను అస్సలు పట్టించుకోవడంలేదని తల్లిదండ్రులు ఆందోళనపడుతుంటారు.

పిల్లలు ఎదిగే క్రమంలో, సామాజిక జీవనంలో భాగం అయ్యే ప్రక్రియలో ఇది అత్యంత సహజమని శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు. టీనేజ్‌లో పిల్లల ధ్యాసంతా తోటి పిల్లలు, స్నేహితుల చుట్టూనే తిరుగుతుంటుంది.

వాళ్ళతో సాన్నిహిత్యానికే తహతహలాడుతుంటారు తప్ప, ఇంట్లోని వాళ్ళ పట్ల అంతగా ధ్యాస ఉండదు. ఇదంతా తాత్కాలికమేనని, పిల్లల వైఖరితో ఆందోళన చెందనక్కర్లేదని పరిశోధకులు తెలియజేస్తున్నారు. ◆

## బరువు పెరగాలా

బరువు తగ్గాలన్న మాటే ఎక్కువగా వినపడుతుంటుంది కానీ, బరువు పెరగాలనుకునేవారూ వుంటారు.

అందుకు ప్రధానంగా పాటించాల్సిన సూత్రాలు ఉంటాయి.

తక్కువ మోతాదులో ఎక్కువ సార్లు ఆహారం తింటుండాలి.

ప్రతి భోజనం తర్వాత పాలతో చేసిన డిజర్టులు లేదా ఏదైనా స్వీట్ తింటూ ఉండాలి. డ్రైఫ్రూట్ లడ్డు, నువ్వుల ఉండలు,కలాకండ్, పాయసం వంటివి తీసుకోవచ్చు.

బ్రేక్‌ఫాస్ట్‌ను రెండు భాగాలుగా చేసుకుని ఉదయంవేళ ఒకసారి, పది గంటలకు, పదకొండుగంటల నడుమ ఒకసారి తింటూ ఉండాలి.

అలాగే మధ్యాహ్న భోజనాన్ని కూడా రెండు భాగాలుగా చేసుకుని ఒంటిగంటకు ఒకసారి, మూడుగంటలకు పెరుగన్నం తినడం మంచిది.

ఆకలిగా ఉన్నప్పుడు టీ, కాఫీల జోలికి వెళ్ళకుండా వేళకు ఏదో ఒక ఆహారం తింటుండాలి. ఇటువంటి పానీయాలు తాగడంవల్ల ఆకలి తగ్గిపోయి ఏమీ తినబుద్ధి కాదు.

# SEX & సైకాలజీ

Your life feel more loved and sexy

పి.వి. నంద్యాల

నేను మతము పుచ్చుకుని పెళ్ళి చేసుకోలేదు. నేనొక స్కూల్లో టీచరుగా పనిచేస్తున్నాను. సెక్స్ కోరికలు నన్ను బ్రతకనివ్వడం లేదు. నా స్నేహితురాలితో స్వలింగసంపర్కంలో పాల్గొంటున్నానుకాని అది పూర్తి తృప్తి ఇవ్వడం లేదు. కృత్రిమ పురుషాంగం రబ్బరుది దొరుకుతుంది అని, అది వాడిచూడమని మరో స్నేహితురాలు సలహా ఇచ్చింది. కృత్రిమ పురుషాంగం నాకు పూర్తి తృప్తిని ప్రసాదించగలదా? నాకు అంతా అయోమయంగా ఉంది. నన్ను ఏం చేయమంటారు? సలహా చెప్పండి.

పూర్తి ఇష్టంతో సన్యాసం పుచ్చుకున్నతరువాత సెక్స్ నుంచి మనస్సుని మళ్ళించుకోవాలి. మీ విషయములో డైలమా వద్దు. మీలోని సెక్స్ కోరికలు మిమ్మల్ని వివశుల్ని చేస్తున్నాయి.స్వలింగ సంపర్కం, కృత్రిమ పురుషాంగం గురించి ఆలోచించకుండా పెళ్ళిచేసుకోండి. అదే సరైన పరిష్కారం.

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370
E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

సంసారంలోకి దిగినతర్వాత సరయినవాడిని కట్టుకోలేదన్న ఆలోచనలోకి వెళ్ళే ఆడవారి సంఖ్య అధికం. పెద్దలు కుదిర్చిన వివాహం, పెళ్ళిచూపులు అరగంటలో అతగాడి గురించి తెలియక రాంగ్ క్యాండిడేట్‌ని ఎంచుకున్నాను అనుకోవటంలో అర్థం ఉంది.

కాని ప్రేమించి, నాలుగైదేళ్ళు కలిసి తిరిగినతరువాత కూడా ఎంచుకున్నవాడి విషయంలో కూడా పప్పులో కాలేశామని ఎలా అనుకుంటారు అనేది అర్థంకాని ప్రశ్న. ఈ విషయంలో తప్పు ఆడవారిదే అంటారు మానసిక శాస్త్రవేత్తలు.

ఆడవారి మానసిక సమస్యలు,ఆలోచనలు జోడీని ఎంచుకోవటం తప్పులు చేయిస్తాయట. కొందరు ఆడవారు అందంగా ఉంటారు, అన్ని అర్హతలు ఉంటాయి. అటువంటి సమయంలో వివాహం చేసుకోవాల్సిన అవసరం లేదనుకుంటారు.

ఒంటిగా, ఆనందంగా జీవితం గడిపేయగలనని అనుకుంటారు. కాని క్రమంగా తన తోటివారంతా పెళ్ళిళ్ళు చేసుకుని, భర్తలతో షికార్లకు వెళుతుంటే నెమ్మదిగా గుబులు మొదలవుతుంది వీరికి.

మరికొందరు ఆడవారికి తమకు ఏమి కావాలో వారికి స్పష్టంగా తెలియదు. ఏ లక్షణాలను చూసి ఇష్టపడతారో ఆ లక్షణాలు ఆ తర్వాత అతనిలో చూసేందుకు ఇష్టపడరు.అందరితో ఫ్రెండ్లీగా కబుర్లుచెప్పటం,



Courtesy : MAXIM INDIA

# సరైన జోడీ దొరకటంలేదా...

ఫైటింగ్ చేసే హీరోయిజంవంటివి చూసి అహో... నా వాడు అంతా ప్రత్యేకంగా ఉండాలనుకుని అతని వెంటపడి, ఒప్పించి పెళ్ళాడతారు.

కాని ప్రియుడు భర్త అవుతాడు. అక్కడనుండి అతడు ఇతరులతో మాట్లాడటం ఇష్టం వుండదు. చనువుగా వ్యవహరించటం సహించలేరు. రౌడీ వేషాలు కట్టిపెట్టి ఇంటిపట్టున, తనకు ఎదురుగా మాత్రమే కూర్చోవాలనుకుంటారు.

ఇక్కడ ఎవరు మారింది నిశితంగా గమనిస్తే అమ్మాయి మారిందని అర్థమవుతుంది. అతడు తన సహజ ధోరణిలోనే వున్నాడు. వాడు ఆకర్షించిన లక్షణాలు ఇప్పుడు నచ్చని అంశాలుగా మారాయి. అతను మారాడనుకుని తాను తగినవాడిని కట్టుకోలేదని బాధపడుతుంటారు

ఎటువంటివాడు తోడుగా కావాలో స్పష్టత లేనందున, దీర్ఘకాల అనుబంధంలోని మార్పులు సహించలేనందున ఇబ్బంది వస్తుంది. ఒకటికన్నా ఎక్కువ అవకాశాలు ఇచ్చినా తిరిగి పొరపాటు జోడీనే ఎంచుకున్నామని బాధపడేవారు లేకపోలేదు.

పెళ్ళికి ముందు కొంత సమయం వుండి, ఆ సమయంలో అతనిది పెత్తనం చెలాయించే మనస్తత్వం అని అర్థంచేసుకుని పెళ్ళి రద్దు చేసుకున్న అమ్మాయి మరో అవకాశం దొరికినపుడు మళ్ళీ తిరిగి అటువంటి పెత్తనం చెలాయించే మనిషినే ఎంచుకుంటుంది.

ఆ తర్వాత అతగాడి పెత్తనం సహించలేక 'రాంగ్ సెలక్షన్' అనుకుంటుంది.అతగాడు చేసే పెత్తనం ఆరంభంలో చాలా బాగుంది అనిపిస్తుంది. ఆ తరువాత క్రమంగా పెత్తనం భరించలేను, ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాడు తన పెత్తనంతో అనే బాధ మొదలవుతుంది.

సరైన జోడీ దొరకకపోవటానికి అమ్మాయిలవైపు ఇటువంటి మానసిక పరిస్థితులు ఉన్నట్టే తనకు తగిన భార్య దొరకలేదనుకుని మగవాడుకూడా తన గురించి తాను ముందుగా ఆలోచించుకోవాలి.

సంసారమనేది దీర్ఘకాలం కలిసి చేసేది. ఇందులో పలు మలుపులు ఉంటాయి. గతుకులు, ఎత్తుపల్లాలు ఉంటాయి.అటువంటి కుదుపులను తట్టుకుని, ప్రతి కుదుపుకు సర్దుకుని, తిరిగి స్థిమితంగా జీవితం సాగించగలిగినపుడే తగిన జోడీ దొరకలేదు అన్న బాధ ఉండదు. ◆



డా॥జి. సమరం

ఆర్.ఎల్. కాకినాడ

మగవానికి సెక్స్‌లో పాల్గొన్నప్పుడు వీర్యస్థలనమయి సుఖప్రాప్తి చక్కగా కలుగుతుంది. మరి ఆడవాళ్ళకి సుఖప్రాప్తి ఏవిధంగా కల్గుతుంది? ఆడవాళ్ళల్లో వీర్యస్థలనం అనేది ఉంటుందా?

స్త్రీలల్లో వీర్యస్థలనం ఉండదు. సుఖప్రాప్తి అనేది టోటల్ బాడీ అండ్ మైండ్ రియాక్షన్. కామోద్రేకం క్లైమాక్స్‌కి చేరినప్పుడు ఒక్కసారిగా బిగుసుకున్న కండరాలన్నీ వదులైపోతాయి.

యోనిమార్గంలో ఉన్న కండరాలన్నీ బాగా వైబ్రేట్ అవుతాయి. ఈ వైబ్రేషన్స్ ప్రతి 0.8 సెకండ్స్‌కి ఒకసారి కలుగుతాయి. ఈ వైబ్రేషన్స్‌వల్ల యోనిలో ఉన్న నాడులన్నీ అత్యద్భుతంగా స్పందిస్తాయి.

కామనాడులు అత్యద్భుతంగా స్పందించడంతో మధురమైన అనుభూతి కలుగుతుంది. దీన్నే స్త్రీలల్లో సుఖప్రాప్తిగా పేర్కొంటారు. పురుషునిలోని సుఖప్రాప్తి ఎంత గొప్ప అనుభూతిని కలిగిస్తుందో స్త్రీలల్లో కూడా అంతగానే మధురానుభూతిని కలిగిస్తుంది.

హెచ్.ఎమ్. కడప

వేశ్యతో సెక్స్‌లో పాల్గొంటే ష్యూర్‌గా హెచ్.ఐ.వి. వచ్చేస్తుందా? ఎందుకు ఇలా అడుగుతున్నానంటే ఒక అమ్మాయి కవ్వించగా సెక్స్‌లో పాల్గొన్నాను. చాలా హ్యాపీగా అనిపించింది.కాని తర్వాత ఆ అమ్మాయి వేశ్య అని తెల్సింది. అప్పటినుంచి భయంతో వణికిపోతున్నాను. ఇక నా బ్రతుకు అయిపోయినట్లేనా?

వేశ్య అయినంతమాత్రాన ఆమెదగ్గర హెచ్. ఐ.వి ఉండాలని లేదు. చాలామంది వేశ్యల్లో హెచ్. ఐ.వి. ఉండదు. అటువంటప్పుడు వాళ్ళతో సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ వ్యాధి సంక్రమించదు. అంతేకాకుండా ఒక్కసారికే హెచ్.ఐ.వి. సోకినట్లయితే వెంటనే మందులు మొదలుపెట్టాలి. దాంతో మీకు ఆ వ్యాధి నష్టంచేయకుండా ఉంటుంది.అయినా ఒక్కసారికే హెచ్.ఐ.వి. రావడం చాలా అరుదు.

# జై భారత్

## చిత్ర వెంకటేష్



సుకా చేసిన పనికి సర్వీస్‌ఛార్జ్‌గా ఇరవై లక్షల రూపాయలు కూడా తీసుకున్నాడు. సరే, అసలు విషయానికి వస్తాను. ఆ అండర్ కవర్ ఏజంట్ ఎవరో మీరు తెలుసుకోవాలి. వీలైనంత తొందరగా అతన్ని పట్టుకుని అతని నిజ స్వరూపం బయటకు తీయాలి.

సాధ్యమైనంతవరకు అతన్ని ప్రాణాలతో పట్టుకోవటానికి ప్రయత్నించండి. వీలుకాకపోతే చంపండి. మనకు సంబంధించిన ఆ రహస్యం అతనిదగ్గర ఉండటానికి వీలులేదు. ఇది నా ఆర్డర్ మాత్రమే కాదు, పొలిట్‌బ్యూరో సభ్యుల అభిప్రాయం కూడా" అన్నాడు డైరెక్టర్ ఎగతాళిగా నవ్వి.

"యస్ కామ్రేడ్ నా శక్తివంచన లేకుండా ఆ మనిషిని పట్టుకోవటానికి ప్రయత్నిస్తాను. ఈ క్షణంనుంచి అతనిబాధ్యత నాకు విడిచిపెట్టండి" అన్నాడుమావ్.

అంతవరకు జరుగుతున్న డ్రామాను మౌనంగా చూస్తున్న పొలిట్‌బ్యూరో సభ్యులలో ఒకరు అన్నాడు. "ఇది దేశ రక్షణకు సంబంధించిన విషయం. మన దేశం గౌరవం పరువు ఇమిడివున్నాయి.అందుకే ఈ సున్నితమైన విషయాన్ని చాలా సున్నితంగా హ్యాండిల్ చెయ్యండి. ఏమాత్రం పొరపాటు జరిగినా అంతా రసాభాసం అవుతుంది. గుర్తుపెట్టుకోండి"

"మన దేశానికి ఏమాత్రం మాటరాకుండా హ్యాండిల్ చేస్తాను" అన్నాడు మావ్ గంభీరంగా.

ఐదునిమిషాల తరువాత మీటింగ్ ముగిసింది. మావ్ తన కారులో కూర్చుని స్టార్ట్ చేశాడు.

కారు వేగంగా బీజింగ్ రోడ్డుమీద దూసుకుపోతుంది. అంతకంటే వేగంగా మావ్ మెదడులో ఆలోచనలు తిరుగుతున్నాయి. ఇంతవరకు భారత్‌కు సంబంధించిన రెగ్యులర్ ఏజంట్లుమాత్రమే ఉన్నారని

9

### జరిగిన కథ

చైనాలోని ఇండియన్ ఎంబసీలో పనిచేస్తుంటాడు ప్రకాష్.పార్టీకి వచ్చిన ప్రద్యుమన్‌ని పరిచయం చేసుకుని ఏ అవసరం వచ్చినా తనని కలవమని, ప్రఖ్యాత డ్యాన్సర్ మోనికాతో బెల్లీ డ్యాన్స్‌ని తనే ఏర్పాటుచేసినట్లు ప్రద్యుమన్‌కి చెబుతాడు ప్రకాష్.

మళ్ళీ సుకాకి ఫోన్ చేస్తాడు గౌతమ్. ఎప్పటిలాగానే డ్రాగన్ రెస్టారెంట్‌కి రమ్మనమని చెబుతాడు. ఆరుగంటలకు వచ్చిన సుకాతో బ్లాక్ కోబ్రా బ్లూప్రింట్‌ని సంపాదించమని చెబుతాడు గౌతమ్. బ్లూప్రింట్ సంపాదించేపనిలో పడతాడు సుకా. ఈలోగా తన ప్రయత్నాల్లో భాగంగా ఒకరోజురాత్రి గౌతమ్ మిలట్రీ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశిస్తాడు.

పన్నెండు అడుగుల ఎత్తున్న గోడల్ని దాటుకొని వెళ్ళిన గౌతమ్‌కి అక్కడ ఒక విమానం నమూనా కనిపిస్తుంది. ఇవన్నీ ఇలా ఉండగా ప్రకాష్ మావ్‌కి ఫోన్‌చేసి 'మీ దేశంలో నెట్‌వర్క్ చేస్తున్న భారత ఏజెంట్ ఇప్పుడు మీరు రహస్యంగా తయారుచేస్తున్న విమానం వద్ద ఉన్నాడని' చెబుతాడు. ఇక చదవండి.




అనుకున్నాడు. కాని పుండుమీద కారంలా ఒక అండర్ కవర్ ఏజెంట్ కూడా తయారయ్యాడు.

రెగ్యులర్ ఏజంట్లను కనుక్కోవటం కొంచెం కష్టమైనా అసాధ్యం మాత్రం కాదు. కాని అండర్ కవర్ ఏజంట్లను మాత్రం పట్టుకోవటం చాలా కష్టం. వాళ్ళ పేర్లు తెలియవు. వాళ్ళు ఎలా ఉంటారో తెలియదు. ఏ రూపంతో ఆపరేట్ చేస్తున్నారో అంతకంటే తెలియదు. వాళ్ళ ఫొటోలుకూడా రికార్డ్స్‌లో ఉండవు. ప్రస్తుతం ఈ అండర్ కవర్ ఏజంట్‌గురించి పూర్తి వివరాలు ఒక డిపార్ట్‌మెంట్ హెడ్‌కుమాత్రమే తెల్సు. అంటే ఈవిషయం ఒక్కసిన్హాకుమాత్రమే తెలుసు. అతను ఎలాగూ చెప్పడు. తనే తెలుసుకోవాలి.

సాధారణంగా ఇలాంటివాళ్ళు లోకల్ ప్రజలతో బాగా కలిసిపోతారు. వాళ్ళతో పూర్తిగా మమేకం అవుతారు. తాము ఇంకో దేశంకోసం పనిచేస్తున్నామని ఎవరికి అనుమానం రానివ్వరు. కొంతమంది సంవత్సరాలు తరబడి పరాయి దేశంలో ఉండిపోతారు.

అక్కడ నచ్చిన అమ్మాయిని పెళ్ళిచేసుకుని పిల్లలను కూడా కంటారు. ఆ దేశ పౌరసత్వం కూడా తీసుకుంటారు. అలాంటివాళ్ళు ఈ దేశంలో ఎంతో మంది ఉండవచ్చు. వాళ్ళలో ఈ ఏజంటును గుర్తించి ఎలా తెలుసుకోవటం.

అంతమందిలో ఒక్కడికోసం వెతకటం మామూలు విషయంకాదు. గడ్డివాములు సూది వెతకటంలాంటిది. చాలా కష్టం. కాని అసాధ్యం కాదు. మావ్‌కు అసలు అసాధ్యంకాదు.

ప్రద్యుమన్ నాలుగు గంటలకు క్లాసు ముగించుకుని క్వార్టర్స్ చేరుకున్నాడు. శుభ్రంగా స్నానం చేసి సింగ్ క్యాంటిన్‌కు వెళ్ళాడు. ఈ రోజు క్యాంటిన్‌లో ఎప్పుడూ లేనంత రష్‌గా ఉంది. చాలా మంది మిలిట్రీ అధికారులు కూర్చుని ఏదో విషయం గురించి సీరియస్‌గా చర్చించుకుంటున్నారు.

"రా ప్రద్యుమన్ బాయ్ నీ కోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు సింగ్.

"ఏమిటి విషయం సింగ్ బాయ్" కూర్చుంటూ అడిగాడు ప్రద్యుమన్.

"ఈ రోజు మీకు ఒక కానుక ఇవ్వాలని నిర్ణయించుకున్నాను. మావాళ్ళు కూడా ఒప్పుకున్నారు" అన్నాడు సింగ్.

ఆ మాటలు వినగానే ఒక్కసారిగా నిటారయ్యాడు ప్రద్యుమన్. సింగ్ ఏ విషయం మాట్లాడుతున్నాడో అతనికి అర్థమైంది.

సింగ్ ట్రాన్స్‌మీటర్ గురించి మాట్లాడుతున్నాడు. మావాళ్ళు అంటే సిన్హా అని అర్థం.

"తప్పకుండా తీసుకుంటాను బాయ్. నువ్వు ఎంతో ప్రేమగా ఇస్తుంటే ఎలా కదలగలను. టిఫిన్ తిన్నతర్వాత తీసుకెళతాను"అన్నాడు ప్రద్యుమన్.

హిందీలో కాకుండా ఇద్దరు ఇంగ్లీష్‌లో మాట్లాడుకుంటున్నారు. హిందీలో మాట్లాడుకుంటే రెస్టారెంటులో కూర్చున్న మిలిట్రీ అధికారులకు అనుమానం వచ్చే అవకాశం ఉంది.



టిఫిన్ కాఫీ ముగించిన తరువాత సింగ్ అతనికి ఒక అట్టపెట్టె ఇచ్చాడు. దానిమీద 'హాంకింగ్ ప్రెషర్ కుక్కర్' అని ఇంగ్లీష్‌లో ముద్రించి ఉంది.

ఇంటికి తీసుకువెళుతున్నప్పుడు ఎవరికీ అనుమానం రాకూడదని, సింగ్ ఇలా ప్యాక్ చేశాడని ప్రద్యుమన్‌కు అర్థమైంది. ఆ డబ్బాను తీసుకుని తన క్వార్టర్స్‌వైపు సాగిపోయాడు.

ఎదురుగా వస్తున్న మిలిట్రీ అధికారులు ప్రద్యుమన్‌ను చూసి చిరునవ్వు నవ్వారు. క్యాంటిన్ భోజనం పడకపోవటంవల్ల కొత్తగా కుక్కర్ కొనుక్కున్నాడని అందరూ అనుకున్నారు. అందులో కుక్కర్‌కుబదులు ట్రాన్స్‌మీటర్ ఉందని ఎవరికీ అనుమానం రాలేదు.

ప్రద్యుమన్ ఇంటికి చేరుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. ట్రాన్స్‌మీటర్‌ను ఇంట్లో ఎక్కడైనా దాచివుంచితే తప్పకుండా అధికారులకు కనిపించి తీరుతుంది. అందుకే ఎవరికీ తెలియకుండా బాత్రూమ్‌లో దాచాలని అనుకుంటున్నాడు. కాని ఎక్కడ దాచాలో తోచలేదు. చుట్టూ చూశాడు.

అప్పుడే అతని చూపులు ఫ్లష్ అవుట్ ట్యాంకుమీద పడింది. అక్కడ దాస్తే ఎవరికీ అనుమానం రాదు. ఈ ఆలోచన రాగానే డబ్బాలోంచి ట్రాన్స్‌మీటర్‌ని బయటకు తీశాడు. అది పూర్తిగా ప్లాస్టిక్ కవరుతో కవర్ చేసివుంది.

## ఏమిటీ పెళ్ళిగోల

త్వరలో 'బాజీరావ్ మస్తానీ' జంట దీపికా పడుకొనె, రణవీర్‌సింగ్‌ల కల్యాణం అంటూ అదేపనిగా వార్తలు షికారు చేస్తున్నాయి. దీపిక పుట్టినరోజునాడే వీరిద్దరి నిశ్చితార్థం కూడా అయిపోయిందని అన్నవారు కూడా ఉన్నారు.

ఈ విషయాలపై ఎప్పుడన్నా, ఎక్కడన్నా దీపిక నోరు మెదిపిందేమో తెలియదుకాని, ఆమె సన్నిహిత స్నేహితులు మాత్రం అలాంటిదేమీలేదంటూ ఖండిస్తున్నారు. అయినా పుట్టినరోజునాడు ఎంగేజ్‌మెంట్ చేసి రెండింటినీ ఒక్కటి ఎందుకు చేస్తుంది. ఏ సెలబ్రేషన్‌కు అదే అని కొందరు స్నేహితులంటే, దీపిక అస్సలు ఇప్పుడు పెళ్ళికి రెడీగా లేనేలేదని మరో సన్నిహిత మిత్రురాలు చెప్పింది.

పైన ప్లాస్టిక్ కవరు ఉండటంవల్ల నీళ్ళలో పెట్టినా పాడుకాదు. ట్రాన్స్‌మీటర్‌ను జాగ్రత్తగా ఫ్లష్ అవుట్ ట్యాంకులో పెట్టి బయటకు వచ్చాడు.

అప్పుడే లీ లోపలికి వస్తున్నాడు. తను తలుపులు మూయకుండా ఎంత పెద్ద తప్పుచేశాడో ప్రద్యుమన్‌కు అర్థమైంది. ఒక్క క్షణం ముందు లీ వచ్చివుంటే అతనికి తప్పకుండా అనుమానం వచ్చివుండేది. "గుడ్ ఈవినింగ్ కామ్రేడ్ లీ" అన్నాడు ప్రద్యుమన్.

"ఈ రోజు నాకు పాఠం వినాలని లేదు. మనస్సు బాగాలేదు. పైగా విపరీతమైన టెన్షన్. తట్టుకోలేకపోతున్నాను అనుకో" అన్నాడు లీ.

"వృత్తిపరంగా ప్రతివాళ్ళకు టెన్షన్ ఉండటం సహజం. దాన్ని ఒక రోజువారి కష్టంగా తీసుకోవాలి కాని దానిగురించి విపరీతంగా ఆలోచించకూడదు. దానివల్ల మనస్సు పాడవుతుంది. ఆ రోజు మూడ్ బాగా అప్‌సెట్ అవుతుంది" అన్నాడు ప్రద్యుమన్.

"మాటలు చెప్పటం తేలిక కాని దాన్ని అనుభవించటం చాలా కష్టం"

"అసలేం జరిగింది, ఈ రోజు మీరు ఎందుకో చాలా విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు. కష్టాలు ఇతరులతో పంచుకుంటే మనస్సుకు శాంతి కలుగుతుంది. గుండెల్లోంచి బరువు దిగిపోతుంది. మీకేం కష్టం వచ్చిందో చెప్పండి. మీకభ్యంతరం లేకపోతేనే"



"నాకు మీతో చెప్పాలని వుంది. మామూలు నా పర్సనల్ విషయం ఐతే ఏమాత్రం దాచకుండా చెప్పేవాడిని.

కాని ఇది డిపార్ట్‌మెంట్‌కు సంబంధించిన విషయం.

**జీవితం మూసకట్టినట్టుగా వుండకూడదు. డెబ్బై ఏళ్ళ వయసులో అయినా సరే తమకు ఏది నచ్చిందో అదే చేయాలి... కాలాన్నిబట్టి మారాలి. -శోభాడే, రచయిత్రి**

డిపార్ట్‌మెంట్ విషయాలు మూడోమనిషికి చెప్పకూడదు.అఫీషియల్ సీక్రేట్ యాక్ట్ ప్రకారం అది పెద్దనేరం.అందుకే సందేహిస్తున్నాను"అన్నాడు లీ.

"మీరు చెప్పింది నిజమే. అఫీషియల్ సీక్రేట్ యాక్ట్ మీకు వర్తిస్తుంది. మీ డిపార్ట్‌మెంట్ రహస్యాలు కాపాడవలసిన బాధ్యత మీమీద ఉంది. ఈ దేశ పౌరుడిగా మీ ధర్మం కూడా"

"చాలా బాగా చెప్పారు. మీరు చెప్పినట్టుగా రూల్ ప్రకారం మా డిపార్ట్‌మెంట్ విషయాలు బయటకు చెప్పకూడదు. చర్చించకూడదు. కాని మీతో చెప్పటం వల్ల నాకు ఎలాంటి సమస్యలు రావని నమ్మకం ఉంది. పైగా మీతో చెప్పుకోవటంవల్ల నా మనస్సులో ఉన్న బరువు తగ్గుతుందని తోస్తుంది"

"ఈ విషయంలో బలవంతం ఏం లేదు. మీకు చెప్పాలనివుంటే చెప్పండి. లేకపోతే లేదు. పాఠం మొదలుపెట్టమంటారా"

"ఇప్పుడు నాకు పాఠం వినే ఓపిక లేదు. మూడ్ అంతకంటే లేదు. పెద్ద సమస్యతో సతమతమవుతుంటే పాఠంవినాలని ఎవరికిమాత్రం ఉంటుంది"

"అయితే ఏం చేద్దాం"

"ఊరికే కూర్చుని కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు లీ సిగరెట్ వెలిగించి. "చెప్పండి" అంటూ సర్దుకుని కూర్చున్నాడు ప్రద్యుమన్.

"ఈ రోజు మా డిపార్ట్‌మెంట్‌లో అత్యవసర మీటింగ్ జరిగింది. నేను కాకుండా నాకంటే సీనియర్ ఆఫీసర్స్ కూడా ఈ మీటింగ్‌కు హాజరయ్యారు. అంతేకాకుండా కేప్టన్ మావ్ కూడా వచ్చాడు. మా దేశంలో ఆపరేట్ చేస్తున్న విదేశీఏజంట్ల గురించి పెద్ద చర్చ జరిగింది. ముఖ్యంగా భారత్ ఏజంట్లు మా దేశంలో చాలామంది ఉన్నారు.

వాళ్ళంతా రహస్యంగా ఆపరేట్ చేస్తూ మా దేశ రహస్యాలను వాళ్ళ దేశానికి చేరవేస్తున్నారు. ఇది ఎలా జరుగుతుందో మాకు అంతుబట్టటం లేదు. అంతటితో ఊరుకోకుండా భారత్ రహస్యంగా ఒక అండర్ కవర్ ఏజంటును కూడా బీజింగ్ పంపించింది. అతను ఎవరో ఎలా ఉంటాడో తెలియదు.

కనీసం అతని పేరు కూడా తెలియదు. ఇంత పెద్ద దేశంలో అతనికోసం ఎక్కడని వెతకాలి. అన్ని ప్రశ్నలే వేటికీ జవాబులు లేవు. ఈ కేసు మావ్ నాకు అప్పగించాడు. ఎంత తొందరగా అయితే అంత తొందరగా అతని గురించి ఆచూకీ తెలుసుకోమని ఆదేశించాడు. అది అంత తేలిక కాదని మావ్‌కు కూడా తెలుసు"

"అసలు ఈ సమస్య అంత బ్లాక్ కోబ్రాప్రాజెక్ట్ వల్ల వచ్చింది. ఈ ప్రాజెక్ట్ ఎంతో రహస్యంగా మొదలైంది. ఏం జరిగిందో ఎలా జరిగిందో తెలియదు కాని ఈ ప్రాజెక్ట్ విషయం భారత్‌కు తెలిసిపోయింది. అందుకే వాళ్ళు ఒక అండర్ కవర్ ఏజెంటును ఇక్కడికి పంపించారని మాకు అర్థమైంది. ఈ దేశంలో ఎంతో మంది భారతీయులు ఉన్నారు.

వాళ్ళంతా వివిధరంగాలలో ఉద్యో

గాలు చేస్తున్నారు. అంతమందిలో ఒక అండర్ కవర్ ఏజెంటును పట్టుకోవటం చాలా కష్టం.

ఏం చెయ్యాలో అర్థంకావడంలేదు. ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతుంది. ఒకవైపు మావ్ ఒత్తిడి ఇంకోవైపు ఆచూకి తెలియని ఈఅండర్ కవర్ ఏజెంట్ నన్ను విపరీతమైన మానసిక ఒత్తిడికి గురి చేస్తున్నాయి" అని ముగించాడు లీ.

"అనవసరంగా ఆ విషయం తలుచుకుని వర్రీ కాకండి. ఈరోజుకాకపోతే రేపయిన అతని ఆచూకి తెలుస్తుంది. రహస్యం ఎన్నోరోజులు దాగదు. ఎప్పుడో ఒకరోజు అది బయటపడితీరుతుంది. ఈలోగా మీరు బుర్ర పాడుచేసుకోవటం ఎందుకు" అన్నాడు ప్రద్యుమన్.

"బ్లాక్ కోబ్రా ప్రాజెక్ట్ ఎన్ని రోజులలో పూర్తి అవుతుందో తెలియకుండా ఉంది. ఇంకా ఎన్ని రోజులు మేము ఎదురుచూడాలో అర్థంకావడంలేదు. ఇంకా ట్రయల్ రన్ పూర్తికాలేదు. అది పూర్తయిన తరువాత కాని మా లక్ష్యం నెరవేరదు. ఐనా హడావిడిగా చేసే పనులు ఎప్పుడు మంచి ఫలితాలు ఇవ్వవు.

కాని ఈ చిన్న విషయం మావ్ గుర్తించినట్టుగా లేదు. హడావిడిగా విమానం తయారుచేసి దాంతో భారత్ మీద దాడిచెయ్యాలని అతని ఉద్దేశం. ఆ ఉద్దేశం మంచిదే కావచ్చు. కాని అది సాధ్యం అవుతుందో లేదో కూడా ఆలోచించాలి కదా"

"అది చాలదన్నట్టు మధ్యలో పింగ్ పాంగ్ గొడవ. దాంతో మావ్ దాదాపు పిచ్చివాడైపోయాడు" అన్నాడు లీ. "పింగ్‌పాంగ్ ఎవరు" ఆశ్చర్యంగా అడిగాడు ప్రద్యుమన్.

"మావ్ నియమించిన ఏజెంటు. అతను ఈ మధ్యనే దారుణంగా హత్యచెయ్యబడ్డాడు. ఈ పని చేసింది ఇండియన్ ఏజెంట్ అని మావ్ నమ్ముతున్నాడు. పైగా పింగ్ పాంగ్ చనిపోయేముందు ఒక రోజు మావ్‌కు కాల్ చేశాడు. తన ఒక ముఖ్యమైన ఇండియన్ ఏజెంట్ గురించి తెలుసుకున్నానని త్వరలో పర్సనల్‌గా వచ్చి చెప్తానని అన్నాడు.

ఆ ఏజెంట్ ఫోటోలు అతని గురించి వివరాలు ఒక రిపోర్ట్‌రాసి సిద్ధంచేశాడు పింగ్ పాంగ్.

తరువాత అతను దారుణంగా చంపబడ్డాడు. అతను సేకరించిన ఫోటోలు తయారుచేసిన రిపోర్ట్ కనిపించలేదు. బహుశా ఇది ఇండియన్ ఏజెంట్ పనిఅయి వుంటుందని మావ్ భావిస్తున్నాడు. అతన్ని పట్టుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు" అన్నాడు లీ. ఒకరకమైన ట్రాన్స్‌లో ఉండి అంతా చెప్పుతున్నాడు అతను.

తన మనస్సులో ఉన్న బాధ అంతా చెప్పుకున్న తరువాత లీ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే ప్రద్యుమన్ తలుపులకు గడియవేసి బాత్రూమ్‌లోకి వెళ్ళాడు. ట్రాన్స్‌మీటర్ బయటకు తీసి ఆన్‌చేశాడు. సిన్హాతో మాట్లాడటానికి అంతకుముందే వేవ్‌లెన్త్ సిద్ధం చేసి ఉంది.

## మరపించే పాత్ర కావాలి

'కుమారి 21 ఎఫ్' తన జీవితాన్ని మార్చేసిందని అవకాశం వచ్చినప్పుడల్లా చెప్పుకుంటుంటుంది హెబ్బాపటేల్. 'నేనీ సినిమా చేసి రెండేళ్ళైనా ఎక్కడికి వెళ్ళినా 'కుమారి' అనే పిలుస్తున్నారు.

ఒక పాత్ర ఇంతటి ప్రభావం చూపినందుకు చాలా ఆనందంగా ఉంది. ఈ కుమారిని మరపించే మరో పాత్ర చేయాలన్న కోరిక ఉంది. నిజానికిఅప్పట్లో ఇమేజ్ గురించి పెద్దగా ఆలోచించకుండా ఒప్పుకున్నాను. ఇంతగా ఫేమస్ చేస్తుందని ఊహించనే లేదు" అని తెలిపింది.

అందుకే ప్రద్యుమన్‌ను కొంచెం కూడా కష్టంలేకుండా సిన్హాతో సంభాషించే అవకాశం కలిగింది.

ఉపోద్ఘాతం లేకుండా లీ చెప్పినదంతా చెప్పాడు. "ఎక్సలెంట్ ప్రద్యుమన్. నువ్వు చెప్పిన సమాచారం మనకు ఎంతో ఉపయోగపడుతుంది. నీతో పాటు అక్కడ ఇంకో ఏజెంట్ కూడా ఆపరేట్ చేస్తున్నాడు. అతని పేరు గౌతమ్. ఆ గౌతమ్ ఎంబసిలో పొలిటికల్ అటాచిగా ఉంటున్న ప్రకాశ్ కింద పనిచేస్తున్నాడు.

ఈ మధ్య ఎంబసి నుంచి కొన్ని విషయాలు లీక్ అవుతున్నాయి. ఈ విషయం స్వయంగా అంబాసిడర్ చెప్పాడు. ఆ చైనీస్ ఇన్‌ఫార్మర్ ఎవరో అంబాసిడర్ చూచాయిగా తెలుసుకున్నాడు.

అతను ప్రకాశ్. కనుక నువ్వు కూడా అతని విషయంలో జాగ్రత్తగా ఉండు. ఈ విషయం గౌతమ్‌కు కూడా నేను మెసేజ్ చేశాను" అన్నాడు సిన్హా.

"నేను ఉంటున్న చోట చాలా సెక్యూరిటీ ఉంది సార్. చుట్టూ మిలిట్రీవాళ్ళు వెయ్యి కళ్ళతో కాపలా కాస్తున్నారు. మీరు బ్లాక్ కోబ్రాను హైజాక్ తీసుకు రమ్మని చెప్పారు. అది సాధ్యమవుతుందా అని ఆలోచిస్తున్నాను. నా శాయశక్తుల ప్రయత్నిస్తాను.

వీలుకాకపోతే కనీసం విమానం బ్లూప్రింట్‌అయినా సాధిస్తాను. దాని సహాయంతో విమానం గురించిన పూర్తి వివరాలు మన ఇంజినీర్లు తెలుసుకుంటారు. భవిష్యత్తులో మనంకూడా అలాంటి విమానంతయారు చెయ్యటానికి ఉపయోగపడుతుంది. ఏమంటారు" అన్నాడు ప్రద్యుమన్.



"అప్పుడే ఒక నిర్ణయానికి రాకు. ఇంకా మనకు చాలా టైమ్ ఉంది. నాకు తెలిసినంత వరకు ఇంకా విమానం ట్రయల్ రన్ పూర్తికాలేదు. అది పూర్తి కావటానికి ఇంకా టైమ్ పడుతుందని తెలిసింది. కనుక నువ్వు ఏమాత్రం

> విజ్ఞానశాస్త్రాలను మాతృభాషలో బోధిస్తేనే దానిమీద విద్యార్థులకు ప్రేమ పెరుగుతుంది.
>
> -నరేంద్రమోడీ, ప్రధాని



తొందరపడవలసిన అవసరం లేదు. సమయం చూసుకుని విమానం లేపుకు రా, అంతవరకు మాత్రం నీ ఐడెంటిటీని ఎట్టి పరిస్థితిలోను ఎవరికీ తెలియనివ్వకు. ఈ విషయం నీకు ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదని నాకు తెలుసు. అయినా చెప్పటం నా బాధ్యత కనుక చెప్పుతున్నాను. ప్రస్తుతానికి ఇంతే సంగతులు గుడ్‌బై అన్నాడు సిన్హా. తరువాత వెంటనే ట్రాన్స్‌మీటర్ నిశ్శబ్దమైపోయింది.

సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది. సూర్యుడు తన డ్యూటీ ముగించుకుని పశ్చిమాద్రి చాటుకు తప్పుకుంటున్నాడు. క్రమక్రమంగా బీజింగ్ సిటీలో చీకటి ఆకరించుకుంటుంది. బీజింగ్‌లో ఒక పార్క్‌లో కూర్చుని ఉన్నాడు గౌతమ్.

అతనికి ఎదురుగా కొంతమంది పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. కొంతమంది వృద్ధులు గుంపులుగా కూర్చుని ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

దాదాపు పదిహేను నిమిషాల నుంచి గౌతమ్ సుజి కోసం ఎదురుచూస్తున్నాడు. ఎప్పుడు సుజి కరెక్ట్ టైమ్‌కు వచ్చేది. ఒక్క క్షణం కూడా ఆలస్యం చేసేది కాదు. ఆమెకు టైమ్‌సెన్స్ డిసిప్లిన్ ఎక్కువ.

కాని ఈరోజు మాత్రం చెప్పిన టైమ్ దాటిపావుగంట దాటింది. అయినా ఆమె ఇంకా రాలేదు. ఉదయం సుజి కాల్ చేసి పార్క్‌కు వస్తే ఒక ముఖ్యమైన విషయం చెప్తానని చెప్పింది. బహుశా అది బ్లాక్ కోబ్రాకు సంబంధించినది అయి ఉంటుందని భావించాడు గౌతమ్. అందుకే ఇంకే వివరాలు అడగకుండా వెంటనే పార్కుకు చేరుకున్నాడు.



విజయవాడ బస్టాండ్‌లోని వైస్క్రీన్స్ మినిప్లెక్స్ థియేటర్‌ను ప్రారంభిస్తున్న నారా చంద్రబాబు నాయుడుతో వైస్క్రీన్స్ అధినేత యార్లగడ్డ రత్నకుమార్

బ్లాక్ కోబ్రా ఫోటోలు తీసిన తరువాత వాటిని డెవలప్ చేసి చూశాడు. చాలా చక్కగా వచ్చాయి ఫోటోలు.

వాటిని ప్రకాశ్‌కు ఫార్వర్డ్ చెయ్యాలని అనుకుంటుంటే సిన్హా దగ్గర నుంచి మెసేజ్ వచ్చింది.

ప్రకాశ్ నిజాయితీమీద ప్రభుత్వానికి అనుమానంగా ఉందని అందుకే అతనికి ఏ విషయం చెప్ప వద్దని ఆ మెసేజ్ సారాంశం.

ఆది చదవగానే గౌతమ్ విస్తుబోయాడు. ఆ షాక్ నుంచి తేరుకోకముందే అనుకోకుండా సుజి దగ్గర నుంచి కాల్ వచ్చింది. రెండు ముఖ్యమైన విషయాలు అతనితో చెప్పాలని అంది. వెంటనే ఎప్పుడు కలుసుకునే పార్క్‌కు రమ్మని చెప్పింది.

చెప్పేది ఏదో ఫోన్‌లో చెప్పమని అన్నాడు. కాని సుజి ఒప్పుకోలేదు. ఆ విషయాలు ఫోన్‌లో చెప్పటం వీలుకాదని ఖచ్చితంగా చెప్పింది. అందుకే ఆమె చెప్పిన టైమ్‌కు పార్కుకు చేరుకున్నాడు. కాని సుజి మాత్రం ఇంకా రాలేదు.

అతను ఆమె గురించి ఆలోచిస్తుంటే సుజి హడావిడిగా వచ్చింది. "సారీ గౌతమ్ అనుకోకుండా ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కోవటంవల్ల కాస్త ఆలస్యం అయింది" అంది సుజి.

"రెండు ముఖ్యమైన విషయాలు చెప్పాలని అన్నావు. ఏమిటది" అన్నాడు గౌతమ్.

"బీజింగ్‌లో కొంతమంది ఇండియన్ఏజెంట్స్ ఆపరేట్ చేస్తున్నారని మా బాస్‌మావ్‌కు తెలిసింది. అందుకే సిటీలో ఉన్న ఇండియన్స్ అందరి గురించి వివరాలు సేకరిస్తున్నాడు.పది టీమ్స్ ప్రతి భారతీయుడి దగ్గరికి వెళ్ళి అతని ఐడింటీని చెక్ చేస్తున్నాయి.

ఈ రోజు కాకపోయినా రేపయినా వాళ్ళు నీ దగ్గరికి రావచ్చు లేక నీ ఇంటికి రావచ్చు. అందుకే నువ్వు చాలా జాగ్రత్తగాఉండాలి" అంది సుజి. "నేనెందుకు జగ్రత్తగా ఉండాలి. నాకు ఏజెంట్లకు ఏమిటి సంబంధం"

"నువ్వు కూడా ఒక ఏజెంటువని నాకు తెలుసు.అందుకే ముందుగా హెచ్చరిస్తున్నాను"అంది సుజి. ఆమె ఆ మాటలు చాలా నెమ్మదిగా అంది.

కాని అది అక్కడ బాంబులా పేలింది. బిత్తర పోయాడు గౌతమ్. "నాకు ఎలా తెలిసిందని ఆశ్చర్య పోతున్నావా" తిరిగి అంది సుజి. ఆ రోజు లవర్స్ పార్క్ వెళ్ళాం గుర్తుందా. నేను నిద్రపోయాననుకుని నువ్వు గదిలోంచి బయటకు వెళ్ళి సెల్‌లో మాట్లాడావు. ఆ మాటలు నేను స్పష్టంగా విన్నాను. అప్పుడే నువ్వు ఒక ఇండియన్ స్పై అని నాకు అర్థమైంది.

అంతేకాదు ఇంకో విషయం నువ్వు ఎప్పుడు ఉపయోగించే సెల్‌ను మంచంమీద విడిచిపెట్టి ఇంకో సెల్‌లో మాట్లాడుతున్నావు. దాంతో నువ్వు రెండు సెల్‌ఫోన్స్ ఆపరేట్ చేస్తున్నావని తెలిసింది"

గౌతమ్ ఏం మాట్లాడలేకపోయాడు. పిచ్చివాడిలా సుజివైపు చూశాడు. "నిజం తెలిసిందికదా మరి ఎందుకు నీ బాస్ మావ్‌కు చెప్పలేదు" అడిగాడు గౌతమ్ తేరుకుని. "నువ్వు నీ కార్యం కోసం నన్ను ఉపయోగించుకుని ఉండవచ్చు. కాని నేను మాత్రం నిన్ను నిజాయితీగా ప్రేమించాను. నువ్వు శత్రుదేశం ఏజెంట్ అని తెలిసినా నీ గురించి మా వాళ్ళకు చెప్పకపోవటానికి కారణం అదే"



ఈ వార్త విని మరి షాక్ అయ్యాడు గౌతమ్. కొన్ని క్షణాలపాటు ఏం మాట్లాడలేకపోయాడు.

"సారీ సుజి నేను చాలా పెద్ద తప్పుచేశాను. నన్ను క్షమించు"అన్నాడు గౌతమ్ తేరుకుని గిల్టీగా. అతనికి చెప్పలేనంత సిగ్గుగా ఉంది.

**లష్కరేతోయిబా, జమాల్ ఉద్ దవా సంస్థలు గొప్ప దేశభక్త సంస్థలు.**

**-పర్వేజ్ ముషారఫ్, పాకిస్తాన్ మాజీ అధ్యక్షుడు**

"జరిగింది మరచిపో. జరగాల్సింది చూడు. ఇంకో విషయం చెప్పటం మరచిపోయాను. నీలాగే ఒక అండర్‌కవర్ ఏజంటు ఆపరేట్ చేస్తున్నాడని మావ్‌కు సమాచారం వచ్చింది. అతనిని పట్టుకోవటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు మావ్. కాని ఇంతవరకు అతని గురించి చిన్న సమాచారం కూడా దొరకలేదు. కనీసం అతని ఫోటో కూడా లేదు"

"అతను ఎవరై ఉంటారు అంటావు"

"అతను గురించి మనకెందుకు. ముందు నీ గురించి ఆలోచించు. నిన్ను నువ్వు కాపాడుకోవటానికి ప్రయత్నించు. మావ్ మనుష్యులు నీ ఇంటిని సోదా చెయ్యకముందే మనం జాగ్రత్తపడాలి. పద మీ ఇంటికి వెళదాం" అంది సుజి.

సుజి మాటలు అతనికి సబబుగానే తోచాయి. వెంటనే ఇద్దరు సుజి కారులో బయలుదేరారు. గౌతమ్ బైక్‌ను పార్క్‌లో విడిచిపెట్టాడు. పార్క్ వాచ్‌మెన్‌కు కొంచెం డబ్బు ఇచ్చి బైక్‌నుజాగ్రత్తగా చూసుకోమని చెప్పాడు గౌతమ్.

అరగంట తరువాత కారు గౌతమ్ అపార్ట్‌మెంట్‌కు కొంచెం దూరంలో ఆగింది. మెయిన్‌గేటు దగ్గర రెండు మిలిట్రీ జీపులు పార్క్ చేసి ఉన్నాయి. వాటికి కొంత దూరంలో ఒక కారు కనిపించింది.

"అది మావ్‌కారు.నేను అనుకున్నదంతాఅయింది. మావ్ తన మనుష్యులతో నీ అపార్ట్‌మెంట్‌కు వచ్చాడు. కొంపదీసి నీ రెండో సెల్‌ఫోన్ అపార్ట్‌మెంట్‌లో లేదు కదా" అంది సుజి కంగారుగా.

"అపార్ట్‌మెంట్‌లో ఉంది కాని చాలా సీక్రేట్‌ప్లేస్‌లో ఉంది" అన్నాడు గౌతమ్. పైకి మామూలుగాఉన్నాడు కాని లోపల మాత్రం విపరీతంగా భయపడుతున్నాడు. అది అతని మొహంమీద ప్రతిఫలించింది. మొహం కత్తివాటుకు నెత్తురుచుక్కలేనట్టుగా పాలిపోయింది. ఊహించని ఈ పరిణామానికి బ్రస్తబ్ధుగాఅయింది. సుజి ముందే చెప్పింది కనుక సరిపోయింది. లేకుండా ఏం జరిగేదో ఊహించటానికే అతనికి భయంవేసింది. ఈపాటికి మావ్ చేతిలో బందీగా ఉండేవాడు.

"ఖచ్చితంగా ఎక్కడుంది" అడిగింది సుజి.

"బీరువా వెనుక వెంకటేశ్వరస్వామి ఫోటో ఉంది. దాని వెనుక పెట్టాను. ఆ చోటు కనుక్కోవటం మావ్ వల్ల కాదుకదా అతన్ని పుట్టించిన బ్రహ్మదేవుడి వల్ల కూడా కాదు" అన్నాడు గౌతమ్.

"మావ్ గురించి నీకు ఇంకా పూర్తిగా తెలిసినట్టుగా లేదు. పాతాళంలో ఉన్నా వెతికిపట్టుకోగలడు. సెల్ ఫోన్ దొరకనంతమాత్రాన మళ్ళీ నువ్వు నీ అపార్ట్‌మెంట్‌కు వెళ్ళలేవు. ఎలాగూ నీమీద మావ్‌కు అనుమానం కలిగింది.నువ్వు అపార్ట్‌మెంట్‌లోకిరాగానే నిన్ను వెంటనే అరెస్ట్ చేయిస్తాడు.అది మాత్రం నిజం. అందుకే ఈరోజు నుంచి నీ అపార్ట్‌మెంట్‌కు వెళ్ళకు. ఇంకా ఎక్కడికైనా వెళ్ళి దాక్కో"

గౌతమ్ ఏదో చెప్పబోయాడు. అప్పుడే అపార్ట్‌మెంట్ లోపలనుంచి ఇద్దరు మిలిట్రీ జవాన్లు వచ్చి పోర్టికోలో ఉన్న మావ్‌కు ఏదో ఇచ్చాడు.

**ఇంకా ఉంది**

# మతిమరుపు మొగుడు

కామెడీ కథ

నాకు మతిమరుపు అని నేననుకోలేదు, నా శ్రీమతి అంది నాకు మతిమరుపు రోగం అని. నా పుట్టిన రోజు నాకెప్పుడూ జ్ఞాపకం ఉండదు, ఎవరో వచ్చి గ్రీటింగ్స్ చెప్పేవరకు.

పోనీ, మగాళ్ళు పుట్టిన రోజులూ అవీ అంతగా పట్టించుకోరు అనుకుందాం. అయినా, యాభయో పడిలో పడ్డాక, ఎప్పుడు పుట్టామో, ఎప్పుడు బడిలో వేశారో ఎవడికి జ్ఞాపకం.

నా శ్రీమతి మరో బలమైన కారణం చూపించింది. నా పెళ్ళిరోజు నాకెప్పుడూ గుర్తుండదు. నా పుట్టిన రోజు ఎవడికి కావాలి కానీ పెళ్ళి రోజు మరొకరితో ముడిపడి ఉంటుంది. అది మరచిపోవడం క్షమార్హం కాదు మరి, శ్రేయస్కరం కూడా కాదు. ఆడవాళ్ళు పెళ్ళిరోజుకి చాలా విలువిస్తారు.

మగాళ్ళు అంతగా పట్టించుకోరు. నా శ్రీమతి, సాయంత్రందాకా చూస్తుంది, నన్ను టెస్టు చేయడానికి. అనేక సంకేతాలిస్తుంది, పొద్దుటే సేమియా పాయసం చేసి, 'ఎందుకో తెలుసా' అంటుంది ఓరగా చూస్తూ. నాకు ట్యూబు వెలగదు.

'ఏముంది టివిలో చూసి సరదాపడి చేసుంటావు' అంటాను. ఆవిడ మొహం మాడిపోతుంది. నేను నీరైపోతాను. మధ్యాహ్నం "ఏమండీ, షాపింగుకెళ్దామా? మీరు నాకో చీర కొనండి. నేను మీకో కుర్తా

## దేవరకొండ గంగాధర రామారావు

లాల్చీ కొంటాను. మీరు ఆ డ్రెస్‌లో మెరిసిపోతారు" అంటుంది.అంతచెప్పినా నాకు ట్యూబ్ వెలగలేదు.

"చాల్లే, వీరయ్యగాడు, వడ్డీ కట్టమని పీకేస్తున్నాడు. ఈ ముద్దులూ ముచ్చట్లకు వయసు దాటిపోయింది" అంటాను చాలా నిర్లిప్తంగా.

ఆవిడ కళ్ళలో గంగా, యమునలు ప్రవహిస్తాయి. అంత దు:ఖించవలసిన విషయమా! అని ఆశ్చర్యపోతాను సాయంత్రం నేను బయటకు వెళుతుంటే ఆఖరి ప్రయత్నంగా ఏడుస్తూనే అంటుంది. "ఇదిగో వచ్చేటప్పుడు నా మొహానికి ఓ మూరెడు మల్లెపూల దండైనా కొని పడేయండి. అవి వాసన చూసుకుంటూ, ఓ తలగడ కౌగిలించుకుని పడుకుంటా, నా పెళ్ళి రోజు ఎప్పుడూ ఇలాగే తగలడిద్ది"




అప్పటికి నాకు ట్యూబ్ లైటు వెయ్యి సూర్యుల కాంతితో, నా గుండెలో, వెలగడమే కాదు, పశ్చాత్తాపంతో నేను కుమిలిపోతాను.

ఆ తర్వా నేను ఆమెను బతిమాలుకోడం, ఇద్దరం షాపింగుకి వెళ్ళడం, చీర, లాల్చీ, రాత్రి మధురానుభూతులు, షరామామూలే. ఆవిడ దగ్గర ఇంకా చాలా రుజువులున్నాయి. ఆమె నన్ను కిరాణా షాపుకెళ్ళి కందిపప్పు తెమ్మంటే, నేను పెసరపప్పు తేవడం,కాఫీ పొడి, టీ పొడి తెమ్మంటే కాఫీ పొడి మర్చిపోవడం లాంటివి.అంతేనా అంటే, ఇంకా చాలా ఉన్నాయి.

మా ఆవిడకో దురలవాటుంది. నేను సాయంత్రం డ్రెస్ వేసుకుని బయటకు వెళ్ళబోతుంటే, పక్క గదిలో చీర సింగారించుకుంటూ అంటుంది.

ఇదిగో మిమ్మల్నే బజారెళితే, కిరాణా కొట్లో, అర కేజి పంచదార, పావుకేజి ఇడ్లీరవ్వ, 200 గ్రాములు ఆవాలు,అరడజను అగ్గిపెట్టెలు...వింటున్నారా హారతి కర్పూరం ప్యాకెట్టు, 2 రూపాయల బ్రూప్యాకెట్లు ఇరవై, పాల ఇంగువ... తీసుకురండి. కాయితంమీద రాసుకోండి మీకసలే మతిమరుపు. (నేను పెన్ను

కాయితం జేబులో పెట్టుకు తిరుగుతోన్నట్టు)

సరే వస్తా అని గేటుదాకా వెళతాను. లోపలినుంచి కేక. అన్నట్టు, దారిలో తలనొప్పి బిళ్ళలు తెండి. రేపు వ్రతం ఉంది. తలనొప్పి పట్టుకుంటే చస్తాను (ఈ లిస్టు జ్ఞాపకం పెట్టుకోవాలంటే నేను ఇప్పుడే చచ్చేలా ఉన్నాను) అన్నట్టు బుజ్జిగాడికి దగ్గుమందు మరిచి పోకండి. సరేసరే అంటూనేను బయటికి పోతాను.

ఇలాంటి లిస్టులు శతవధానులు, అష్టావధానులు గుర్తుంచుకోగలరుకాని, నాలాంటి సామాన్యుడికి సాధ్యమా. తరువాత ఇంటికొచ్చేసరికి సగానికి సగం సరుకులు మరిచిపోవడం, నాకు మతిమరుపు మరీ ముదిరిపోయిందని ఆవిడ బాధపడడం, ఇద్దరం వాదించుకోవడం మామూలే.

నా మతిమరుపు మరీ ఎక్కువైందని నాకే ఎన్నో చేదు అనుభవాలు జరిగాయి. ఇటీవలే ఓ సంఘటన జరిగింది. బజార్లో ఎవరో హల్లో అంటూ పరిచయంగా దగ్గరకొచ్చాడు. నేను గుర్తుపట్టలేదు.

'సారీ మీరెవరో?' అనబోయి నాలిక కొరుక్కున్నా.దేవుడిదయవల్ల టక్కున జ్ఞాపకం వచ్చాడు నా స్కూలు జీవితంలో నా గాఢ మిత్రుడు. వాణ్ణి మరిచిపోతే నన్ను ఈ జన్మలో క్షమించడు.

"రాజేష్ బాగున్నావా?" అన్నాడు, నా చెయ్యిపట్టుకుని ఎంతో ఆత్మీయంగా.

"హాయ్, రామం, ఎన్నాళ్ళకి కలిశాం" ఇద్దరం ఒకళ్ళనొకళ్ళం కౌగిలించుకున్నాము. మా కళ్ళు చమర్చాయి ఎన్నో పాత విషయాలు మాట్లాడుకున్నాం. ఆ సాయంత్రం హాయిగా గడిచింది.

అప్పుడే ఓ నిర్ణయానికి వచ్చాను. పాత మిత్రుడెవరైనా తారసపడితే నాకు జ్ఞాపకం రాకపోయినా వచ్చినట్టు నటించి, పంపించాలని. లేకపోతే వాళ్ళ హృదయం గాయపరిచినవాడినౌతాను. ఆ నిర్ణయం నా కొంప ముంచింది. జరిగిందిది.

ఓ నాడు బజార్లో నడుస్తున్నాను. మనసు కకావికలమైపోయింది. మా ఆవిడిచ్చిన చాంతాడు లిస్టు జ్ఞాపకం పెట్టుకోలేక బుర్రవేడెక్కిపోతోంది.

అదికాక, ఆ ఉదయం మా మేనేజరుగాడు, మూడేళ్ళ ఫైలు, పైకి లాగి అందులో అకౌంటులో పదిరూపాయలు తేడా ఎందుకొచ్చిందని, బుర్ర తినేశాడు.

నా జేబులో ఉన్నవి ఐదువందలు. కిరాణాకి నాలుగు వందలైంది. "అయ్యగారు మీది పాతబాకీ వంద రూపాయలుంది. ఇందులో చూసుకుంటానండి" అని.

ఇలా రోడ్డుమీద మతిలేక నడుస్తుంటే, ఎవడో వెనకనుంచి హలో, హలో అంటూ వచ్చి వీపుమీద గట్టిగా చరిచాడు.

వళ్ళు అదిరిపోయింది. ఏ బండరాయో వచ్చి పడినట్టుంది. వెనక్కితిరిగి, వాడి దవడ పేలగొడదామనుకున్నాను.

"రాజా, నీ కాలేజ్‌మేట్‌ని రా! గోగుల్నిరా!" అన్నాడు. నేను అవాక్కయ్యాను.



## ఫిట్‌నెస్ అంటే ప్రాణం

మామూలుగా నాజూగ్గా వుండే పూజాహెగ్డేకు బరువు తగ్గడానికో, సన్నబడానికో వ్యాయామాలు అవసరం లేదు. అలా అనుకునే చానాళ్ళు వాటికి దూరంగా వుండిపోయిందట.

"సినిమాలు చేయడం ఆరంభించాక కాని ఫిట్‌నెస్ అవసరం ఏంటో అర్థంకాలేదు. శరీరంలో ఫ్లెక్సిబిలిటీ లేక కిందకు వంగి పాదాలు సైతం అంటుకోలేకపోయేదాన్ని.

జిమ్‌కు వెళ్ళడం మొదలుపెట్టాను.అంతేవ్యాయామాలు నా జీవితంలో భాగం అయిపోయాయి. ఇప్పుడు నేను నా శరీరాన్ని ఎంతలా అయినా వంచగలను. డ్యాన్సులు చెయ్యగలను. అందుకే ఫిట్‌నెస్ అంటే నాకు ప్రాణం" అంటూ వివరించింది.

నాకు పీసమెత్తు జ్ఞాపకం రాలేదు. నేను ఇటీవల తీసుకున్న నిర్ణయాన్ని బట్టి వాడిని కొట్టలేదు.

పైగా ఓ వెర్రి నవ్వు నవ్వాను. వాడు రెచ్చిపోయాడు. కాలేజి విషయాలు దొర్లించేస్తున్నాడు. నాకేమీ గుర్తుకురాలేదు. రాజా, ఇంగ్లీష్ లెక్చరర్ చాకో, బోటనీ లెక్చరర్ సునందని.. మన కాలేజ్ బ్యూటీ సునందని రాజు ప్రేమించాడు.

ముప్పై ఏళ్ళమాట మనకెందుకూ అన్నాను నిరాసక్తంగా అదేమిత్రా అలా తేలిగ్గా తీసిపారేశావ్. ఆవిడ కాదందని, చాకోగాడు విషం తాగడం.. కాలేజంతా హోరెత్తిపోయింది కదరా.

ఓరినీ, అన్నీ మరిచిపో యావా మళ్ళీ చెయ్యెత్తాడు.



ఉగ్రవాదం అణిచివేతలో పాకిస్తాన్ ఎన్ని త్యాగాలు చేసినా మాపై నిందలు వేస్తున్నారు.
-ఇమ్రాన్‌ఖాన్, పాక్ మాజీ క్రికెటర్

నేను నేర్పుగా నా చెయ్యి అడ్డు పెట్టి వాడి చెయ్యి గాలిలోనే ఆపేశాను.

"ఒరేయి మన కాలేజిలో కింగ్ కాంగ్ గాడున్నాడు జ్ఞాపకం ఉన్నాడా?"

"లేడు" అన్నాను.

"హోరినీ, లేడా?నీ కాలేజ్ లైఫ్ వేస్టురా. అందరినీ మరిచిపోయావ్ ఆ కింగ్ కాంగ్ గాడు, స్టూడెంట్స్‌తో పందెం కాసి యాభై ఇడ్లీ పావు గంటలో తినేశాడురా పందెం డబ్బు ఐదు వందలూ లాగేశాడు" అని నవ్వుతూ అలవాటుగా వీపుమీద చరచడానికి చెయ్యెత్తాడు. నాకు ఒళ్ళు మండింది. బలంగా ఒక్కతోపుతోశాను. గజందూరం వెనక్కెళ్ళి పడబోయి నిలదొక్కుకున్నాడు.

వాడుహర్టయి "ఏంట్రారాజా ఈ మోటు సరసం" అన్నాడు."నువ్వు బండగా కొడితే బాగుందా"

"ఓ అదా నాకు బ్యాడ్ హాబిట్ అయిపోయిందిరా. అది సరేకానీ మన కాలేజి అమ్మాయి ఇందిర ఎంత స్టైల్‌గా ఉండేదిరా"

"ఏమో ముప్పై ఏళ్ళ క్రితం మాట. ఇప్పుడు మన లాగే ముసలిదైపోయుంటుంది"

"ఇందిరకోసం పడి చచ్చేవాడినిరా! చేయి జారి పోయింది" విచారంగా గుర్తు చేసుకున్నాడు.

నాకు ఒళ్ళుమండి "నువ్వు కూడా చాకోలా కాస్త విషం తాగి చావవలసింది" అన్నాను కసిగా.

వాడు నా అసహనం పట్టించుకోలేదు "ఒరేయి, మన కాలేజి బ్యూటీనలా కించపరచకురా మన స్టూడెంట్ రా, పోనీ సుశీల గుర్తుందా?"

నాకు తల తిరిగిపోయింది. "నాకెవ్వరూ గుర్తులేరు. అసలు నాజీవితంలో ఈ పిచ్చి గోగులుగాడే లేడు. చాకోలేడు. సునందలేదు, కింగ్ కాంగ్ లేడు. ఇందిరలేదు.వీడు మోసగాడైనా అయుండాలి, లేదా, నాకంటె వందరెట్లు మతిమరుపు వెధవైనా అయుండాలి. నేను అర్జంటుగా పనిమీద వెళ్ళాలి" అని గబగబా ముందుకెళ్ళాను.

వాడు వేగంగా వెనకనే వచ్చి "రాజా నాకు అర్జంటుగా ఐదువందలు కావాలి. ఇవ్వరా ప్లీజ్" నేను ఆగకుండా ముందుకెడుతూ "లేవ్!" అన్నాను.

రేపు ఇంటికొస్తా అడ్రస్ చెప్పు అన్నాడు. ఏదో గొణిగి, కదులుతున్న సిటీ బస్సు ఎక్కి మాయమయ్యాను.

నేను బస్సులో సీటులో కూలబడి, గుండె నిండా గాలి పీల్చుకున్నాను.

## నిర్మాత కూడా

'విశ్వరూపం', 'ఉత్తమ విలన్'లలో వరుసగా కమల్‌హాసన్‌తో కలిసి నటించే ఛాన్స్ పొందగలిగిన పూజాకుమార్ అంతకుముందు మంచి మోడల్ మాత్రమే కాదు,షార్ట్‌ఫిల్మ్స్ నిర్మాత, నటి కూడా.

ఉత్తరప్రదేశ్‌కు చెందిన పూజ తల్లిదండ్రులు ఎప్పుడో అమెరికాకు వెళ్ళిపోయినా, భారతదేశ సంబంధాలను బాగానే నిలుపుకున్నారు.

ప్రతి ఏటా వారి కుటుంబం ఇండియా వస్తుండడం వల్ల పూజ సెలవుల్లో కథక్, కూచిపూడి, భరత నాట్యాలను ఎంచక్కా నేర్చుకున్నది. ఈ మధ్య 'గరుడవేగ'లో ఇల్లాలిగా నటించినపూజకు తెలుగు వంటకాలంటే భలే ఇష్టం అట. హైదరాబాద్ బిర్యానీ అంటే మరీ మరీ ఇష్టం అంటోంది.

ఈ గోగులు గాడి గోల నుండి బయటపడ్డాను. దరిద్రుడు ముప్పై ఏళ్ళ క్రితం అందరూ వదిలేసిన కాలేజ్, వీడు వదల్లేదు. ఇంకా అదే లోకం, అదే మనుషులు, అవే కబుర్లు చీ చీ వీడు సైకో.. వాడితో ఇంకొద్దిసేపుంటే నాకు నిజంగానే పిచ్చెక్కును.

ఇంటికి రాగానే మా ఆవిడ నా వాలకంచూసి కంగారుపడిపోయింది. "ఏవండీ, ఏం జరిగింది. సరుకు లేవీ, ముఖం అలా మాడిపోయిందే" ప్రశ్నలవర్షం కురిపించింది.

నేను అదోలా నవ్వి "దారిలో నా కాలేజ్ మేట్ తగిలాడులే" అన్నాను.

"ఇద్దరూ పాతజ్ఞాపకాలు నెమరేసుకుంటూ సరదాగా గడిపేసి, సరుకులు మరిచి పోయారా?"

"లేదు. మేం సరదాగా మాట్లాడుకో లేదు" అన్నాను ముఖం ముడుచుకుని.

"లేదా,అంతలో ఏమొచ్చింది మీకు"

"వాడు నా క్లాస్‌మేట్ కాడు"

ఆవిడ నా విరుద్ధ సమాధానాలకి కంగారు పడి ఆత్రంగా అడిగింది. "మీకు మతి చలించ లేదు కదా అసలేం జరిగిందో వివరంగాచెప్పండి" అంతా చెప్పాను.

గోగులుగాడి పిచ్చిగోలంతా చెప్పాను.

ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ అంది. "రాక్షస వెధవ. తప్పించుకున్నారు గాని వాడి దెబ్బలకేమై పోదురో. పోనీలెండి వాడి శని విరగడైంది" నాకు హఠాత్తుగా గుర్తుకొచ్చింది.

"వాడు నా అడ్రస్ అడిగాడు" అన్నాను.

"ఇచ్చారా?" ఆవిడ గాభరాగా అంది.

"ఇవ్వలేదు కాని, పేట పేరు, వీధి పేరూ చెప్పినట్టు గుర్తు"

"చంపారు. వాడికది చాలు. పట్టేస్తాడు. పైగా, ఈ పేటలో ఎవరిని అడిగినా మన అడ్రస్ చెపుతారు" అంది దూరదృష్టితో. నాకు చెమటలు పట్టాయి.

"ఫరవాలేదు. వాడొస్తే నన్ను పిలవండి. వాడి సంగతి తేలుస్తాను" అంది. నాకు ధైర్యం వచ్చింది. ఆ రాత్రి పీడకలలతో గడిచింది.

మర్నాడు ముందు హాలులో, వాడికోసం భయం, భయంగా ఎదురుచూస్తూ కూర్చున్నాను. సరిగ్గా తొమ్మిది గంటలకి దూరంనుంచే, హల్లో, హల్లో రాజా అంటూ వీధి గేటు విరిగేలా తన్ని బుల్లెట్‌లా హాలులోకి వచ్చి పడ్డాడు.

నా గుండెలు దడదడలాడాయి. గోగులు హాలు నలువైపులా చూస్తూ "ఇల్లు బాగా కట్టావురా రాజా" అంటూ నా ఎదురుగా సోఫాలో కూలబడ్డాడు. "చాకోగాడికి ఇలాంటి ఇల్లే ఉండేది"అన్నాడు. మళ్ళీ ముప్పై ఏళ్ళక్రితం కాలేజి లెక్చరర్ని గుర్తు చేసుకుంటూ.

నేను ముందుగా చేసుకున్న ఏర్పాటు ప్రకారం, రహస్య అలారమ్ నొక్కాను. కొద్దిక్షణాల్లో నా భార్య వచ్చింది. నా పక్కనే కుర్చీలో కూర్చుంది. నా భార్య అన్నాను.

క్లుప్తంగా వాడు గౌరవంగా లేచి నమస్తే మేడమ్ అని నావైపు తిరిగి "ఒరేయ్ రాజా, నీ భార్య మన కాలేజి విజిటింగ్ లేడీ డాక్టర్‌లా ఉన్నారు"

"మిస్టర్, మీరు ఏ ఊరు కాలేజ్‌లో చదివారు? అంది నా భార్య, సూటిగా.

"రాజా నీ మిసెస్ ఇలా అడుగుతున్నారేమిటీ?" ఆశ్చర్యపోతూ అడిగాడు.

"అడిగినదానికి చెప్పరా ఫూల్" అన్నాను చనువుగా. నా భార్య దగ్గరుంటే నాకు ధైర్యమొచ్చింది.

"చెప్పడానికేముంది, నా చదువంతా గుంటూరేగా!" చాలా చిన్న విషయంగా తేల్చేస్తూ అన్నాడు.

"మా ఆయన చదువంతా కాకినాడ" అంది మా ఆవిడ.

వాడు ఉక్కిరిబిక్కిరైపోయాడు. తెల్లమొహం వేసి "నిజమా?" అన్నాడు. నా భార్య అంది "పచ్చి నిజం. అదీకాక మా ఆయన పేరు రాజేష్"

"రాజారావు కాదా?" భయంగా అన్నాడు.

"కాదు. ముప్పై ఏళ్ళ తరువాత కనిపించిన వ్యక్తి నీ స్నేహితుడౌనో కాదో కొంచెం పరిశీలించి తెలుసుకోవద్దూ. నీ ఇష్టం వచ్చినట్టు వాగుతావుటయ్యా. వీపు మీద చర్మం చీలిపోయేట్లు కొడతావా. పైగా డబ్బు తీసుకునేందుకు ఇంటి కొస్తావా, నీమీద పోలీస్ రిపోర్టిస్తే కటకటాలు లెక్కట్టాలి తెలుసా?"

నా శ్రీమతి వాణ్ణి ఉతికి ఆరేసింది. వాడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, చేతులు జోడించి ఒకటే ప్రార్థన "సారీ, సారీ, సారీ మేడమ్ నాకు భయంకరమైన మతిమరుపు. చాలా పొరపాటు చేశాను క్షమించండి మేడం. ఒరేయ్ రాజా, సారీ సారీ రాజేష్ గారూ క్షమించండి.

మేడమ్ క్షమించండి. నా జబ్బు తగ్గాలని దీవించండి వెళ్ళొస్తాను. సారీ, సారీ, సారీ వెళ్తాను ఇక మళ్ళీ రాను" అని చెమర్చిన కళ్ళతో వెనుతిరిగాడు. నా భార్య వాణ్ణి వెనక్కి పిలిచింది.

మీ అమ్మకి జబ్బుగా ఉందన్నావుట. ఇవిగో ఈ ఐదువందలూ తీసుకో. నీ స్నేహితుడే ఇచ్చాడనుకో" వాడు, డబ్బు తీసుకుని ఇద్దరికీ పాదనమస్కారం చేసుకుని వెళ్ళిపోయాడు.

"రండి, రెడీ అవ్వండి" అంది నా భార్య ఉత్సాహంగా.

"ఎక్కడికీ?" అన్నాను అమాయకంగా.

నా భార్య అసహనంగా అంది "వీడి వ్యవహారం పరిష్కారమైతే మనం ఓ స్టార్ హోటల్‌కెళ్ళి లంచ్ చేద్దాం అన్నారుగా నిన్న. మరిచిపోయారా?"

"నిజంగా మరిచిపోయాను. అవును అన్నాను సారీ, సారీ, సారీ"

నా భార్య నవ్వుతూ అంది. "ఆ సారీలు చాలు త్వరగా రండి" ఇద్దరం స్టార్ హోటల్‌కి బయలుదేరాము.

ఎటువంటి అంగవైకల్యం లేనివారు భిక్షాటనచేస్తూ మన దేశ పరువు తీస్తున్నారు.
-శ్వైత్ మాలిక్, బి.జె.పి. ఎమ్.పి.




## మార్కండేయ జయంతి

**(తేదీ : 21.1.2018)**

**మృ**కండుడు మనస్విని దంపతుల పుత్రుడు మార్కండేయుడు. ఇతని తండ్రి తపస్సు చేసినప్పుడు 'జ్ఞానియైన అల్పాయుష్కుడు కావాలా?'

'అజ్ఞానియైన దీర్ఘాయుష్మంతుడు కావాలా?' అని అడిగితే అల్పాయుష్కుడైనాసరే జ్ఞాని కావాలని భగవంతుణ్ణి అడిగాడు మృకండుడు.

ఇతణ్ణి దీర్ఘాయుష్మంతుణ్ణిగా చేయాలనే సంకల్పంతో నారద మహర్షి వచ్చి మృకండుణ్ణి దర్శించి సప్తమహర్షులు వెళ్ళే తోవలో మార్కండేయుణ్ణి నిలిపి పాదాభివందనాన్ని చేయించవలసిందనే ఉపాయాన్ని చెప్పాడు.

**న**మస్కరించడం తడవుగా 'దీర్ఘాయురస్తు-దీర్ఘాయుష్యమస్తు-చిరంజీవీభవ!...' అని ఇలా ఆశీర్వదించడంతో చిరంజీవి కాగలిగాడు మృత్యువుని జయించి మార్కండేయుడు.

అందుకే తల్లులు పిల్లల్ని 'దీర్ఘాయుష్మాన్ భవ!'అనీ,తండ్రులు కూడా 'చిరంజీవీ భవ!' అనీ ఆశీర్వదించాలన్నారు పెద్దలు. 7గురు చిరంజీవుల్లో ఒకడు ఈయన. ❐

## శ్రీ సరస్వతీదేవి స్తుతి

**యా కుందేందు తుషారహారధవళా యా శుభ్ర వస్త్రాన్వితా**
**యా వీణావరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవై స్సదా పూజితా**
**సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥**

మల్లెపువ్వు, చంద్రుడు, మంచు, ముత్యాలహారము అనువానివలె తెల్లనైనది, శుభ్రవస్త్రమును ధరించినది, ఉత్తమవీణచే శోభించు హస్తములు కలది, తెల్ల కమలమను ఆసనముపై కూర్చున్నది, బ్రహ్మ, విష్ణు, శివులచే స్తుతింపబడునది, జడత్వమును (అజ్ఞానమును) సంపూర్ణముగా నశింపజేయు భగవతి అయిన శ్రీ సరస్వతీదేవి మమ్ములను రక్షించుగాక! ❐

## కుంభాయనం

**(తేదీ : 20.1.2018)**

**సూ**ర్యుడు ఒక రాశిలోనుండి మరొక రాశిలోనికి అయనం (జరగడం లేదా ప్రవేశించడం) చేస్తూ ఉంటే ఆ యా రాశి పేరిట ఆ యా అయనాలు ఏర్పడుతాయి.

మేషంలోకి సూర్యుడు ప్రవేశిస్తే మేషాయనం, వృషభంలోనికి ప్రవేశిస్తే వృషభాయనం...

ఇలా మకరరాశినుండి కుంభరాశి లోనికి ప్రవేశించే కారణంగా జనవరి 20వ తేదీన 'కుంభాయన'మన్నారు.

సూర్యోదయం నుండి ఉదయం 8.39 వరకూ పుణ్యకాలం పవిత్ర సమయం కాబట్టి ఆ సమయాల మధ్యలో ఇష్టదేవతా పూజ,

బెల్లం ఉప్పులని దానం చేయడం వల్ల శుభాలు కలుగుతాయి. ❐

## శ్రీపంచమి

**(తేదీ : 22.1.2018)**

**మా**ఘమాసంలో వచ్చే శుద్ధపంచమిని 'శ్రీపంచమి' అని పిలుస్తారు.శిశిర ఋతువు ప్రారంభమయ్యేది ఈ మాసం నుండి కాబట్టే రాబోయే వసంత ఋతువుకి కావలసిన అన్నిటినీ సమకూర్చుకునే ప్రయత్నాలని విష్ణువు ఈ రోజు నుండే ప్రారంభిస్తాడట.

ఆ కారణంగా వసంత ఋతు ప్రయత్నాలని ప్రారంభించే ఈ పంచమిని 'వసంత పంచమి' అనికూడా పిలుస్తారు. సరస్వతీదేవిని విశేషంగా ఈ రోజున ఆరాధిస్తే సర్వజ్ఞత్వం

(అన్నీ తెలిసిన - తెలుసుకోగల తనం) అలవడుతుంది ఎవరికైనా.

కాళిదాసు ఇలా ఆరాధించే మహాకవి కాగలిగాడు.

సర్వజ్ఞత ఈమాసంలో సిద్ధిస్తుంది కాబట్టే సర్వజ్ఞుడనే పేరు గల శంకరుడు ఈ మాసంలోనే తన ఉత్సవాన్ని 'శివరాత్రి' పేరిట చేయించుకుంటాడు.❐

## శివుడూ సూర్యుడూ ఒకరే!

**'నీ**లగ్రీవో విలోహితః...' అనే రుద్ర సూక్తంలోని మంత్రం శివుడూ సూర్యుడూ ఒకరే అని తెలియజేస్తుంది. సూర్యనిబింబంలో ఎలా నీలిదనం ఉంటుందో అదేతీరుగా శంకరుని కంఠానికి నీలిమచ్చ (నలుపు కానే కాదు) ఉంటుంది.

సూర్యుడెలా ఎర్రగా ఉంటాడో అలాగే శివుడు కూడా వి-లోహితః చెప్పలేనంత ఎరుపు శరీరచ్ఛాయతో ఉంటాడు.

**తె**ల్లని విభూతిని ఒంటి నిండుగా ఖాళీ లేకుండా రాసుకుంటాడు కాబట్టి శివుడు తెల్లగా కన్పిస్తాడు పైకి.

బుద్ధి వికాసాన్నిచ్చే సూర్యుడు ఆకాశంలో ఉన్నా ఆయనా శివుడూ ఒకరే కాబట్టి అక్షరాభ్యాసాన్ని చేయిస్తూ 'నమశ్శివాయసిద్ధం నమః' అనే రాయిస్తారు. వర్షాలు రానప్పుడు శివాలయంలో సహస్ర ఘటాభిషేకాన్ని చేస్తారు. ఈ కారణంగానే శివుడు సర్వజ్ఞుడు.

{ వ్యక్తులు నిన్ను అర్థంచేసుకోలేనప్పుడు దైవం నీ వెన్నంటే వుంటాడు. }

# పవర్ డ్రెస్సింగ్

గ్లామర్ విషయానికివస్తే పరిశ్రమ పరిశ్రమకూ తేడా వుంటుంది. టాలీవుడ్‌తో పోల్చితే బాలీవుడ్ గ్లామర్‌పాళ్ళు ఎక్కువగానే వుంటుంటాయి. అదే బాలీవుడ్‌నూ హాలీవుడ్‌తో పోల్చి చూస్తే తేడా ఇట్టే కనపడుతుంది. నేటి బాలీవుడ్ తారలు హాలీవుడ్‌కు ధీటుగానే డ్రెస్సప్ అవుతున్నారు. ఒకే రకం దుస్తుల్లో ఈ బాలీవుడ్-హాలీవుడ్ తారలు ఎలా ఉన్నారో చూద్దాం.




ఇటు బాలీవుడ్‌లో అటు హాలీవుడ్‌లో హంగామా చేస్తున్న ప్రియాంకచోప్రా తెల్లని ధనిష్ లేబుల్ ఎస్‌టి సూట్‌ను గుండెలకు దిగజార్చి గుబులుపుట్టిస్తుంటే,అదేదుస్తుల్ని సింగిల్‌బటన్‌తో సరిపుచ్చేసింది మిలే సైరస్.




Courtesy : STARDUST




బాలీవుడ్ భామ సోనమ్‌కపూర్, శ్రీలంకబ్యూటీ జాక్వెలిన్ ఫెర్నాండెజ్‌లు యాష్ కలర్ యానైన కోచర్ గౌన్లలో నువ్వా? నేనా? అన్నట్లున్నారు.






ఎథ్లెట్ బాడీ బ్యూటీ కత్రినా కైఫ్ బుల్లి బుజ్జి ఎర్ర డ్రెస్‌లో కళ్ళు చెదిరేలా వుంటే, ఇరీనా షేక్ అదే రకం దుస్తులతో, ఎర్రని అధరాలతో మత్తెక్కించేలా ముస్తాబయింది.





ప్రియాంకచోప్రా, లిలీ కాలిన్స్‌లు ఆరెంజ్ కలర్ హై-లో ట్యూబ్ గౌన్లతో ఉషోదయంవేళ సూర్యబింబంలా మెరిసిపోతున్నారు.





ఎంబ్రాయిడరీ బాల్మెయిన్ ఎక్స్ హెచ్& ఎమ్ నెంబర్‌తో దీపికాపడుకొనె, కైలీ జెన్నర్‌లు అందాలు విరజిమ్ముతున్నారు.






ఎర్రని వెల్వెట్ డాల్చె & గబన్న ఫ్రాక్స్‌లో సోనమ్‌కపూర్, కటి పెర్రీలు బార్బీ బొమ్మల్లా తయారయ్యారు.



రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ కూడా లేచివచ్చి కుమార్తెకు నచ్చజెప్పి ఓదార్చాడు. అయినా సహనాదేవికి సాంత్వన కల్గలేదు.చాలా బాధగా ఉంది.

ఓ పక్క కార్తికేయ అలిగి వెళ్ళిపోవటం, ఇటు యోగి మణిసిద్ధుడిచ్చిన తులసిమాలని పోగొట్టుకోవటం ఇది శుభసూచకంగా అనిపించటం లేదు. దిగులుగా కూచుంది.

# మనిషిలో మనిషి





మొత్తానికి స్వామి సత్యానంద జరిపించిన తాంత్రిక క్రతువు నిర్విఘ్నంగా సమాప్తం అయింది. అలాగే పురజనుల కోరికా తీరింది. సంస్థాన వారసురాలిని కనులారగాంచి గృహోన్ముఖులయ్యారు. అప్పటికి పన్నెండుగంటలు దాటింది సమయం.

ప్యాలెస్‌లోకి రాగానే సంజనా చేసిన మొదటి పని కార్తికేయకు ఫోన్ చేయటం.

"జయమ్మా! కార్తీకి ఫోనివ్వు" అంది.

"మీరు ఇద్దరూ గొడవపడ్డారా ఏందమ్మా! ఇంటికి రాగానే అదోలా ఉన్నారు. గదిలోకి పోయి తలుపు మూసుకుపడుకున్నారు. భోజనానికి పిలిచినా రాలేదు. ఆకలిగాలేదంటున్నారు. పిలుస్తాను ఉండండి" అంది జయమ్మ. రెండు నిమిషాల తరువాత తిరిగి జయమ్మ గొంతు విన్పించింది.

"ఆయనేదో బాధలో ఉన్నట్టున్నారమ్మా... ఎవరితోనూ మాట్లాడనూ అంటున్నారు.

E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్‌మోహనరావు



ఎప్పుడూ బాబుగారు ఇలా లేరు. నాకు భయంగా ఉంది. త్వరగా వచ్చేయమ్మా" అంది.

నిజానికి ప్యాలెస్‌లో గొడవ ఏదీ జయమ్మకు తెలీదు. ఆమె భర్తకూ తెలీదు. పొంగుతున్న కన్నీరు తుడుచుకుని "అలాగే వచ్చేస్తాను" అంటూ లైన్ కట్‌చేసింది సంజనా. అలాగే అందిగాని ఎలాగో అర్థం కాలేదు.

కాళ్ళు చేతులు బంధించినట్టుంది. ఎందుకంటే అప్పుడే అయిపోలేదు. ఉదయం నుంచి శివాలయంలో యువరాణి పేర మహా మృత్యుంజయ యాగాన్ని భారీగా నిర్వహిస్తున్నారు.

రాజగురువు మున్నలూరు కృష్ణశాస్త్రి. తను అక్కడికి వెళ్ళాల్సి ఉంది. పైగా ఇంతవరకు కీడు తొలగటానికి జరిపిన తాంత్రిక క్రతువులో పాల్గొనివచ్చింది. మైల పోయేలా తిరిగి తలస్నానం చేసి శివాలయానికి సిద్ధం కావాలి. ఉదయం ఇంట్లో తిన్న టిఫిను.

ప్యాలెస్‌కు వచ్చినా ఏమీ తీసుకోలేదు. అక్కడ కార్తికేయ భోజనం చేయలేదని తెలీగానే ఉన్న ఆకలి కూడా చచ్చిపోయింది. తను సెక్రటరీగా ల్యాబ్‌లో చేరినప్పట్నుండి ఇంతవరకు ఎప్పుడూ ఇలా జరగలేదు. కార్తికేయ చాలా శాంతస్వభావి.

ఏ విషయానికీ తొందరపడే మనిషికాదు. అలగటం అంటే ఏమిటో తెలీదు. కళ్ళల్లో జలపాతాల్లా సుడి తిరుగుతున్నాయి కన్నీళ్ళు. మనసు రాయి చేసుకుని పరిచారికలవెంట స్నానానికి బయలుదేరింది.

స్నానాదికాలు ముగించి వేరే దుస్తులు ధరించగానే పరిచారికలు అలంకారాలు చేసి నగలు ధరింపజేశారు. యాంత్రికంగా కూచుంది యువరాణి. ఆమె మనసు కార్తికేయ చుట్టూ పరిభ్రమిస్తోంది.

తండ్రి పిలిచినా భోజనానికి వెళ్ళలేదు. ఆయన బాధపడతారని పండ్లరసం మాత్రం తీసుకుంది. కూతురి వ్యధను రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ గమనిస్తూనే ఉన్నారు. సరిగ్గా సాయంత్రం మూడు గంటలకు కూతురిని వెంటబెట్టుకుని తన రోల్స్ రాయిస్ కారులో కూచున్నారు రాజావారు.

కాన్వాయ్ బయలుదేరింది. ఎస్కార్ట్‌గా ముందు మూడు వెనక మూడు వ్యాన్‌ల మధ్య రోల్స్‌రాయిస్ కారు వేగంగా శివాలయంవైపు పరుగుతీసింది.

రాత్రి ఎనిమిదిగంటలు దాటింది సమయం. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

వికలమయిన మనసుతో సీలింగ్‌వంక చూస్తూ గదిలో పడుకునున్నాడు కార్తికేయ. డిమ్‌గా బెడ్‌లైట్ వెలుగుతోంది. లేచి లైటుకూడ వేసుకోలేదు. తలుపు మూసి బోల్ట్ వేసుకోడంతో పనిమనిషి కూడా లోనకు అడుగుపెట్టలేకపోయింది. ఇంటికి వచ్చినప్పట్నుంచి ఆ గదిలోంచి బయటికి రాలేదు కార్తికేయ.

పదేపదే సంజనా గుర్తొస్తోంది. చాలా బాధగా ఉంది. ఏమీ తినకపోవడంచేత ఆకలిగా ఉంది. నీరసంగానూ ఉంది. కాని తినబుద్ధిగావటం లేదు.

తలచుకుంటే తనమీద తనకే కోపంగా ఉంది. ఎంత అమాయకుడు కాకపోతే ఎన్నారైని అనగానే నమ్మేయడమేనా. కనీసం సంజనా పాస్‌పోర్ట్ వీసాలను కూడా చెక్ చేయకుండా గుడ్డిగా నమ్మి సెక్రటరీని చేశాడు. తన హృదయంలో స్థానం ఇచ్చాడు. కాని ఇంత బాధపెడుతుందని ఊహించలేదు.

సంస్థాన యువరాణి అని కొంచెం కూడా సందేహించలేకపోయాడు. కలలోనైనా రాజావారికి ద్రోహం చేయని తనను ద్రోహిని చేసింది... దోషిగా నిలబెట్టింది. రాజావారు కూడా ఏమీ తెలీనట్టు నటించటం మరీ బాధ కలిగించిన విషయం. ఏంచేయాలి?

ప్రశ్నలు చాలానే పుట్టుకొస్తున్నాయి. కాని సమాధానాలే దొరకటంలేదు. సంజనాయే సంస్థాన వారసురాలని ఏమాత్రం ముందుగా తెలిసినా ఆమెకింత దగ్గరయ్యేవాడు కాదు. ప్రాణంలో ప్రాణమైపోయాక ఇప్పుడామెను మర్చిపోగలడా.. కాదని బ్రతగ్గలడా!

ఎడతెరిపిలేని ఆలోచనల మధ్య ఫోన్ మోగటం కాస్త ఆలస్యంగా గుర్తించాడు. సంజనా చేసిందనుకున్నాడు. చూస్తే అది రాజావారి నంబరు. ఎత్తకుండా ఉండలేడు. లిఫ్ట్ చేయక తప్పలేదు.

"చెప్పండి సార్" అన్నాడు పొడిగా.

"నేను చెప్పాలా... ఏం చెప్పాలి? నువ్వు చెప్పాలి. కబురు పంపినా ఆగకుండా ఎందుకెళ్ళిపోయావు?" ఫోర్స్‌గా విన్పించింది రాజావారి గొంతు.

"క్షమించండి సర్. నావల్ల పొరబాటు జరిగింది. సంజనాయే యువరాణివారని తెలీక..."

10

## జరిగిన కథ

మృత్యుంజయ హోమం చేపిస్తున్నానని కార్తికేయతో చెబుతారు రాజావారు.

మూఢనమ్మకాలని నమ్మనని రాజావారితో చెపుతాడు కార్తికేయ. యాగం నిర్వహణ రోజు దగ్గరపడుతుండడంతో పళని నుండి ఆరు గురు శిష్యులతో వర్లాకిమిడి చేరుకుంటాడు స్వామి సత్యానంద. ప్యాలెస్‌లో జరిగే యాగానికి సంజనాని రమ్మంటాడు కార్తికేయ. నేను రాను, నువ్వెళ్ళు అని చెబుతుంది సంజన.

యువరాణి మేఘనా సౌందర్యానందసహానా దేవి జాతకంలో ఉన్న దోషాన్ని పోగొట్టేందుకు మొదటిగా ఓ మేకపోతుతో ఆమె వివాహం జరిగినట్లుగా ఓ క్రతువును నిర్వహిస్తారు.

ఆమె అచ్చు తన ప్రియురాలు సంజనాలా ఉండటం చూసి షాక్ అవుతాడు కార్తికేయ.

అయితే ఆమె సంజనాయే అని నిర్ధారించుకుని ఆమె, రాజావారు ఇద్దరూ తననెందుకు మోసం చేశారోనని ఆవేదనపడి అక్కడినుండి వెళ్ళిపోతాడు. అతను అలా వెళ్ళిపోయేసరికి సంజనా తనగురించి కార్తికేయ ఏమనుకున్నాడోనని బాధపడుతుంది. యోగీంద్రుడు రక్షాకవచంగా ఇచ్చిన సంజనా మెడలోని తులసిమాల ఆ క్రతువులో దగ్ధమౌతుంది. ఇక చదవండి.



# ప్రేమ ప్రస్తావన

ప్రేమ, పెళ్ళీ రెండూ తప్పిపోయాక త్రిష వీటి ప్రసక్తిని పెద్దగా తెచ్చిందే లేదు. చానాళ్ళ తర్వాత ఇప్పుడు ప్రేమ ప్రస్తావన పదేపదే చేస్తున్నది.

"ప్రేమలో ఉన్నప్పుడు ప్రతిదీ నచ్చుతుంది. ఎదుటివాళ్ళు చిన్న చిన్న తప్పులు చేసినా ఇట్టే పరస్పరం సర్దేసుకుంటుంటాం. అదే ప్రేమ లేకపోతే మనస్సు ఎదుటి వ్యక్తిని వంపేయమంటుంది. ఏదీ నచ్చదు" అంటోంది త్రిష.

ఏమిటింత హఠాత్తుగా ప్రేమగోల...?

"ప్రేమించానంటావ్. నా కూతురు చేసిన తప్పేమిటి? నీతో నిజం చెప్పకపోవడమేనా? అదే తప్పయితే ఆ తప్పు నేనూచేశాను. నన్నూ ద్వేషిస్తావా?"

"అయ్యో...! మిమ్మల్ని ద్వేషించటమా. నేను ఎవరినీ ద్వేషించలేను సర్. జరిగిందానికి నేను బాధపడుతున్నాను అంతే"

"నీది అర్థంలేని బాధ. మీ ప్రేమకు అడ్డుచెప్పేవాణ్నయితే మీరు జంటగా ప్యాలెస్‌కొచ్చిన రోజే ఖండించేవాడ్నిగదా. నాకంతా తెలుసు. నీకు తెలీని విషయాలు చాలా ఉన్నాయి. సమయం వచ్చినప్పుడు చెప్తాను. అంతవరకు ఓరిమి వహించు. నువ్వు బాధపడుతున్నావని తెలిసి నా బిడ్డ ఏడుస్తోంది. ఈ రోజంతా ఉపవాసం ఉంది. తనను ఏడ్పించటమేనా నీ ప్రేమ?"

కార్తికేయను మాట్లాడనివ్వలేదు రాజావారు.

"ఇంకేం చెప్పకు. తను ఇండియా వెళ్తానంటూ గొడవ చేస్తుంటే నీవద్ద భద్రంగా ఉంటుందని నీకు సెక్రటరీగా జాబ్‌లో చేరేలా చేసింది నేను.

ఇంతవరకు నా కుమార్తె ఎలా ఉంటుందో ఇక్కడ ఎవరికీ తెలీదు. ఈ రోజు జరిగిన తాంత్రిక క్రతువు మూలంగా అందరికీ తెలిసిపోయింది.

అజ్ఞాత శత్రువు నుంచి ఏ రూపంలో ప్రమాదం ముంచుకువస్తుందో తెలీదు. ఈ టైమ్‌లో అండగా ఉండాల్సిన నువ్వు అలిగి కూచోవటం కరెక్ట్ కాదు. అర్థమవుతోందా! నువ్వేం చేస్తావో నాకు తెలీదు.

నా కుమార్తె ఎప్పటిలా సంతోషంగా ఉండాలి. ఇంతక్రితమే నీ వద్దకు బయలుదేరింది. భద్రంగా చూసుకో" అంటూ మరోమాటకి అవకాశమివ్వకుండా లైన్‌కట్‌చేశారు రాజా విష్ణుచంద్రగజపతిమహదేవ్.

ఫోన్ చెవిదగ్గరే ఉంచుకుని చేతనారహితుడయి కాసేపు అలాగే ఉండిపోయాడు కార్తికేయ. ఏమాలోచిస్తున్నాడో అతడికే అర్థంగావటంలేదు.

రాజావారి మాటల్నిబట్టి తమ ప్రేమకు వారి ఆశీస్సులున్నాయని సుముఖంగానే ఉన్నారని అర్థమైంది. అంతకుమించి ఏదీ అర్థంకాలేదు. తనకు తెలీని విషయాలు ఉన్నాయా... ఓపిక పట్టాలా... యువరాణికి అజ్ఞాతశత్రువులున్నారా. శత్రువులంటూ ఉంటే రాజావారికి ఉండాలి. యువరాణికి ఎందుకుంటారు?

యువరాణి మేఘనాసౌందర్యానంద సహానాదేవి సంజనాగా పేరు మార్చుకుని తనవద్ద సెక్రటరీగా చేరటంలో రాజావారి పాత్ర ఉందా! భద్రతకోసమే ఆమెను తనవద్దకి చేర్చారా.. నమ్మలేకపోతున్నాడు.

కార్తికేయ ఆలోచనలు ఓ కొలిక్కి రాకముందే పోర్టికోలోకి వ్యాన్ వస్తున్న ఇంజన్ శబ్దం విన్పించింది. సంజనా వచ్చేసింది. ఇప్పుడేం చేయాలి.

కోపంతో గదిలోనేముడుక్కూచోవాలా! రాజావారి మీది గౌరవంతో వెళ్ళి తలుపు తెరవాలా, సందిగ్ధంలో లేచి నిలబడేలోపల వ్యాన్ దిగుతూనే సుడిగాలిలా లోనకొచ్చిన సంజనా "కార్తీ... కార్తీ తలుపు తియ్" అంటూ దబదబ తలుపుల్ని బాదటం విన్పించింది.

గదిలో లైటు వేసి వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా సంజనా. ఇప్పుడామె యువరాణిగా రాలేదు. ఆ దుస్తులు లేవు. మణిమయ రత్నహారాల్లేవు. పంజాబీ డ్రెస్‌లో సింపుల్‌గా ఎప్పటి సంజనాగానే వచ్చింది. నీరసంతో వాడిన గులాబిలా ఉంది.

ఎర్రబారిన కళ్ళలో ఇంకా ఆమె కన్నీరు చిప్పిల్లుతోంది. కాసేపు ఒకరినొకరు అలా చూస్తూండిపోయారు. ఆమెనెంతగా తను బాధపెట్టాడో కార్తికేయకు అర్థమైంది.

చేతులు చాపాడు... అంతే- ఒక్క దూకులో గడప దాటి అతడి బిగికౌగిట ఒదిగిపోయింది. పెన్నిధి దొరికినంతగా ఆమెను హృదయానికి హత్తుకొంటూ "జయమ్మా...! చాలా ఆకలిగా ఉంది, మా ఇద్దరికీ భోజనం వడ్డించు" అని అరిచాడు.

"అలాగే బాబూ. ఒక్క పదినిమిషాలు. వేడివేడిగా వడ్డిస్తాను" బయటినుంచి ఉత్సాహంగా విన్పించింది జయమ్మ గొంతు. అంతే కోపంతో కార్తికేయను ఒక్క తోపు తోసి బెడ్ చివర కూచుంది.

"నాకు అక్కర్లేదు. నువ్వు భోంచెయ్యి" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"అలాగంటే ఎలా? నీరసంతో ముఖం చూడు ఎలా వాడిపోయిందో. నామీది కోపంతో ఉపవాసం ఉండమన్నానా" అంటూ చేయి అందుకోబోతుంటే విసిరికొట్టింది.

"ఏంటి నీమీది కోపంతో ఈరోజు ఉపవాసం ఉన్నానా" అంటూ నిలదీసింది కించిత్తుఆశ్చర్యంగా.

"మరికాదా?" దబాయించాడు.

"ఓహో... మరి తమరి ఉపవాసానికి కారణం ఏమిటో?" వ్యంగ్యంగా అడిగింది.

"నామీద నాకే కోపం"

"అంతేనా..."

"ఇంకేముంది. అంతే"

"అంతేనా. అంటే నాదీ నీమీద కోపమే. నీదీ నీ మీద కోపమేనంటావ్"

"అవును"

"ఇప్పుడు నామీద నాకూ కోపంగా ఉంది. నీతో నిజం చెప్పకుండా దాచాగదా. నాకేమీ అక్కర్లేదు" పక్కన కూర్చుని దగ్గరకు లాక్కున్నాడు.

"సారీ సంజూ. ఇంకెప్పుడూ ఇలా జరగదు. మాటిస్తున్నాను. సరేనా? ఉదయానికి నువ్వు ఎప్పటిలా ఉండకపోతే రాజావారితో నాకు మాటొస్తుంది. ప్లీజ్. అలకమానవా" బ్రతిమాలాడు.

"డాడీ ఫోన్ చేశారా...?" ముఖంలోకి చూసి అడిగింది. "ఊ.... ఇంతక్రితమే" అన్నాడు కార్తికేయ.

"బాగుంది. రాజావారు ఫోన్‌చేస్తేగాని నీకు జ్ఞానోదయం కలగలేదన్నమాట. నన్ను చాలా బాధపెట్టావు కార్తీ. నువ్వు డాడీతో మాట పడాల్సిందే. నాకు ఏమీ అక్కర్లేదు"అంటూ బుంగమూతిపెట్టి బెడ్‌మీద పడుకుంది.

ఇంతలో బయటినుంచి జయమ్మ పిలిచింది "భోజనం రెడీ... రండి బాబూ..." అంటూ.

మీదకు వంగి సంజనా పగడాల పెదవులను ప్రేమారా ముద్దాడాడు కార్తికేయ.

"రా సంజూ, భోజనం చేద్దాం. ప్లీజ్.." అని అంటూ అభ్యర్థించాడు.



**ఒక గోవును పెంచుకుంటే 30 ఎకరాల ప్రకృతి సహజ వ్యవసాయం చెయ్యగలరు.**

-సుభాష్ పాలేకర్, వ్యవసాయ నిపుణుడు

"నాకు బాధగా ఉంది కార్తీ. రాలేను. ఆ రోజు మణిసిద్ధుడిచ్చిన తులసిమాలను పోగొట్టుకున్నాను. అగ్గిలో దగ్ధమైంది" అంది బాధగా.

ఆమె గళసీమలో తులసిమాల లేని విషయాన్ని అప్పుడు గమనించి విస్తుపోయాడు కార్తికేయ. సంజనా చెపుతూనే ఉంది.

"తులసిమాల పోగొట్టుకోగానే ముందు ముందు ఏం కానుందో ఏమిటో అని భయంగా ఉంది. ధైర్యం సన్నగిల్లుతోంది. నీతో ఏ సుఖం పంచుకోకుండానే చని పోతానేమోనని భయంగా కూడా ఉంది" అంది.

నిలువుగా ఆమెపక్కనే పడుకుని కౌగిట బంధించి ఓదార్చాడు కార్తికేయ. తులసిమాల పోవటం ఊహించని సంఘటన. ఆశ్చర్యం కలిగిస్తోంది.

ఎందుకంటే ఆ రోజు కారుదిగి వెళ్ళిపోతూ మణి సిద్ధుడు ఓ మాట చెప్పాడు- "వస్తావులే... ఓ రోజు నా వద్దకు తప్పకుండా వస్తావు" ఆ మాటకి అప్పట్లో అర్థం తెలీలేదు. ఇప్పుడూ క్లియర్‌గా తెలీదు.

ఊహించుకునేవి ఎప్పుడూ నిజంకావు. కాని మహనీయుల మాట వృథాపోదు. ఇప్పుడీ విషయాలు చర్చిస్తే యువరాణి మరింత బెంబేలుపడుతుంది. అందుకే తేలిగ్గా నవ్వేసి చెంపలు ముద్దాడాడు.

"నీవి అర్థంలేని భయాలు సంజూ... నన్నుదాటి ఏ ప్రమాదం కూడా నీ దరి చేరదు... చేర లేదు" అని ధైర్యం చెప్పాడు.

"ఆ ధైర్యంతోనే ఓ నిశ్చయానికి వచ్చేశాను కార్తీ. ఈ రోజునుంచి నేనూ ఇక్కడే పడుకుంటాను. ఈ డబుల్‌కాట్‌ని మనిద్దరం షేర్ చేసుకుందాం"

"వామ్మో... కొంపముంచకు. పెళ్ళికానివాళ్ళం. వయసులో వున్నాం. ఉడుకు నెత్తురు ఊరుకోదు. మనకి ఏకశయ్య నిషిద్ధం దేవీ.

ప్లీజ్ నువ్వు నీ గదిలో... నేను నా గదిలో... విడి విడిగా. అంతే" నచ్చచెప్పాలని చూశాడు. కార్తికేయని పక్కకు తోసి లేచి కూర్చుంది సంజనా.

"ఏంటి..? ఓకేనా...?" అనుమానంగా అడిగాడు కార్తికేయ.

"అలా కుదరదుగాని పద భోంచేద్దాం" అంటూ బెడ్ దిగింది సంజనా.

"కుదరదంటే ఎలా. ఏ మాటా ముందే చెప్పాలి గదా..."

"ఇంకా ఏం చెప్పాలి?"

ఇద్దరూ వాదులాడుకొంటూనే డైనింగ్ రూమ్‌కి దారితీశారు.

మరునాడు ఉదయం -

అప్పటికి అరడజనుసార్లు కార్తికేయ ఇంటికి ఫోన్ చేసుంటారు రాజా విష్ణు చంద్ర గజపతి మహదేవ్. అన్నిసార్లు పని మనిషి జయమ్మే మాట్లాడింది.

సమాధానం ఒక్కటే "ఇంకా నిద్ర పోతున్నారండి. లేవగానే చెప్తాను"

తొమ్మిదిగంటలయినా ఇంకా నిద్ర పోవటం ఏమిటి? రాత్రంతా నిద్రపోకుండా వీళ్ళు ఏం చేస్తున్నట్టు? రాజావారికి అర్థంగావటం లేదు. ఆయన సంజూ రాకకోసం ఎదురుచూస్తున్నారు. ఎందుకంటే స్వామి సత్యానంద తన శిష్యులతో ప్రయాణ సన్నాహంలో ఉన్నారు.

## ఎన్నెన్ని ప్రపోజల్స్

'దేశముదురు' పిల్ల హన్సిక సినిమాల్లో మహా బాగా పండిపోయి, ఇప్పుడు పెళ్ళి ప్రతిపాదనల నడుమ ఇరుక్కుపోతున్నది.

తమిళనాట దూసుకుపోయిన హన్సిక తెలుగులో సినిమాలు తగ్గించేసింది. 'గౌతమ్‌నందా' ఇటీవలి కాలంలో చేసిన ఏకైక సినిమా. పెళ్ళి ప్రపోజల్స్ అడపా తడపా వస్తూనేవున్నాయికాని ఈమధ్య సాధిక్ అనే ఓ వ్యక్తి ఏకంగా ఆమెను ప్రేమిస్తున్నానని, పెళ్ళి చేసుకుంటానని ప్రతిపాదిస్తూ సోషల్ మీడియాలో ఓ వీడియో విడుదల చేశాడు. హన్సిక రియాక్షన్ ఎలా ఉంటుందంటారు?



వచ్చిన పనిముగిసింది. రాత్రి పూజలో ఉంచిన స్ఫటికమాలను యువరాణివారికి స్వయంగా అంద జేసి భువనేశ్వర్‌కి వెళ్ళాల్సివుంది. అక్కడ రెండురోజు లుండి ఆయన పలని వెళ్ళిపోతారు.

స్వయంగా ఇవ్వాల్సి ఉందిగాబట్టి "యువరాణిని త్వరగా పిలవండి. మేం బయలుదేరాలి..." అంటూ హెచ్చరిస్తున్నారాయన. నిజానికి కార్తికేయనుగురించి గాని, సంజనా రాత్రి అతడివద్దకు వెళ్ళిపోయిన విష యంగాని సత్యానంద స్వామీజీకి తెలీదు.

ఆమె ఇంకా తన అంతఃపుర మందిరంలోనే ఉందను కుంటున్నాడు. సంజనా, కార్తికేయలకు తొలి సమా గమం రాత్రి. శోభన రాత్రి. అదీ సంజనా పట్టుదల మూలంగా జరిగింది. రాత్రి తొమ్మిదిగంటలకు చక్కగా స్నానంచేసి నైటీ ధరించి ముస్తాబై కార్తికేయ గదిలోకి వచ్చేసింది. ఇక తిరిగి వెనక్కివెళ్ళలేదు.

తన పట్టుదల వీడలేదు. ఒక నిర్ణయానికి రానే కూడదు. వస్తే వెనక్కి తగ్గే అలవాటు రాకుమారికి లేదు. ఆమె భయాలు ఆమెకున్నాయి. కార్తికేయతో ఏ సుఖం పంచుకోకుండానే ప్రాణాలు పోతాయేమోనన్న బాధ సంజనాను కుదురుగా ఉంచటం లేదు. ఆ భయాలే ఆమెను కట్టుబాట్లు తెంచు కునేలా చేస్తున్నాయి.



ఏకశయ్య తప్పదంటూ మొండిపట్టు పట్టింది.

కార్తికేయ గొప్ప సైంటిస్ట్ కావచ్చును. గొప్ప మానవతా వాది కూడా. ఆచారాలు, కట్టుబాట్లు, పద్ధతులపట్ల విశ్వాసంగల అసాధారణ యువకుడు. అందుకే నచ్చ చెప్పి వెనక్కిపంపించాలని చూశాడేగాని తొందరపడ లేదు. ఎంతకీ కార్తికేయ దరికి రాకపోవడంతో కోపం వచ్చి మీదపడి చిలిపిగా బుగ్గకొరికేసింది.

అలా చిలిపిగా మొదలయిన అల్లరి నిప్పురవ్వ రాజుకుని పెనుమంటగా మారినట్టు ఇద్దరినీ యవ్వన క్రీడకు ఉసిగొలిపింది.

సంజనా ఒంటినుంచి వీస్తున్న సుగంధాలు కార్తి కేయను మత్తులో ముంచేశాయి. దాంతో అతడిబింకం సడలిపోయింది. కోవెల శిల్పంవంటి ఆమె పరువాలు, సౌందర్యాలు కార్తికేయను కవ్వించి కసిరేశాయి.

మహా సౌందర్యవతియైన రాకుమారి మేఘనా సౌందర్యానందసహనాదేవి ఆశకు కార్తికేయ దాసోహ మనక తప్పలేదు. అతడు నవమన్మథుడు, ఆమె రతీదేవి. రాత్రంతా కత్తుల్లేని కమ్మని యుద్ధాలు చేసి తమ వలపు పండించుకున్నారు.

యవ్వన మాధుర్యాన్ని ఆస్వాదించారు. ఆనంద పారవశ్యంలో అలసిసొలసిన ఇరువురూ కోడి కూయక ముందే ఎప్పుడో గాఢనిద్రావశులయ్యారు.

మరునాడు ఉదయం ముందుగా సంజనా నిద్ర లేచింది. అప్పటికే తొమ్మిది గంటలు దాటింది సమయం. కార్తికేయ ఇంకా గాఢ నిద్రలో ఉన్నాడు. తన వలపు చెలికాడిని ప్రేమ మీరా జుత్తు నిమిరి ముద్దాడింది.

నైటీ వేసుకుని తన గదిలోకి వచ్చే సింది. తలారా స్నానం చేసి రెడీ అయి

**పార్టీలకు పెద్ద మొత్తం విరాళాలు వస్తున్నాయి... ఎవరు ఇస్తున్నారో, ఎంత ఇస్తున్నారో ఇప్పటివరకు తెలియదు. -అరుణ్‌జైట్లీ, కేంద్రమంత్రి**

బయటికొచ్చేసరికి పదిగంటలు దాటింది సమయం. కార్తికేయ ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు.

అంతలో ప్యాలెస్ నుంచి ఫోను.

తండ్రి విష్ణుచంద్ర గజపతి మహదేవ్ లైన్‌లో ఉన్నారు. ఆయన చెప్పింది వినగానే- "లేదు నాన్నగారు. ఆలస్యం లేదు. ఇప్పుడే బయలుదేరివస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది.

వెంటనే జయమ్మను పిలిచి "కార్తీ నిద్రపోతున్నాడు లేపకు. నేను ప్యాలెస్‌కు వెళుతున్నాను. లేవగానే చెప్పు. వీలయితే ప్యాలెస్‌కు రమ్మన్నానని నా మాటగా చెప్పు..." అని చెప్పి వెంటనే ప్యాలెస్‌కు బయలుదేరింది సంజనా. ఇప్పుడామె చాలా హ్యాపీగా ఉంది. ముఖంలో ఎప్పటి కళ తేజస్సు వచ్చేశాయి.

అయితే పనిమనిషి జయమ్మకు మాత్రం ఒక విషయం అర్థంగాక అలా చూస్తూవుండిపోయింది. ఎందుకంటే తెల్లవారి ఇంత ఆలస్యంగా లేవటం ఇదే మొదటిసారి.

ఇంతకుముందు ఇలా జరిగినది లేదు. ఏమయివుంటుందా అని ఆలోచిస్తోంది. ఏదో అర్థమై పెదవుల మీద నవ్వులు పూశాయి. రాత్రివేళ తన భర్తతో అవుటవుస్‌లోకి వెళ్ళిపోతుందిగాబట్టి రాత్రంతా వాళ్ళిద్దరూ ఒకే గదిలో వున్న సంగతి ఆమెకు తెలీదు.

సంజనా ప్యాలెస్‌కు చేరుకుంది. అప్పటికే ప్రయాణమై శిష్యులతోసహా దర్బారుహాల్లో రాకుమారి రాకకోసం ఎదురుచూస్తున్నారు స్వామి సత్యానంద. రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌తో బాటు రాజగురువు కృష్ణశాస్త్రి.

బావమరిది సూర్యప్రకాశవర్మ అంతా అక్కడే ఉన్నారు. "క్షమించండి స్వామీ. నారాక ఒకింత ఆలస్యమైనది. నన్నాశీర్వదించండి" అంటూ వస్తూనే స్వామీజీకి పాదాభివందనం చేసింది యువరాణి.

"దీర్ఘాయుష్మాన్‌భవ. లే తల్లీ" అంటూ రాకుమారిని ఆశీర్వదించి లేపాడు స్వామి సత్యానంద.

ఒక తెల్లటి ముఖమల్ వస్త్రభాగాన్ని విప్పుతూ "చాలా సంతోషంగా ఉన్నావు. నిన్న పోగొట్టుకున్న తులసిమాల బెంగ తొలగినట్టేగదా" అనడిగాడు.

"అవును స్వామీ" అంది ముక్తసరిగా.

వస్త్రభాగం విప్పి అందులోంచి ఒక స్ఫటికమాలను తీసి రాకుమారి చేతికిచ్చాడు స్వామీజీ. "ఇక ఏ బెంగా నీ దరిచేరదు రాకుమారి.రాత్రి అంతా పూజలో ఉంచి తీసిన మేలిమి స్ఫటికమాల ఇది. ఆ వడివేలు కుమారస్వామి ఆశీస్సులతో చాలా శక్తివంతమయిన మాల. దీన్ని సదా ధరించు.ఏ అరిష్టాలుగాని, ప్రాణగండాలుగాని నీ దరి చేరవు.

నీకేదన్నా అపాయం సంభవించనుందంటే దానికి సూచనగా ఈ స్ఫటికమాల పూసలు ఎర్రగా సింధూరంలా మారిపోతాయి. అప్పుడు తగుజాగ్రత్త వహించి అపాయాన్ని తప్పించుకోవచ్చు"అంటూ వివరించాడు. అందరి ఎదురుగానే ఆ స్ఫటికమాలను కళ్ళకద్దుకొని మెడలో ధరించింది సంజనా.

"నాదో మనవి స్వామీ... ఇక మా ప్రియపుత్రిక కోసం మేము వరాన్వేషణ జరుపవచ్చునా?" అని అడిగారు రాజావారు.

"ఏదో చెప్పాలని మర్చిపోయాను. ఏమిటా అనుకుంటున్నాను. బాగా గుర్తుచేశారు రాజావారు.అమ్మాయికి ఇరవై నాలుగు సంవత్సరాలు పూర్తయ్యేలోపలే వివాహం జరిపించటం చాలా ముఖ్యం.

ఈ విషయంలో కృష్ణశాస్త్రిగారితో నేనూ ఏకీభవిస్తున్నాను. వరుని జాతకంపంపిస్తే నేనూ పరిశీలించి చెపుతాను. ఈ పనులు త్వరగా జరగాలి. ఇక మేం బయలుదేరతాం" అంటూ శిష్యులకి సైగ చేశాడు స్వామి సత్యానంద.

కారువరకు వచ్చి ఆయన్ని సాగనంపారంతా. ఆ కారు గేటు దాటగానే కృష్ణశాస్త్రిగారు "రండి... కాసేపు అంతరంగిక మందిరములో కూర్చుందాం... మీతో మాట్లాడాలి..." అంటూ అటుగా దారి తీశారు రాజావారు. సంజనా అంతఃపురానికి వెళ్ళిపోయింది.



**సీమాంతర ఉగ్రవాదం, సరిహద్దు కాల్పులకు స్వస్తి పలికేవరకు పాకిస్తాన్‌తో క్రికెట్ పోటీలు వుండవు.** -సుష్మాస్వరాజ్, కేంద్రమంత్రి

కార్తికేయకు మెలకూ వచ్చేసరికి ఉదయం పదకొండు గంటలు దాటింది సమయం. చూస్తే పక్కన సంజనా లేదు.రాత్రి జరిగింది గుర్తొచ్చి తనువు,మనసు పులకిస్తున్నాయి. తొలి సమాగమంలోని మధురజ్ఞాపకాలు బతికినంతకాలం గుర్తుండే తీపి ఖజానాలు.

సంజనా ముందుగానే లేచి తన గదిలోకి వెళ్ళిపోయుంటుందనుకున్నాడు. తను కూడా లేచి బ్రష్ చేసుకుని స్నానాదికాలు ముగించి రెడీ అయి హాల్లోకి వచ్చాడు. సంజనా కూడా లేదు.

జయమ్మ కాఫీకప్పు అందిస్తూ సంజనా పది గంటల ప్రాంతంలో ప్యాలెస్‌కు వెళ్ళిన విషయం చెప్పింది. కాఫీ సిప్‌చేస్తూ కాసేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు కార్తికేయ. సంజనా ప్యాలెస్‌కు పిలిచిందని కాదుగాని వెళ్ళకతప్పదు. వెళ్ళకపోతే తను ఇంకా అలిగి కూర్చున్నట్టు ఫీలవుతారాయన.

అదీగాక తన ప్రాజెక్ట్ విషయంగా రాజావారితో కలిసి ఢిల్లీ వెళ్ళాల్సిన పనివుంది. ఎప్పటికి వీలవుతుందో తెలుసుకోవాలి.

"టిఫిన్‌రెడీగా ఉంది. బాబుగారూ తినివెళ్ళండి" కార్తికేయ బైక్ కీస్ తీసుకుని బయలుదేరటం చూసి గుర్తుచేసింది జయమ్మ.

"ఇప్పుడు వద్దులే" అంటూ బయటికొచ్చి బైక్ మీద ప్యాలెస్‌కు బయల్దేరాడు కార్తికేయ.

అది రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ మహారాజా పర్లాకిమిడివారు సాధారణ విజిటర్స్‌ను కలిసేందుకు ఉపయోగించే విశాలమయిన హాలు. ఇది ప్యాలెస్‌లో ఒక పెడగా గార్డెన్‌ను ఆనుకొని ఉంది.

ఇక్కడ సౌండ్‌ప్రూఫ్ లేదు. ఎ.సి లేదు. రెండు సీలింగ్ ఫ్యాన్లుమాత్రం నిర్విరామంగా తిరుగుతూ హాలును చల్లబరుస్తున్నాయి. గార్డెన్‌వైపు అద్దాలకిటికీలున్నాయి. ప్రస్తుతం అవి మూసివున్నాయి.

కిటికీలు తెరిస్తేగాని గార్డెన్ కన్పించదు. రాజావారితోబాటు కృష్ణశాస్త్రిగారు ఇరువురూ ఏకాంతంగా అక్కడ సోఫాల్లో ఆసీనులయివున్నారు.

**ఇంకా ఉంది**

## సీరియస్‌గా తీసుకోను



ఇతర తారలతో పోల్చిచూడడాన్ని తాను అస్సలు సీరియస్‌గా తీసుకోనని చెప్తోంది జాక్వెలిన్ ఫెర్నాండెజ్. 'రేస్ 2'లో దీపికాపడుకొనెతో కలిసి నటించిన జాక్వెలిన్ 'రేస్ 3'కి రెడీ అవుతోంది.

"పాత్ర పోషిస్తున్నప్పుడు ఏ నటీనటులు అయినా తమ స్వంత ప్రతిభ చూపుతారు.నేను పోలికలను పట్టించుకోను. ఎవరి నటన వారిదే.

సల్మాన్‌ఖాన్, అనిల్‌కపూర్‌లతో కలిసి 'రేస్ 3' సినిమాలో పనిచేయడం అద్భుతంగా ఉంది.

'రేస్ 3' గురించి మేమంతా ఎగ్జయిట్ అవుతూ సినిమా పూర్తిచేయడానికి, డబ్బింగ్‌కు చాలా హార్డ్ వర్క్ చేశాం" అంటూ ఉత్సాహంగా చెప్పింది.

# మినపరొట్టెలు

ఒక ఊరిలో చాలా బీద బ్రాహ్మడుండేవాడు. యాయవారం చేసుకుని బతికేవాడు.

ఆ బ్రాహ్మడికీ, ఆయన భార్యకీ ఒకరోజు మినపరొట్టె తినాలని మోజు పుట్టింది. ఈ మోజు తీరే ఉపాయం లేదు.

అందుచేత బ్రాహ్మడు భగవంతుణ్ణి గురించి తపస్సు చేశాడు. భగవంతుడు ప్రత్యక్షమై 'ఏం వరం కావాలో కోరుకో' అన్నాడు.

"ప్రభూ, నాకు మినపరొట్టె తినాలని చాలా భ్రమగా ఉంది. కావలసినన్ని మినపరొట్టెలు దొరికే వరం ఇప్పించు" అన్నాడు బ్రాహ్మడు.



"ఒక మినపగింజ సంపాదిస్తివా, నీకు కావలసినన్ని మినపరొట్టెలు దొరుకుతాయి" అని భగవంతుడు మాయమైనాడు.

దేవుడు చెప్పిన ప్రకారం బ్రాహ్మడు దుకాణానికి వెళ్ళి ఒక్క మినపగింజ ముష్టి ఎత్తాడు. ఆ గింజ పట్టుకుని ఇంటికి సాగాడు బ్రాహ్మడు.

ఒక్క అడుగు వేసేసరికి చేతిలో వున్న ఒక మినప గింజ రెండయ్యాయి. మరో అడుక్కి నాలుగయాయి.

బ్రాహ్మడు ఇంటికి వచ్చేసరికి భుజం మీద బస్తా మినుములున్నాయి.

ఇంట్లోకి వెళ్ళి బ్రాహ్మడు భుజంమీది మినుములబస్తా కింద దించేసరికి భుజం మీద ఇంకో బస్తా వుంది.

అది దించితే మరొకటి. ఎన్ని దించినా బ్రాహ్మడి భుజంమీద మినుముల బస్తా ఉండనే ఉంది. బరువుకు తాళలేక బ్రాహ్మడు గోడకిచేరగిల బడిపోయాడు. ఇంతలో భార్యవచ్చి బ్రాహ్మడు దింపిన బస్తాలలో ఒకటివిప్పి కొన్ని మినుములు తీసి తిరగట్లోవేసి విసరసాగింది.

మినుములన్నీ పప్పు అయాక చూస్తే మళ్ళీ తిరగట్లో ఇన్ని మినుములు ఉండనే ఉన్నాయి. ఎన్నిసార్లు విసిరినా తిరగట్లో మొదటపోసినన్ని మినుములూ ఉండనే ఉన్నాయి.

ఇదేం ఖర్మమని తిరగలి వదిలేసి బ్రాహ్మడి భార్య విసిరిన పప్పు పట్టుకెళ్ళి రోట్లో రుబ్బసాగింది. రుబ్బు తీసి చూస్తే రోట్లో ఇంకో రుబ్బు ఉంది. అది తీస్తే మరొక రుబ్బున్నది.




ఆవిడకి విసుగెత్తి రుబ్బిన పిండి పట్టుకెళ్ళి వంటింట్లో పొయ్యిమీద పెనం పెట్టి పెనంమీద అట్టు వేసింది రొట్టె కాలింది. దాన్ని తీసి పళ్ళెంలో వేసిచూస్తే పెనంమీద ఇంకో రొట్టె ఉంది.

అది కూడా తీస్తే మరో రొట్టె. ఎన్ని రొట్టెలు తీసినా పెనంమీద మరో రొట్టె ఉండనే ఉంది.

పెనంమీద రొట్టె అలాగే ఉంది. రోట్లో రుబ్బు అలాగే ఉంది. తిరగట్లో మినుములలాగే ఉన్నాయి. బ్రాహ్మడి భుజం మీద మినుముల బస్తా అలాగే ఉంది.

ఇంతలో పొరుగింటి ముసలమ్మ నిప్పుకోసం వచ్చింది. ఇంటినిండా మినుముల బస్తాలు చూసింది. వంటింట్లోపొయ్యిమీది పెనంలో రొట్టెచూసింది.

ఉప్పు సరిపోయిందో లేదో చూద్దామని ఒక్క ముక్క తుంచి నోట్లో వేసుకుంది. నమిలింది. మింగింది. మళ్ళీ నోట్లో ముక్క అలాగే ఉంది. మళ్ళీ నమిలి మింగింది.

ఇంకా నోట్లో ముక్క అలాగే ఉంది. నమిలి నమిలి నోరు నొచ్చిందేగాని, మింగీ మింగీ పొట్ట ఉబ్బిందేగాని నోట్లో ముక్కమాత్రం అయిపోలేదు. నమలకుండా, మింగకుండా ఊసినా ముక్క నోట్లో అలాగే ఉంది.

ముసలమ్మ కూడా ఆయాసంతో గోడకి చేరగిలబడి, "నిప్పుకోసం వచ్చిన దానికి ఇదేం పాపకర్మం చుట్టుకుందిరా, బాబూ! నీ మినపరొట్టె నిప్పచ్చరంగాను" అని బ్రాహ్మణ్ణి తిట్టింది.



సేకరణ : చందమామ రావే

"రోలుపోయి మద్దెలతో మొరపెట్టుకున్నట్టుంది. భుజంమీద చచ్చేటంత బరువు పెట్టుకుని దించలేక నేనేడుస్తున్నాను, చాలురా భగవంతుడా మినపరొట్టెల మోజు" అని బ్రాహ్మడేడిచాడు.

వెంటనే అంతా మాయమైపోయింది. బ్రాహ్మడి భుజంమీద మినుముల బస్తా లేదు. తిరగట్లో మినుముల్లేవు.

రోట్లో రుబ్బులేదు. పెనంమీద రొట్టె లేదు. ముసలమ్మనోట్లో ముక్కలేదు. బ్రాహ్మడు తెచ్చిన మినపగింజమాత్రం మిగిలింది.

"అగ్గిలేదు, బుగ్గిలేదు" అంటూ ముసలమ్మ మూల్గుతూ వెళ్ళిపోయింది.

వీరిన అప్పలరాజు



# సూపర్ సూప్స్

పోషకాలు, ఫ్లేవర్లతో స్వంతంగా తయారుచేసుకునే పానీయాలు ఆరోగ్యంపై మ్యాజిక్ సృష్టించగలవంటే ఎటువంటి అతిశయోక్తికాదు. అటువంటి మ్యాజిక్ లిక్విడ్‌ని 'సూప్' అనడంలో ఎటువంటి సందేహమూ లేదు. సూప్స్‌లో లెక్కలేనన్ని వెరైటీలు ఉంటాయి. దక్షిణాదివారి రసం కూడా ఒక సూప్ కిందే వస్తుంది.

ఇది సైనస్‌లను, జీర్ణవ్యవస్థను ఎంతలా క్లెన్స్ చేస్తుందో చెప్పనవసరంలేదు. రోజుకో బౌల్ రసం తాగుతుంటే వైద్యుని దగ్గరకు వెళ్ళాల్సిన అవసరం తగ్గుతుంది. సూప్‌లు తాగడానికి శీతాకాలం గొప్ప సమయం. ఇవి రుచికరం, ఆరోగ్యదాయకం కూడా.

అయితే ఈ సీజన్‌లో ఏ రకం సూప్ తాగుతున్నామనేది కూడా ముఖ్యం. కూరగాయల్లో విశేషమైన పోషకాలుంటాయి కాబట్టి, వాటితో తయారైన సూప్‌లు ఎంతో ప్రయోజనకరమైనవి.

ఓ బౌల్ వేడివేడి కూరగాయల సూప్ పీచుకు అత్యుత్తమ ఆధారం. జీర్ణవ్యవస్థను క్రమబద్ధీకరించి, డైజెస్టివ్ ట్రాక్ట్‌ను ఆరోగ్యవంతంగా మెయిన్‌టెయిన్ చేయడంలో ఉపకరిస్తాయి. మూసుకుపోయిన ఆర్టరీలకు సూప్‌లు సహజ క్లెన్సర్లుగా పనిచేస్తాయి.

రుచి, ఫ్లేవర్లతో రాజీపడకుండా అనేక కూరగాయలతో తయారైన సూప్‌లు తాగడంవల్ల త్వరితంగా, సులువుగా పోషకాలు దక్కుతాయి.

వీటిలో యాంటీ ఆక్సిడెంట్స్ వుంటాయి కాబట్టి వెజిటబుల్ సూప్స్‌ను దైనందిన ఆహారంలో భాగం చేసుకోవచ్చు. ఈ యాంటీ ఆక్సిడెంట్లు సూప్‌కు మంచి రంగును ఇవ్వడమే కాకుండా కాలుష్యం, ఒత్తిడి, అనారోగ్యకరమైన ఆహారం తాలూకు అనారోగ్య ప్రభావాలను తగ్గిస్తాయి.

కణాలు, ఆర్టరీలు, ఊపిరితిత్తులు, ఇతర శారీరక భాగాలను లోతుగా క్లెన్స్‌చేస్తాయి.

రోజుకు ఒకటి, రెండు బౌల్స్ ఆరోగ్యకరమైన సూప్స్ తాగడంద్వారా అదనపు కిలోల బరువునూ వదిలించుకోవచ్చు. ఉల్లి, వెల్లుల్లి, క్యారెట్, గుమ్మడి, టొమేటోవంటి కూరగాయలు క్యాన్సర్‌తో పోరాడగల గొప్ప ఆయుధాలవంటివి.

ఈ కూరగాయల్లో లికొపెనె, బెటా-కెరొటిన్, విటమిన్ 'ఇ' పుష్కలంగా లభిస్తాయి.

క్యాన్సర్ నిరోధానికి ఇవి సహజ పనిముట్లుగా పనిచేస్తాయి. వివిధ పదార్థాలతో తయారయ్యే సూప్‌లు పోషకభరితమైన ఆహారంగా పనిజేస్తాయి. కొద్దిపాటి కార్బోహైడ్రేట్స్, ఫ్యాట్స్, ప్రోటీన్లను కూరగాయలకు జతచేస్తే చాలు. కావాల్సినన్ని స్పైస్‌లు కూడా జత చేసుకోవచ్చు.

బఠాణీలు, బీన్స్, శనగలు, పెసరపప్పు, కందిపప్పు, మరింకేవో పప్పులు, ఛీజ్, పనీర్, టోఫు, పెరుగు,

చివరకు రైస్‌కూడా జతచేసుకునే సౌలభ్యంఉంటుంది. ఇలా కలుపుకోవడంవల్ల సింపుల్ సూప్‌ను సంపూర్ణ ఆహారంగా మార్చుకోవచ్చు.

బంగాళాదుంప, చిలకడదుంప, పూర్తిస్థాయి ధాన్యపు బ్రెడ్, మొక్కజొన్న లేదా తాజాగా తయారైన పాస్తాలతో కార్బోహైడ్రేట్స్ జతచేసుకోవచ్చు. ఇటువంటి సూప్‌లు ఆరోగ్యంగా, రుచిగా ఉండడమే కాకుండా, తిన్న ఆహారాన్ని సులువుగా జీర్ణంఅయ్యేలా సహకరిస్తాయి.

కొబ్బరితురుము, బాదంపొడి, పిస్తా, జీడిపప్పు, గింజలు, నెయ్యి లేదా ఎక్స్‌ట్రా వర్జిన్ ఆలివ్ ఆయిల్ వంటివి కలిపితే సూప్ మరింతగా చిక్కబడుతుంది, శరీరానికి కావాల్సిన ఫ్యాట్స్ అందుతాయి.

ఫ్యాట్స్ సూప్‌లకు క్రీమీ, నట్టి టెక్చర్ ఇస్తాయి. ఎప్పుడూ రొటీన్‌గా తీసుకునే టొమేటో, మిక్స్‌డ్ వెజిటబుల్, కార్న్ సూప్‌లే కాకుండా మరిన్ని వెరైటీలు వెతుక్కోవాలి. కొన్ని రకాల సూప్‌లకు కొన్ని కాంబినేషన్లు ఎంతో బావుంటాయి.

సొరకాయ సూప్, పాలకూర సూప్‌లకు కొబ్బరి కలిపితే చాలా బావుంటాయి. సూప్‌లు చిక్కబడేందుకు ఏనాటినుంచో వాడే పిండి, క్రీమ్‌ల స్థానే నట్స్ కలిపితే మరింత రుచిగా వుంటాయి.

సూప్‌లు తియ్యగా, స్పైసీగా, క్రీమీగా, వగరు, పులుపులతో ఎలా అయినా ఉండవచ్చు. ఏది కావాలనుకుంటే దాన్ని ఎంచుకోవచ్చు. అల్లం, పసుపు, దాల్చినచెక్క, పచ్చిమిరప లేదా మిరియాలు సూప్‌లను స్పైసీగా మార్చుతాయి.

తాజా లేదా ఎండు ఔషధాలు సూప్‌ఫ్లేవర్‌ను మార్చేస్తాయి. కరివేపాకు, తులసి, అరెగానొ, కొత్తిమీర, పార్స్లె, లెమన్‌గ్రాస్ వంటివి పోషకాలకు పవర్ హౌస్.

ఈ భిన్న ఆకుల్లో పెద్ద పోషకాలుంటాయి. శారీరక ఉష్ణోగ్రత తగ్గిపోయినప్పుడు, ఇవి కావాల్సిన వెచ్చదనాన్ని ఇస్తాయి. సూప్‌లు తాగే అలవాటువుంటే పూర్తి భారతీయ దినుసులు పెట్టె అందుబాటులో వుండి సంపూర్ణ ఆరోగ్యానికి బాట పరిచినట్లే కాగలదు. రోగనిరోధకశక్తిని పెంచి అన్ని విధాలా ఆరోగ్యాన్నిస్తాయి.


Courtesy : LIFE POSITIVE

## సొరకాయ సూప్

**కావాల్సిన పదార్థాలు :** రెండు వందల యాభై గ్రాములు సొరకాయ, చిటికెడు దాల్చినచెక్క, ఒక టీస్పూన్ ఆవు నెయ్యి, రెండు టేబుల్ స్పూన్లు కొబ్బరితురుము, రుచికి ఉప్పు, నిమ్మరసం.

**తయారుచేసే విధానం :** సొరకాయ చిన్నచిన్న ముక్కలుగా కోసి, నేతిలో వేయించాలి. కొబ్బరి తురుము కలిపి, బ్లెండ్ చేయాలి.

దాల్చినచెక్క, ఉప్పు కలిపి, నిమ్మరసం పిండి సర్వ్ చేయాలి.



## అల్లం, క్యారెట్ సూప్

**కావాల్సిన పదార్థాలు :** 300 గ్రాములు ఎర్ర క్యారెట్, నాలుగుకప్పులు నీళ్ళు, ఒక టేబుల్ స్పూన్ ఆవు నెయ్యి, ఒకటిన్నర కప్పులు ఉల్లిపాయ ముక్కలు, సన్నగా తరిగిన రెండు వాల్‌నట్ ముక్కలు, రెండు వెల్లుల్లి రెబ్బల ముక్కలు, ఒకటిన్నర టీస్పూన్లు ఉప్పు, పావుటీస్పూన్‌చొప్పున జీలకర్ర, వాము,దాల్చినచెక్క,మూడు, నాలుగు స్పూన్లు నిమ్మరసం.

**తయారుచేసే విధానం:** క్యారెట్లుచెక్కు తీసి అంగుళం చొప్పున సన్నగా ముక్కలు కోసుకోవాలి. మూకుడులో నెయ్యి వేడిచేసి, క్యారెట్, ఉల్లిపాయ ముక్కలు, వెల్లుల్లి, అల్లంముక్కలు వేయించాలి. క్యారెట్‌ముక్కల ఆకృతిని బట్టి, అవి మెత్తగా ఉడికేదాకా సుమారు 10-15 నిమిషాలు ఉడికిస్తే సరిపోతుంది.తరిగిన వాల్‌నట్, ఉప్పు,మిగతా స్పైస్‌లు వేసి సెగ తగ్గించాలి.

మరో పదినిమిషాలుంచి, చల్లారాక నిమ్మరసంకలిపి, బ్లెండ్‌చేయాలి.దీనిని పాత్రలోకి మార్చి, అవసరమైతే నీరు కలిపి కొద్దిగావేడిచేసి సర్వ్‌చేయాలి.

ఎ.సువర్చల

# పునర్జన్మ

## సూర్యప్రసాద రావు

"ఏమండోయ్! రండి! రండి! మనకిష్టమైన యాంకర్ మరో వార్తాచిత్రాన్ని చూపించబోతోంది!" డ్రాయింగ్ రూమ్‌లో పేపర్ చూస్తున్న నన్ను శ్రీమతి హడావుడి చేసేసింది.

"అబ్బ ఏమిటోయ్... నీ హడావుడి! టీవీ వాళ్ళ కంటే నీకే ఎక్కువ హడావుడిగా ఉందే!" విసుక్కుంటూనే టీవీముందు హాల్లో సోఫాలో సెటిలయ్యాను.

టీవీ యాంకర్ గవర్నమెంట్ హాస్పిటల్ కారిడార్లో ఉన్న సిస్టర్స్‌ను అడుగుతోంది.

"వస్తున్న డాక్టర్... మీ అమ్మాయా?"

"అవునండీ! మా అమ్మాయే! ఇక్కడే పుట్టింది! ఇక్కడే పెరిగింది! దినదిన ప్రవర్థమానంగా చల్లని వెన్నెల కాసే చందమామలా పెరిగింది. మా సహాయ సహకారాలతోనే చదువుకుంది. అందుకే మా అమ్మాయి అయింది. నేడు డాక్టరమ్మాయి అయింది!" హెడ్ సిస్టర్ సంతోషంగా అంది. "ముచ్చటపడి మూడు నెలలకు ముందే పుట్టిన పాపట.. నిజమేనా!"

"ఆరు నెలలు నిండకుండానే ముందుగా మా హాస్పిటల్‌ని పావనం చేసింది. సాధారణంగా తొమ్మిది నెలలు గర్భంలో ఉండి పూర్తి స్థాయిలో పెరిగి శిశువు ఈ లోకంలోకొస్తుంది.

ఆ బేబీ సంపూర్ణ శిశువు అవుతుంది. కానీ ఈ పాప ఆరు నెలలు నిండకుండానే తల్లి గర్భంలోంచి బయటకు వచ్చేసింది. అలా పుట్టిన బిడ్డ బ్రతుకుతుందని నమ్మకం లేని తల్లి పాపను వదిలి పారిపోయింది! మా డాక్టర్లు, మేమంతా పాపను బ్రతికించాలని భగీరథ ప్రయత్నం చేశాం! పాపను బ్రతికించాం! పెంచుకున్నాం, పెద్దచేశాం.

సంపూర్ణ ఆరోగ్యవంతురాలిగానే కాక... అద్భుతమైన ప్రతిభావంతురాలిగా తయారుచేశాం. ఆ పాప చేత వైద్యరంగంలో ఓ సాహసోపేతమైన అద్భుతాన్ని సృష్టించాం!"

"డాక్టరమ్మాయి రావడానికి ఇంకా చాలా సమయముందనిపిస్తోంది. ఈలోపు ఆ ప్రీమెచూర్ బేబీని ఎలా పెంచారో అప్పటి డాక్టర్‌లను, ఇప్పటి సీనియర్ వైద్యులను అడిగి తెలుసుకుందామా!"

నాటకీయంగా నాడు వైద్యులంతా సమావేశమైన హాస్పిటల్ మెడికల్ సూపరింటెండెంట్ ఛాంబర్‌లోకి టీవీ కెమేరాతో ప్రవేశించింది!

"డాక్టర్లందరూ నమస్కారాలండీ! ఈరోజు రాష్ట్ర వ్యాప్తంగా తెలుగు ప్రజలు గర్వపడేలా అద్భుతమైన వైద్య విజ్ఞాన మెడికల్ మిరకిల్ సాధించిన మిమ్మల్నందరినీ మా టీవీ ఛానెల్ హృదయపూర్వకంగా అభినందిస్తోంది.

మా టీవీ ప్రేక్షకుల తరఫున కూడా అభినందనలు స్వీకరించండి! నాటి ఆరునెలల అసంపూర్ణ శిశువు నేటి డాక్టర్ సునందగా ఏ విధంగా అద్భుతమైన శిశువుగా తీర్చిదిద్దగలిగారో వివరిస్తారా... డాక్టర్!"

అందరిలోకీ అత్యధిక సీనియారిటీ గల 'గ్రే హెయిర్ యంగ్ డాక్టర్... నేటి మెడికల్ సూపరింటెండెంట్ మొదట వివరించడం ప్రారంభించారు.

"ఇది నా ఒక్కడి విజయం కాదమ్మా! మా టీమ్ ఆఫ్ డాక్టర్స్ సాధించిన ఘన విజయం! మా అందరి సమిష్టి కృషి ఫలితంగానే నాటి పాప నేటి డాక్టర్ సునందగా రూపాంతరం చెందింది! సాధారణంగా ప్రీమెచ్యూర్ బేబీస్ బ్రతకడం చాలా కష్టం.

క్షణమాగి మళ్ళీ వివరించడం ప్రారంభించారు.

"ఇలా నెలలు తక్కువగా పుట్టిన పిల్లలు ఆహారం తీసుకోవడం అతి కష్టమైన పని! పైగా ఫార్ములా పాలు వాళ్ళకు సరిపడవు.

మా మెటర్నరీ వార్డులో ఉన్న అనేకమంది బాలింతల నుండి చనుబాలను సేకరించే వాళ్ళం! వాళ్ళు బిడ్డలకు పాలు పట్టిన తరువాత మిగిలిన పాలను ఉగ్గుపాలగా పాపకు అందించే వాళ్ళం! అసలు పాలు త్రాగడమే తెలియని దశ నుండి తనకు తానుగా పాలు త్రాగగలిగే దశ వరకు పట్టుకు వెళ్ళాం! ఎందరో తల్లులు ఆ పాప పెరుగుదలకు అవసరమైన పాలిచ్చి ఆ పాపకు ప్రాణదానంచేశారు.

పాలు పట్టడం కష్టమనిపించిన దశలో ఆమైనో ఆమ్లాలు, లైపిడ్‌లు ద్రవరూపంలో పాపకు పట్టేవాళ్ళం! శ్వాసకు ఇబ్బంది తలెత్తకుండా మిగిలిన చుక్కల మందులిచ్చేవాళ్ళం!" ఆయన వివరించిన తరువాత మరో డాక్టర్ మైక్ అందుకున్నారు.

"నాలుగైదు రోజుల తరువాత పాప బ్రతుకుతుందని తెలిసి పాప తల్లి తిరిగి రావడంతో మా ప్రయత్నాలు కొంత సులువయ్యాయి. ఆమె పిల్లకు పాలు పట్టేది. మొదట కేవలం ఐదు మిల్లీలీటర్ల పాలు మాత్రమే త్రాగగలిగేది. క్రమంగా ఆ స్థాయి ఇరవై మిల్లీలీటర్లకు పెంచగలిగాము. క్రమంగా తల్లి పాలకు అలవాటు చేసి ఆమె ముర్రిపాలను సైతం పాపకు అందించగలిగాము. పెరుగుదల సజావుగా సాగేలా చూడగలిగాం!" మరో డాక్టర్ సంతోషంగా అన్నారు.

"అలా పుట్టి పెరుగుతున్న పాపలో కదలికలు ఉండేవి కావు. కదలలేని మెదలలేని పాపను అలా ఉంచేస్తే ప్రమాదమే మరి! అటువంటి పాపకు కదలికలు కలిగించగల ఓ అద్భుతమైన బెడ్‌ను తయారు చేసి పాప పెరుగుదలకు సహకరించిన మరో డాక్టర్ గారు తన విజయగాథను వివరిస్తారు!" యాంకర్ ఆ డాక్టర్‌కు మైక్ అందించింది.

"మొదట పాప అటూ ఇటూ కదిలేది కాదు. పాప కదలకపోతే శరీరంపై బెడ్ సోర్స్ అనే పుండ్లు ఏర్పడి ఇన్‌ఫెక్షన్ సోకే ప్రమాదముంది.

కదలలేని పాప కదలకుండానే పాపను కదిలించే బెడ్‌ను తయారుచేయాలని నిర్ణయించుకున్నాము. పాపకు స్పాంజ్ బాత్ చేయించినా ఇన్‌ఫెక్షన్ వచ్చే అవకాశముంది. అందుకే వాటర్‌బెడ్‌లో పడుకోబెట్టడమే ఓ ట్రీట్‌మెంట్!

ఆ సైజ్ వాటర్ బెడ్‌లు మార్కెట్‌లో దొరకవు. దొరికే బెడ్‌లో పడుకోబెడితే పాప పూర్తిగా మునిగిపోతుంది. అందుకే మేం చిత్రమైన ఈ వాటర్‌బెడ్‌ను



తయారుచేశాం!" డాక్టర్స్ వాడే గ్లౌజ్‌లతో తయారు చేసిన ఓ వాటర్ బెడ్ కెమెరా ముందుంచారు.

"ఆపరేషన్‌లలో ఉపయోగించే గ్లౌజ్‌లలో నీళ్ళు పోశాం! ఆ నీళ్ళు పోసిన గ్లౌజ్‌లన్నింటినీ కలిసి ఒక బెడ్‌లా తయారుచేశాం! గ్లౌజ్‌లలో నీళ్ళు కదులుతున్నప్పుడు పాప కదులుతుండేది! ఆ విధంగా ఇన్‌ఫెక్షన్ రాకుండా పాపను కాపాడగలిగాం" ఆయన ఆనందంగా వాటర్‌బెడ్‌ను తాకుతూ తన్మయత్వం చెందడం అబ్బురం కలిగించింది.

"పాప పెంపకంలో మరే ఇబ్బందులూ తలెత్తలేదా డాక్టర్?" యాంకర్ అడిగింది. "ఆ పాప పెరుగుదలలో అడుగడుగునా ఇబ్బందులు తలెత్తాయమ్మా!వాటిలో ఒకానొక భయంకరమైన ఇబ్బంది ఏమిటంటే... ప్రతిస్పందన లోపించడం!"

"అంటే... ఏమిటి డాక్టర్?" ఇబ్బంది వివరించమని ఆ డాక్టర్‌ను అడిగింది.

"సాధారణంగా మెచ్యూర్ బేబీ అయితే...ఆ బేబీ బాహ్యప్రపంచానికి చెందిన అన్ని స్పందనలకు అనుకూలంగాఎలా ప్రతిస్పందించాలో తల్లి గర్భంలో ఉండగానే గ్రహిస్తుంది. అంటే... వేడికి స్పందించడం, చలికి ముడుచుకుపోవడం, శబ్దాలకు ఉలిక్కిపడడం, కాంతికి అనుగుణంగా స్పందించడం!



ఇటువంటి ప్రతిస్పందనలు శిశువులు అభిమన్యుడిలా గర్భంలో ఉండగానే నేర్చుకుంటారు. నేర్చుకుని ఈ ప్రపంచమనే పద్మవ్యూహంలోకి అడుగుపెడతారు. కానీ మూడునెలలకు ముందే ఈ ప్రపంచంలోకి అడుగుపెట్టిన పాపలో ఇటువంటి ప్రతిస్పందనలేవీ కనిపించవు అంటే... జీవమున్న నిర్జీవ శిశువులా అలా పడుకుని ఉండేది...!"ఆయన విచారంగా అన్నారు.

"మరి... అప్పుడు ఏం చేశారు డాక్టర్!" యాంకర్‌గా గొంతులో ఉద్వేగం ధ్వనించింది.

"ఏమీ తెలియని అభిమన్యుడికి పద్మవ్యూహం ఎలా ఉంటుందో పరిచయం చేయాలి! చూపించాలి! ఆ అనుభూతిని కలిగించాలి! అప్పుడే పద్మవ్యూహం లాంటి ఈ ప్రపంచంలో మనగలుగుతుంది.

అన్నింటికీ ప్రతిస్పందించి రక్షణవ్యవస్థను కల్పించుకోగలుగుతుంది. జీవించగలుగుతుంది! అటువంటి పద్మవ్యూహాన్ని పాపముందు మేం సమర్థవంతంగా క్రియేట్ చేయగలిగాం!" ఆయన ముఖంలో ఆనందం తాండవించింది.

"అదెలా సాధ్యమైంది డాక్టర్...? అటువంటి అద్భుత ప్రపంచాన్ని పాపముందు ఎలా ఆవిష్కరించగలిగారు? హేట్సాఫ్ టు యు డాక్టర్...?" యాంకర్ ఆయనను అభినందించింది.

ఆయన ఓ పరికరాన్ని కెమెరా ముందుంచి వివరించసాగారు. "మెడికల్ కాన్ఫరెన్స్‌కై అమెరికా వెళ్ళినప్పుడు ఈ పరికరం లభించింది. దీనిని 'సౌండ్ స్పా ఇన్‌స్ట్రుమెంట్'అంటారు. దీనిని ఉపయోగించి పాపను ప్రతిస్పందింపచేయడాన్ని 'డెవలప్‌మెంటల్ సపోర్ట్ కేర్' అంటారు.

దీనితో రకరకాల శబ్దాలు వినిపించవచ్చు! ఈ పరికరం ద్వారా పాపకు గాలి పీల్చేటప్పుడు వచ్చే శబ్దం వినిపించాను. రాత్రిపూట ఎలాంటి శబ్దం వస్తుందో వినిపించాను. ఇప్పుడు మీకు కొన్ని శబ్దాలు వినిపిస్తాయి. ఆ శబ్దాలను బట్టి ప్రకృతి చేసే శబ్దాలేవో చెప్పడానికి ప్రయత్నించండి!"

డాక్టర్ మొదటి శబ్దం వినిపించారు. "వర్షం వస్తున్న శబ్దం ఇది!" యాంకర్ ఆశ్చర్యంగా అడిగింది.

"ఇది సెలయేళ్ళు పారుతున్న శబ్దం అండీ!" రెండవ శబ్దం విని అన్నది.

"సముద్రపు అలలు ఎగసిపడుతున్న శబ్దం మూడవది! ఉరుములు, మెరుపులు వస్తున్న శబ్దం నాల్గవది!"

అన్ని శబ్దాలకు సరియైన ప్రతిస్పందనా సమాధానాలిచ్చిన యాంకర్‌ను డాక్టర్ అభినందనపూర్వకంగా చూశారు. అన్ని శబ్దాలు వినిపించిన తరువాత క్షణకాలం నిశ్శబ్దం ఆవహించింది!

"ఈవిధంగా అన్ని శబ్దాలు వినిపించి, వినిపించి పాపకు బాహ్యప్రపంచం ఎలా ఉంటుందో పరిచయంచేశాను. తల్లి గొంతుకు అలవాటు చేశాను.

ఆమె చేత వచ్చీరాని పాటలు పాడించి ఆమె వాయిస్‌కు పాప ట్యూన్ అయేలా ప్రయత్నించాను.

ఆమెచేత చెప్పించే భాషే పాపకు మాతృభాష అవుతుంది. ఫలితంగా పాప వినికిడి శక్తి పెరిగింది. పరిసరాలను గుర్తించే పరిజ్ఞానం లభించింది.తల్లి, తండ్రి గొంతులువిని సరియైన రెస్పాన్స్ ఇవ్వసాగింది. సాధారణ జీవితం ప్రారంభించింది"డాక్టర్‌ముగించారు.

"అయితే... పాప పెరుగుదలలో అవరోధాలన్నీ తొలగిపోయాయనిపించాయా డాక్టర్!" యాంకర్ డాక్టర్లనుద్దేశించి ప్రశ్నించింది!

"ఈ సమయంలో పాప కంటి సమస్యను గుర్తించాం! పాప చూపు స్థిరంగా ఉంది. కనిపిస్తుందో... చూస్తుందో... లేదో అంతుబట్టలేదు. మా హాస్పిటల్‌లో అప్పటికి కంటి డాక్టర్ రాలేదు.

ఆ సమస్యను మా హాస్పిటల్ సూపరింటెండెంట్ గారి స్నేహితుడు హైదరాబాద్‌లో ప్రముఖ నేత్ర వైద్యులుగా ప్రాక్టీస్ చేస్తున్నారు. ఆయనను సంప్రదించాం! ఆయన వెంటనే స్పందించారు!"

"ఇంతకూ కంటికి ఏమైందో... ఏ చికిత్స అందించారో వివరిస్తారా... డాక్టర్!" యాంకర్ ప్రేక్షకులకు వివరించడానికి ప్రశ్న వేసింది.

"నెలలు పుట్టకుండా పుట్టిన బిడ్డ కంటికి ఏదో సమస్య వచ్చిందని మాకర్థమైంది. ఆ సమయంలో సరియైనచికిత్స అందించకపోతే శాశ్వతంగా అంధురాలయ్యే అవకాశముంది.

అప్పుడే నా స్నేహితుడైన కంటి డాక్టర్ హైదరాబాద్ నుండి మా హాస్పిటల్‌కు వచ్చాడు. రెండు కళ్ళను క్షుణ్ణంగా పరీక్షించారు.

ఒక్కొక్క కంటికి గంటకు ఒకటి చొప్పున రెండు గంటలపాటు లేజర్ చికిత్స చేశాడు. ఆపరేషన్‌లు చేశాడు. అంతవరకూ లోకాన్ని చూడడానికి ఇబ్బందిపడిన పాప చక్కగా ప్రపంచాన్ని చూడసాగింది. అన్నింటినీ గుర్తుపట్టసాగింది. మా ఆనందానికి అంతు లేకుండాపోయింది"

"చూశారుగా! ఇటువంటి అద్భుతం ఏ కార్పొరేట్ హాస్పిటల్లోనో...ఏ మల్టీస్పెషాలిటీహాస్పిటల్లోనో జరగలేదు. సర్వసాధారణమైన గవర్నమెంట్ హాస్పిటల్లో... అదీ ఓ జిల్లా ప్రభుత్వ వైద్యశాలలో డాక్టర్‌లు, సిస్టర్‌లు సాధించిన సాహసోపేతమైన పరమాద్భుతమైన విజయం! ఇప్పటివరకూ డాక్టర్‌ల పాత్ర తెలుసుకున్నాము. కొద్ది విరామం తరువాత సిస్టర్‌ల పాత్ర కూడా తెల్సుకుందాం!"యాడ్‌లపరంపరలు ప్రారంభమైనాయి.

"అలా నెలలు నిండకుండానే పుట్టి పెరిగి గొప్పవాళ్ళైనవాళ్ళెవరైనా ఉన్నారాండీ!"ఈసారి శ్రీమతి నా పరిజ్ఞానాన్ని పరీక్షించాలనుకుంది.

"ఉన్నారే! అలా పుట్టినవాళ్ళూ ఉన్నారు. బ్రతికి పెరిగి పెద్దవారైన వారున్నారు. ఎన్నో అద్భుతాలు సాధించినవారూ ఉన్నారు" నాకు వాళ్ళ వివరాలు అందించాలనిఉందని గ్రహించిన శ్రీమతి అడిగింది.

"చెప్పండి! వాళ్ళెవరో?" "ఒకరు... బాబా సాహెబ్ అంబేద్కర్! మన రాజ్యాంగ సృష్టికర్త ఎంత ఘనుడో నీకు తెలియంది కాదు!"

"మరి రెండవవారు!"

"సాపేక్ష సిద్ధాంత సృష్టికర్త... శాస్త్రవేత్తలకే ఒక దిశానిర్దేశం చేసిన ఐన్‌స్టీన్!"

"ఆ...!" శ్రీమతి ఆశ్చర్యం ప్రకటించింది.

అందరూ అద్భుత విజయాలు సాధించినవారే! అలా జీవించినవాళ్ళంతా ఏదో ఒక అద్భుతాన్ని సాధిస్తారనేది జగద్విదితం!" నా విశ్లేషణకు శ్రీమతి అబ్బురపడి మరో ప్రశ్న వేసింది.

"అయితే...ఈ అమ్మాయికూడా ఏదో ఒక అద్భుతాన్ని సాధించి ఉండాలే!" సందేహంగా అంది.

"సాధించే ఉంటుంది! మళ్ళీ వార్తాచిత్రం ప్రసారమయ్యేంతవరకు మనం వేచిచూడవల్సిందే!" టీవీ వైపు దృష్టిసారించాను.

ఇంతలో మళ్ళీ యాంకర్ టీవీ తెరపై ప్రత్యక్షమైంది. ఈసారి సిస్టర్స్ అంతా సంతోషంగా కబుర్లు చెప్పుకుంటున్న హాస్పిటల్ కారిడార్‌లోకివచ్చేసింది. "డాక్టర్ సునంద పెంపకంలో మీ పాత్ర అమోఘమైందని ఎందరో డాక్టర్లు మీ గురించి చెప్పారు. ఆమెను మీరెలా పెంచారో... మా ఛానెల్ ప్రేక్షకులకు వివరిస్తారా?"

హెడ్ సిస్టర్ మైక్ అందుకుంది. "పాపను బ్రతికించాలనే తపన మాకందరికీ ఉంది. డాక్టర్‌లు చేస్తున్న చికిత్సలకి అవసరమైన సహాయ సహకారాలందించే వాళ్ళం!

మేమే అనేకమంది బాలింతల వద్దనుండి చనుబాలను సేకరించేవాళ్ళం! పాపకు పట్టడానికి అష్టకష్టాలు పడేవాళ్ళం. కదలక మెదలక పడి ఉండే పాపకు బెడ్ సోర్స్ రాకుండా క్లీన్ చేసేవాళ్ళం!

కంటికి కనురెప్పలా ఇరవై నాలుగ్గంటలూ పాపను చూసుకునేవాళ్ళం" ఆమె సంతోషంగా అంది.

"డాక్టర్ల పర్యవేక్షణలో వైద్య విజ్ఞానమందించిన సహకారంతో పాపను బ్రతికించుకోగలిగాం! సంవత్సరం తరువాత వాళ్ళ తల్లిదండ్రులకు సంతోషంగా అందించగలిగాం!"

"అప్పుడు మీకేమీ అనిపించలేదా...?" యాంకర్ ప్రశ్నించింది. "అనిపించకపోవడమేమిటండీ!

మా పాపనే వాళ్ళకు అప్పగిస్తున్న బాధ కలిగింది. ఇక నుండి మేం అపురూపంగా పెంచుకుంటున్న పాప కనిపించదని కళ్ళవెంట నీళ్ళు పెట్టుకున్నాం. కానీ పాప తల్లిదండ్రులతో కుదిరిన ఒప్పందం మా ఆనందాన్ని హరించలేకపోయింది!"

"ఏమిటో... ఆ ఒప్పందం?"

"మూడు నెలలకోసారి పాపను మాకు చూపించాలి! ప్రతి బర్త్‌డే కేక్ కటింగ్‌లన్నీ మా హాస్పిటల్‌లోనే జరగాలని ఒప్పందం కుదిరింది! ఆ విధంగానైనా పాపకు అవసరమైన వైద్య సహాయం అందుతుందనే మా ఆశ!" ఓ సిస్టర్ వివరించింది.

"సాధారణంగా అలా నెలలు తక్కువగా పుట్టిన పిల్లలు అద్భుత మేధాశక్తిని కలిగి ఉంటారంటారు. ఏవేవో విజయాలు సాధిస్తారని విన్నాము.... నిజమేనా?" యాంకర్ మా ఆవిడకు వచ్చిన ధర్మ సందేహాలు వ్యక్తీకరించింది.

"అవునండీ! అద్భుతమైన జ్ఞాపకశక్తి పాప స్వంతమైంది. జ్ఞాపకశక్తి, మేధాశక్తుల కలయిక వలన పదమూడేళ్ళకే టెంత్ క్లాస్‌లో స్టేట్ లెవల్ ర్యాంక్ తెచ్చుకుంది.

పదిహేనేళ్ళకే ఇంటర్ మీడియెట్‌లో మంచి మార్కులు, ఎమ్‌సెట్‌లో ఫ్రీ

## ఎన్నేళ్ళకు ఈ విందు

పదేళ్ళ కెరీర్, ముప్ఫై దాటిన వయస్సు- అయినా ఉత్తరాది భామ యామీగౌతమ్ పొంకాలు ఇసుమంతైనా తగ్గనేలేదు. అటు బాలీవుడ్, ఇటు టాలీవుడ్‌లే కాక ఇంకొన్ని ఇతర భాషల్లోనూ తన అదృష్టాన్ని పరీక్షించుకుంటున్న యామీ గౌతమ్‌కి కెరీర్ బ్రేక్ అయితే పెద్దగా కలిసిరాలేదు.

బ్రాండ్ అంబాసిడర్‌గానూ పేరుంది. హృతిక్ రోషన్ వంటి పెద్ద నటులతో కలిసి నటించిన అనుభవమూ ఉంది. అయినా పరుగు అందుకోకపోవడానికి కొన్ని గ్లామర్ పద్ధతులే కారణం అని ఇన్నేళ్ళకు గ్రహించిందో,భ్రమపడిందో కాని, ఈ మధ్య ఓ ఆంగ్లపత్రికకు చూపరులకు మతి చలించేరేంజ్‌లో పోజులు ఇచ్చింది. వర్కవుట్ అవుతుందంటారా?

కులాల మధ్య చిచ్చు, కులాల ఓటు రాజకీయం ఆర్థిక ప్రగతిని దెబ్బతీస్తాయి. -పవన్‌కళ్యాణ్, జనసేన నేత

మెడిసిన్‌సీటు తెచ్చుకునే ర్యాంక్‌స్వంతంచేసుకొంది. ఇరవై ఏళ్ళకే మెడిసిన్ పూర్తిచేసింది.

ఇరవై మూడేళ్ళకే ఎమ్.డి. పూర్తిచేసి, తాను పుట్టిన ఈ హాస్పిటల్‌కే పీడియాట్రిక్ డాక్టర్‌గా సేవలు చేయడానికి వస్తోంది! ఇంతకంటే సంతోషకరమైన వార్త మరేముంటుంది చెప్పండి!

అందుకే మా డాక్టరమ్మాయి రాకకోసం మేము వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాం!"

"ఇంకా డాక్టరమ్మాయి రావడానికి సమయం పడుతుంది గనుక... ఆమెకు జన్మనిచ్చిన తల్లిదండ్రులు ఏమంటున్నారో... మా ప్రేక్షకులకు వినిపిస్తున్నాం. అంతకుముందే రికార్డు చేసిన వారి మనోగతాలను మాతోపాటు మీరు కూడా పంచుకోండి!" అంటూ యాంకర్ అదృశ్యమైంది.

అంతకు ముందే రికార్డైన వీడియో ప్రసారం ప్రారంభమైంది! "మీరేనా డాక్టర్ సునంద తల్లిదండ్రులు...?" మరో యాంకర్ ప్రశ్నించింది.

"అవునమ్మా! మేమే ఆ అదృష్టవంతులం!"

"పాప పుట్టిన తరువాత మీకేమనిపించింది!" సునంద తల్లిని అడిగింది యాంకర్.

"పాపను చూస్తుంటే భయమేసింది. బ్రతికి ఉందో బెడ్‌కు చిన్నబల్లిలా అతుక్కుపోయిన పాపను చూసి గుండె గుభిల్లుమంది. వెంటనే భయపడి పారిపోయాను!" నిజాయితీగా చెప్పింది.

"నాకుకూడా భయమేసిందమ్మా! చనిపోయిన బిడ్డ పుట్టిందనుకున్నాము. కొద్దిగా కాళ్ళూ చేతులు మాత్రం కదులుతున్నాయి. లేకపోతే ఆస్పత్రి వారే చూసుకుంటారని వదిలి వెళ్ళిపోయాం!" తండ్రి కూడా అన్నాడు.

"మళ్ళీ పాప గురించి మీకెలా తెలిసింది?"

"పదిరోజుల తరువాత ఓ సిస్టర్ మా ఊరికి వచ్చింది. పాప బ్రతికే ఉందని, డాక్టర్లు బాగా చూస్తున్నారని, మమ్మల్ని రమ్మని చెప్పారని చెప్పింది. అప్పటినుండి వాళ్ళతోపాటు మేము కూడా పాపను కంటికి రెప్పలా చూసుకున్నాం!"

మళ్ళీ ఆ వైద్యవిజ్ఞాన మిరాకిల్ లైవ్ ప్రసారం ప్రారంభమైంది. ఇంతలో హాస్పిటల్ కాంపౌండ్‌లోకి ఓ ఆటో వచ్చి ఆగింది.

అందులోంచి ముగ్గురు దిగడంతో కలకలం మొదలైంది. "డాక్టరమ్మాయి వచ్చింది!" "మా డాక్టరమ్మాయి వచ్చింది. మన డాక్టర్ సాబ్‌లందరికీ చెప్పిరండి!"

చామనఛాయలో, స్ఫురద్రూపంతో ఆకర్షణీయమైన ఓ యువతి తెల్లని ఏప్రాన్‌తో హాస్పిటల్ కాంపౌండ్ మెట్లు ఎక్కుతుంటే సిస్టర్సంతా ఆమెను చుట్టుముట్టి అభినందనలతో ముంచెత్తారు. ఆమెను కౌగిలించుకున్నారు. "బాగున్నావా... తల్లీ...!" అందరూ హర్షాతిరేకం ప్రకటించారు.

"బాగున్నానమ్మా! చాలా బాగున్నాను. ఈ శరీరం మీరు పెంచింది. ఈ జన్మ మీరిచ్చింది. ఈ తెలివితేటలు మీరు ప్రసాదించింది. ఈ మేధస్సుకు పదును పెట్టింది మీరు. అందుకే ఈ జన్మను మీకే అంకితమివ్వాలని వచ్చాను. మైడియర్ సిస్టర్స్... కాదు కాదు మైడియర్ మదర్స్!" ఆమె చేతులు జోడిస్తుంటే చూసేవారి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

ఇంతలో హాస్పిటల్ సపరింటెండెంట్ సహా మిగిలిన డాక్టర్లంతా హాస్పిటల్ కారిడార్‌లోకి వచ్చేశారు.

"నా జన్మదాతలందరకూ నమస్సుమాంజలులు!" ఆమె శిరసువంచి నమస్కరించింది.

"వెల్‌కమ్ మైడియర్ చైల్డ్..." నాడు ప్రాణప్రతిష్ఠ చేసిన డాక్టర్ చేతులు సాచారు.

"థాంక్యూ సర్స్... థాంక్యూ... వెరీ వెరీ మచ్!" అతడి పితృ పరిష్వంగంలో ఒదిగిపోయింది.

నర్స్... సర్స్... కాదమ్మా... ఫాదర్స్ అన నమ్మా!" ముక్తకంఠంతో అన్నారు. విస్మయంగా ఆమె కళ్ళు విప్పార్చి వారివైపు చూసింది.

"అవునమ్మా! ప్రతివారికీ ఐదుగురు తండ్రులు ఉంటారని అంటారు. జన్మనిచ్చినవారు ఒకరైతే పెంచి పెద్ద చేసినవారు ఒకరు! చదువు చెప్పినవారు ఒకరు. ఆశ్రయం ఇచ్చిన వారు ఒకరైతే... ప్రాణదానంచేసినవారు ఒకరు.

ఆ ఐదుగురిలో మేము ఉన్నామో లేదో ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకోమ్మా!

అందుకే మమ్మల్ని అందరినీ 'ఫాదర్స్' అని పిలువమ్మా!"



**సామాజిక స్పృహ లేనివారే నిజమైన అంధులు.**
-త్రిదండి చినజియ్యర్‌స్వామి, ఆధ్యాత్మిక గురు

## నెమ్‌సింగ్ డాగర్ (టీచర్)
## మనీ టిప్స్

"ప్రస్తుత జనరేషన్ డబ్బు ఖర్చుచేయడంగురించి సరైన అవగాహన కలిగివుండాలి. స్మార్ట్‌గా పొదుపు చేయగలగాలి. మరీ ఎక్కువగా ఋణాలు తీసుకోవద్దు. ఇవి జీవితానికి ఒత్తిడి కలిగిస్తాయి. జీవితాన్ని పరిపూర్ణంగా ఎంజాయ్ చేయాలి.

లేటెస్ట్ ఐఫోన్ లేకపోయినా పర్వాలేదు కాని, స్వంత ఇంటిని స్వంతంగా సమకూర్చుకుంటే ఆ ఆనందమే వేరుగా ఉంటుంది.

లగ్జరీ ఛాయిస్‌లు కాక ప్రాక్టికల్‌గా ఖర్చుచేయడాన్ని నవతరం నేర్చుకోవాలి. ఆర్థికస్వాతంత్ర్యం ప్రతి ఒక్కరికీ ఉండాలి" అంటారు జైపూర్ నివాసి, గవర్నమెంట్ స్కూల్‌నుంచి అధికారికంగా రిటైర్ అయ్యాక కూడా టీచింగ్‌పట్ల ఉన్న ఇష్టంతో ఇప్పటికీ వృత్తిని కొనసాగిస్తున్న నెమ్‌సింగ్.



"ఫాదర్స్... డాడీ... నాన్నగారూ... నాన్నగారు... నాన్నగారూ..." అని సంబోధిస్తూ ఒక్కొక్కరికీ పాదాభివందనం చేస్తూ పుత్రికా పరిష్వంగంతో ఆ డాక్టర్లను పులకింపచేసింది.

"చూశారుగా! పునర్జన్మ పొందిన డాక్టర్ సునంద కథ... ప్రిమెచ్యూర్ బేబీ కథ సాహసోపేత సఫలీకృత కథ! వైద్య విజ్ఞానం అందించిన పరమాద్భుత పరవశ కథ! డాక్టర్ సునంద జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చేంతవరకూ ఉందామా!" యాంకర్ సంతోషంగా ప్రకటించింది.

ఆమె సూపరింటెండెంట్‌గారి ఛాంబర్‌లో జాయినింగ్ రిపోర్టు ఇచ్చి రిజిస్టర్‌లో సంతకం పెడుతుండగానే ఓ సిస్టర్ మెటర్నిటీ వార్డ్ నుండి పరిగెత్తుకు వచ్చింది. "డాక్టర్... డాక్టర్.. ఎమర్జెన్సీ...!" ఆమె రొప్పసాగింది.

"ఏమైంది సిస్టర్" సూపరింటెండెంట్ బాస్ అడిగారు.

"ఆరవనెలలోనే ప్రసవించిన పాపను వదిలిపెట్టి ఆ తల్లి పారిపోయింది డాక్టర్!"

"నువ్వేమీ కంగారుపడనవసరం లేదు, మన డాక్టర్ సునంద వచ్చేసిందిగా!" ఆమెవైపు చూశారు.

"ఎస్... డాక్టర్! ఇప్పుడే డ్యూటీలో జాయిన్ అవుతున్నాను" డాక్టర్ సునంద మెటర్నిటీ వార్డు వైపు దారితీయడంతో లైవ్ టెలికాస్ట్‌కు 'శుభం' కార్డు పడింది.

"చూశారుగా! ప్రభుత్వ ఆసుపత్రి అని చిన్నచూపు చూడకండి! వైద్యోనారాయణో హరిః! అక్కడా ధన్వంతరులుంటారు. సుశ్రుతులుంటారు.

చరకులుకూడా దర్శనమిస్తుంటారు. సహృదయులైన డాక్టర్‌లందరికీ శిరసు వంచి పాదాభివందనం చేస్తూ మరో అద్భుతమైన కథాకథనంతో త్వరలో మళ్ళీ మీముందుంటాను!"

యాంకర్ అంతర్ధానమైనా... ఆ కథనం పది కాలాలు అంతరంగంలో ఆవిష్కరించబడుతూనే ఉంది. ప్రదర్శింపబడుతూనే ఉంది!

అది పురిటిలోనే సంధికొట్టబోగా రక్షింపబడిన ఓ లివింగ్ ఎగ్జాంపుల్! సాహసోపేతమైన సఫలీకృతమైన ఓ జీవసజీవ కథ!

# స్కూలు రోజుల్లోనే ఫస్ట్ క్రష్

హాట్ సైరన్ రాయ్‌లక్ష్మి 'జూలీ 2' తో బాలీవుడ్‌లో పరుగులెత్తాలని భావించింది. కాని ఆశించిన ఫలితాలు సినిమా ద్వారా అయితే దక్కలేదనే అనుకోవాలి. అయితే నేం వీలయినన్ని ఒంపుల ప్రదర్శనతో కుర్రకారు మదిని దోచేస్తున్నది. ఆమెతో ఇంటర్వ్యూ.

**మీ శారీరక ఆకృతికి సంబంధించి ఇబ్బందిపడిన సందర్భాలు ఉన్నాయా? ఆకృతి ప్రాముఖ్యం ఉందంటారా?**

ఓ. చాలాసార్లు. ఐతే రాను రాను ఓ విషయాన్ని బాగా అర్థం చేసుకున్నాను, నా శరీరాకృతిని ఎంతమంది అయితే ఇష్టపడరో, అంతమందీ ఇష్టపడేవారున్నారని. ఇదంతా నన్ను ప్రభావితం చెయ్యదని నేను అనను. కాని, నా భారీ ఆకృతి వల్ల నేను అసౌకర్యంగా ఫీలవడమో, షేమ్‌గా అనుకోవడమో మాత్రం జరగలేదు.

**మీ తొలి క్రష్?**

ప్రతి ఒక్కరి జీవితంలోనూ ఫస్ట్ క్రష్ వారి స్కూలు రోజుల్లోనే పడుతుంది. టీనేజర్‌గా చాలామంది నటుల పట్ల క్రష్ ఏర్పడింది.

**మగవాడిలో మిమ్మల్ని బాగా ఆకర్షించే నచ్చే లక్షణాలేంటి?**

నిజాయితీ, సమగ్రతా దృష్టి- ఈ రెండూ నాకు బాగా నచ్చుతాయి.

**తొలిముద్దు అనుభూతి?**

(నవ్వేస్తూ) అమ్మో, కొన్ని వ్యక్తిగత విషయాలు అలా ఉండనీయండి. అయినా మొదటి ముద్దు ఇచ్చేది అమ్మానాన్నలే కదా. అవి సిల్లీగా వున్నా, ఎప్పటికీ మధురస్మృతులే.

**మీ అమ్మానాన్నలనుంచి ఏదైనా ఇబ్బందికర పరిస్థితి ఎప్పుడైనా ఎదురయిందా?**

మా అమ్మానాన్నలు చాలా స్వీటెస్ట్. ఒకవేళ ఏదైనా ఇబ్బందికర పరిస్థితి ఎదురైనా, దాన్ని వాళ్ళు చాలా



సహజంగా, క్యాజువల్‌గా హ్యాండిల్‌చేయడం నాకుచాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటుంది.

**మీరు పక్కింటి అమ్మాయి ఇమేజ్‌కు ఇష్టపడతారా? సెక్స్ ఐకాన్ లేదా శక్తివంతమైన పర్‌ఫార్మర్‌గా వుండాలి అనుకుంటారా?**

ఈ విషయంలో సరిహద్దులేవీలేవు.నా కుటుంబం, నా అభిమానులు నన్ను సంతోషంగా చూడగలిగితే చాలు.

నా వృత్తిపట్ల గొప్ప ఇష్టంతో వుండే నేను ఎప్పుడూ కూడా ప్రతిభకే ప్రాధాన్యం ఇస్తుంటా.

**ఎప్పుడైనా అవమానకరమైన లేదా మోసపూరితమైన పరిస్థితులు ఎదుర్కొన్నారా?**

అవమానం, మోసంలాంటి కఠినమైన సందర్భాలను నేను గుర్తుతెచ్చుకోవాలని అనుకోను. అబద్ధపు వాగ్దానాలతో చాలాసార్లు మోసపోయానని చెప్పాలి.

**మీరు ఎటువంటి ప్రేమికురాలిని అంటారు?**

నా ఎమోషన్లు, భావాలు, చర్యల్ని ఓ ప్రేమికురాలిగా వేటికవి విడదీసి చూడలేను. నేనో పాసినేట్ ప్రేమికురాలిని. నా జీవితభాగస్వామితో కలసి ప్రయాణాలు చేయడం ఇష్టం. మంచి ఆహారాన్ని తయారుచేసి అతనికి పెట్టడం ఇష్టం. తన అవసరాలు గమనించి ముందే సిద్ధంచేసి పెట్టడం నాకు ఇష్టం.



**ఒన్-నైట్ స్టాండ్‌పై మీ అభిప్రాయం ఏంటి?**

ఎవరిష్టం వారిది. ఎమోషన్లు అవసరం లేనప్పుడు ఒన్‌నైట్ స్టాండ్ గురించి ప్రస్తావించుకోవాలి. పెద్దగా తెలియని వ్యక్తితో అంత శీఘ్రంగా, సులువుగా వెళ్ళగలగడం చాలా కష్టమైన పని అనేది నా అభిప్రాయం.

**మీ భాగస్వామిని మోసం చేయాలన్న ఆలోచన ఉండదా?**

అస్సలు ఉండదు. ఎప్పుడైతే మోసపూరితమైన ఆలోచన వస్తుందో అప్పుడు ఎమోషనల్‌గా, శారీరకంగా డిస్ కనెక్ట్ అయినట్లే. మోసాలు, ఇబ్బందికర, చేదు అనుభవాలకంటే రిలేషన్‌షిప్‌ను గొప్పగా కొనసాగించాలనేది నా ఉద్దేశ్యం.

**మీ గురించి మీరు విన్న హేయమైన గాసిప్ లేదా రూమర్ ఏమిటి?**

సాధారణంగా ఏ తారపైన ఐనా సహనటుడితో లింక్‌చేసి పుకార్లువెదజల్లుతుంటారు. కాబట్టి దీన్ని నేను హేయమైన విషయంగా చెప్పలేను. ఏదో ఒక రంగు పులిమేయడం సులువైన విషయం.

అయితే నా శరీరంపై నేను ప్రయోగాలు చేశాననడం మాత్రం కరెక్ట్ కాదు. నా రూపం పూర్తిగా సహజమైనది.

**జనం ముందు మీరు బోల్డ్‌గా ప్రదర్శించిన సందర్భం ఉందా?**

నిజానికి ఈ మధ్యే జరిగింది. 'జూలీ 2' సినిమాలో సన్నిహిత సన్నివేశం ఉంది. వందమందికిపైగా సిబ్బంది ముందు నటించాను.

నాకది చాలా కష్టంగా, బోల్డ్‌గా అనిపించింది.

**ఇటీవలికాలంలో తిరస్కారానికి గురయ్యారా?**

నటి జీవితంలో తిరస్కారం అనేది అత్యంత సహజం. కొన్ని పొందుతాం, కొన్ని కోల్పోతాం. ప్రేమ విషయం అయితే ఓవైపే ఉండే ప్రేమ డేంజర్ అనేది నా ఉద్దేశం.

**పరిశ్రమలో ఉత్తమ బాడీ ఎవరిదంటారు?**

సల్మాన్‌ఖాన్‌ది చాలా ఆకర్షణీయమైన బాడీ. హృతిక్‌రోషన్‌ది కూడా.వరుణ్,టైగర్‌కూడా చక్కని శరీరాకృతిగలవారే అంటూ ముగించింది రాయ్‌లక్ష్మి.

**అయినపూరి సుజాత**



సీరియల్

# అల్లిబిల్లి



పుట్టగంటి గోపీకృష్ణ



**ఒ**కపక్క ఆదిత్య,మరోపక్క రమేష్ కిరణ్‌ని రామ్మూర్తికి హెల్ప్ చేయమని అడిగారు. చేయాలని ఉన్నా ఎలా చెయ్యాలో కిరణ్‌కి అర్థంకాలేదు.

కనీసం తనదగ్గర నిన్న నల్లకాకికి ఇచ్చిన జానీ వాకర్ కూడా లేదాయె... అనుకోకుండా వచ్చిన అవకాశం కళ్ళముందే కరిగిపోవటం ఇష్టంలేదు. అందుకే, కనీసం లోకల్ విస్కీ అయినా తెద్దామని నిన్న చూసిన తాటితోపువైపు పరుగెత్తాడు. అలుపు వస్తున్నా తాటితోపు వచ్చేదాకా ఆగలేదు.

తీరా అక్కడకు చేరాక ఆ ప్రదేశం అంతా నిర్మానుష్యంగా కనిపించింది. పండుగసందర్భంగాముందు రోజే కుండలన్నీ దింపి పట్టుకుపోయారు.

ఓటమిని అంత త్వరగా ఒప్పుకోవటం అతనికి ఇష్టంలేదు. ఒక చెట్టుచివర ఇంకా దించని కల్లుకుండ కనిపించింది. తను చెట్టు ఎక్కటంతప్ప మరో మార్గం లేదు. కానీ నిటారుగా అంత ఎత్తున్న చెట్టుని అలవాటులేని తను ఎక్కగలడా?

మరోపక్క రామ్మూర్తి ఇచ్చిన భరోసా ధైర్యంచెయ్యమని ప్రోత్సహిస్తోంది. ఆ చెట్టుదగ్గరకు వెళ్ళి ఎక్కటానికి ప్రయత్నించాడు కానీ, రెండు మూడు అడుగులకంటే ఎక్కలేక జారిపోయాడు.

అప్పుడతనికి నిన్న చెట్టు ఎక్కిన వ్యక్తి కాళ్ళకు కట్టుకున్న చిక్కం గుర్తుకువచ్చింది. ఆ వ్యక్తి నడుముకు రబ్బరు టైరులాంటిది కట్టుకున్నాడు. వాటి సహాయంతో అవలీలగా చెట్టు ఎక్కాడు. కానీ... తనకది ఎక్కడ దొరుకుతుంది?

దారిలో వస్తున్నపుడు చెరువు పక్కన ఆరేసిన బట్టలు చూసిన గుర్తువచ్చింది. తిరిగి అటు పరుగెత్తాడు.అక్కడ కనిపించిన ఒక పంచె తీసుకుని దానిని పీలికలు చేయుటం మొదలుపెట్టాడు.

ఆ పీలికలన్నీ కలిపి ఒక చిన్నతాడులా చేసి దాన్ని గుండ్రంగా ముడివేసి కాళ్ళకు కట్టుకున్నాడు. అలానే తయారుచేసిన మరొక తాడును నడుముచుట్టూ చుట్టాడు. దాని సహాయంతో ఎక్కటం మొదలు పెట్టాడు. తదేక దృష్టితో చెట్టుపైనున్న కుండనే చూస్తూ ఎగబాకాడు.కుండలోని కల్లును తన విస్కీ ఫ్లాస్కులోకి నింపుకుని చెట్టుదిగి వచ్చాడు. దిగిన వెంటనే వచ్చిన దారిన పరుగుపెట్టాడు.

అతను కోడిపందాలు వేసే రావిచెట్టు దగ్గరకు వచ్చేటప్పటికి రామ్మూర్తి అక్కడ కిరణ్‌కోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

"ముందుగానే నిజం చెప్తున్నాను. నాకు ప్రత్యేకంగా విద్యలేమీ రావండీ... అసలు ఈ పుంజుల గోలేమిటో నాకు తెలియదు. నిన్న ఆ నల్లకాకి ఎందుకు గెలిచిందో, మీ తెల్ల నెమలి ఎందుకు ఓడిందో నాకస్సలు తెలియదు.

నాకు తెలిసిన ఓ చిన్న చిట్కా ప్రయోగించాను. దానివలన ఆ నల్లకాకి గెలిచిందన్న గ్యారంటీ కూడా లేదు.." అంటున్న కిరణ్ మాటలు వినిపించుకోకుండా లాక్కెళ్తున్నాడు రామ్మూర్తి.

"**ఆ** చిట్కా ఏదో ఇప్పుడు నా పుంజుమీద ప్రయోగించు" అన్నాడు రామ్మూర్తి.

"మీరు నా మాటలు నమ్ముతున్నట్లు లేదు. మీ పుంజును గెలిపించమని రమేష్ కూడా చెప్పాడు. కానీ నా చిట్కామీద నమ్మకం పెట్టుకోకండీ! నేను దుబాయ్‌నుంచీ రాలేదు. నేను గద్దలకి ట్రైనింగ్ ఇవ్వటం కూడా నిజం కాదు..."

"నిన్న అందరికీ దుబాయ్ నుండి వచ్చానని చెప్పావ్..." అన్నాడు రామ్మూర్తి.

"అవున్సార్!... నా ప్రేమకోసం అబద్ధం చెప్పాను. అంతేకానీ ఎవర్నీ మోసంచెయ్యాలని కాదు"

"ప్రేమా?... ఎవర్ని ప్రేమించావ్?"

ఆయన్ని చూస్తే అబద్ధం చెప్పబుద్ధికాలేదు కిరణ్‌కి. అందుకే కాంతారావు కూతురు గౌరితో తన ప్రేమగురించీ, దానికి కాంతారావు ఒప్పుకోక



22

**జరిగిన కథ**

**సౌం**దర్యను కలుస్తాడు రమేష్. మా నాన్నని కోడిపందెంలో గెలిపిస్తే నన్ను నీకిచ్చి పెళ్ళిచేస్తాడని చెబుతుంది సౌందర్య.

ఈషిక చెప్పినవిధంగా మృదుల ఓ గదిలోకి వెళ్ళింది. అక్కడ దొంగచాటుగా అరిసెలు తింటున్న రమేష్ కనబడుతాడు.

పక్కన వున్న గదిలో ఏదో చప్పుడైతే చప్పున ఆ గదిలోకి పరిగెడతారు మృదుల, రమేష్ మురారిని కిందపడేసి అతని మూతి నాకు తుంటుంది టైగర్. టైగర్‌తో పాటు రమేష్ ఓ అడవిలో తప్పిపోతాడు.

అక్కడ కొందరు మనుషులతో ఎర్రచందనం చెట్లను నరికిస్తున్న దినమణి తారసపడతాడు. రమేష్ పోలీసు మనిషని భావించి అతని చేత గోచీ కట్టించి చెట్లను నరికిస్తాడు.

మృదులతో మురారి సరసాల్లో పడతాడు. అతనిపై ప్రేమ కనబరుస్తుంది మృదుల. కొడుకు పెళ్ళిగురించి లక్ష్మితో మాట్లాడతాడు రంగారావు. తర్వాత జరిగేది చదవండి.

పోవటం గురించీ వివరంగా చెప్పాడు.నవ్వాడు రామ్మూర్తి.

"అయితే నువ్వు కంప్యూటర్ ఇంజనీరువా?" అన్నాడు.

"కాదండీ! అలాంటి ఇంజనీర్లకి ఉద్యోగం ఇచ్చే కంపెనీ ఓనర్ని"

"నిజమా?"

"అవునండీ!... మీ అమ్మాయి ప్రేమించిన రమేష్, నేనూ స్నేహితులమండీ..."

ఆగి ఎగాదిగా చూశాడు రామ్మూర్తి. "మరి ఈ వేషమేంటి?" అతని గుబురుమీసాలవైపూ, బనియన్, పంచెవైపు-చూస్తూ అడిగాడు.

"అన్నీ వేషమేనండీ! ఈ మీసంకూడా పెట్టుడు దేనండీ!!... మామూలుగా వస్తే నన్ను కాంతారావు గుర్తుపడతారండీ. అందుకనీ..."

"అయితే ఒక పని చెయ్యి. నా పుంజును గెలిచేటట్లు చెయ్యి. ఆ కాంతారావు నేను చెప్పిన మాట కాదనడు. నీ పెళ్ళి చేయించే బాధ్యత నాది"

"మీరు మళ్ళీ మొదటికొచ్చారు. నాకు ఆ విషయాలేమీ తెలియదు..." అన్నాడు కిరణ్.

"నీకు పెళ్ళి కావాలంటే నేను చెప్పినట్లు చెయ్యాల్సిందే..." ఇక తన మాటకి ఎదురులేదన్నట్లు బరివైపు నడిచాడు రామ్మూర్తి.

పందెం లక్షరూపాయలవటంతో అందరూ ఉత్సాహంగా చూస్తున్నారు. ఎదురు పందెం వేసింది పక్క ఊరు మోతుబరి మల్లిఖార్జునయ్య.

గుంపులోని జనం తగ్గుస్వరంతోరామ్మూర్తి మీద రకరకాల కామెంట్లు పాస్ చేస్తున్నారు. "ఎంత డబ్బుంటే మాత్రం ఇట్టా తగలేసుకోవాలంటరా..." అంటూ ఒకరు

"ఎప్పుడన్నా గెలిసేడిస్తే కదా ఇప్పుడు గెలవటానికి" అని.

"అయినా తెలిసి తెలిసి ఎవడన్నా సీతువని తెచ్చి డేగమీదకి వదుల్తాడంట్రా?"

"ఆ డేగ చూడు ఎట్టా తల విసుర్తోందో..."

"మల్లిఖార్జునయ్య పుంజంటే మండలం మొత్తం మీద హడల్..."

"ఈయన సీతువ చూడు పోటీకి దిగకముందే ఎలబారతంది..."

ఆ కామెంట్లు వినిపించుకోకుండా తన పుంజును కిరణ్ చేతుల్లో పెట్టాడు రామ్మూర్తి.

ఆ సీతువని దూరంగా తీసుకుపోయి తన ఫ్లాస్కులోని ద్రవాన్ని దానికి పట్టిచ్చి, ఆరునిమిషాల్లో తిరిగి దానిని తీసుకువచ్చాడు కిరణ్. పందెం మొదలైంది. ఎవరూ ఊహించనివిధంగా రామ్మూర్తి పుంజు విజృం

భించింది. మొదటినుండి చివరిదాకా ఒకే రేంజ్‌లో పోరాడి విజయం సాధించింది.

ఊహించని ఆ విజయానికి అందరూ రామ్మూర్తిని ఆకాశానికి ఎత్తుతున్నారు. కాంతారావు కూడా ఎప్పుడు వచ్చాడో తెలియదు కానీ అక్కడే ఉన్నాడు. అతను కూడా రామ్మూర్తిని అభినందించాడు.

రామ్మూర్తి ఆ అభినందనలు పక్కనపెట్టి, కిరణ్‌ని తీసుకుని ఊర్లోకి నడవటం మొదలుపెట్టాడు. వెళ్తూ వెళ్తూ "కాంతారావ్!... ఇటురా. నీతో మాట్లాడాలి" అని అతన్ని కూడా పిలిచాడు.

"చెప్పు..." అన్నాడు కాంతారావు.

"ఈ విజయం నాది కాదు, ఈ కుర్రాడిది..." కిరణ్‌ని చూపిస్తూ చెప్పాడు రామ్మూర్తి.

"ఈడు కుర్రాడు కాదు పనోడు. ఈడి సంగతి నాకు తెలుసు"అన్నాడు కాంతారావు.

"ఏం తెలుసు?"

"అన్నీ తెలుసు. దుబాయ్‌లో గద్దలకి..."

"ఇక నువ్వెళ్ళవోయ్! మేమిద్దరం మాట్లాడుకుంటాం" అన్నాడు రామ్మూర్తి.

కిరణ్ బ్రతుకు జీవుడా అనుకుంటూ అక్కడ నుండీ వెళ్ళిపోయాడు."అతను దుబాయ్‌పనోడూ కాదు, గద్దలకి ట్రైనింగ్ ఇచ్చేవాడూ కాదు. పేరు కిరణ్... కోటీశ్వరుడు" చెప్పాడు రామ్మూర్తి.

"మరి ఈ వేషమేంటి?" షాక్ తిన్నట్లు అడిగాడు కాంతారావు.

"నీ కూతురి ప్రేమకోసం అతని తపన..."

అప్పుడర్థమైంది కాంతారావుకి, గౌరి వెంటబడుతుంటే తన్ని తరిమేసింది ఈ కిరణ్‌నే... అని. "నా జోలికీ, నా కూతురు జోలికీ రావద్దన్నానని ఇలా మారువేషం వేసుకుని మరీ మా ఊరు వస్తాడా?"ఆవేశపడబోయాడు కాంతారావు.

అతన్ని ఆపేశాడు రామ్మూర్తి. "ఇదంతా ఎందుకు చేశాడంటావ్? గౌరిమీద ఎంత ప్రేమ లేకపోతే అంత పెద్ద కోటీశ్వరుడు నీ దగ్గర పాలేరులా పని చెయ్యటానికి కూడా రెడీ అయ్యాడంటావ్?"

"అన్నీ బానే ఉన్నాయ్! ఇతని తాగుడు అలవాటు చూసి కూడా ఎలా పిల్లనిస్తాం?" అసహనం వ్యక్తం చేశాడు కాంతారావు.

"నా కొడుకు ఉన్నాడు. కాస్త తిండిపుష్టి ఎక్కువ. అందుకని పిల్లనిచ్చేవాళ్ళు ఇవ్వరా?"

"అదీ ఇదీ ఒకటెలా అవుతుందండీ?"

"నువ్వు ఒకసారి పెళ్ళిచేస్తానని ఒప్పుకో. ఇక తాగనని ఈ అబ్బాయ్‌చేతే ప్రమాణం చేయిస్తాను"

"జరగని ప్రమాణాలు ఎన్నయితేఏమిలెండి?'

'నెగెటివ్‌గా ఆలోచించటం ఎందుకు కాంతారావ్? అన్నిట్లోకి కిక్కిచ్చేది ప్రేమ. దాని రుచి మరిగిన వాడికి బ్రాందీ, విస్కీలు కిక్కేవి



తమిళనాడులో విలువైన తమ ఓటును అంగటిలో సరుకుగా అమ్ముకుని ప్రజాస్వామ్యానికి మాయని మచ్చగా మిగిలారు. -కమల్‌హాసన్, నటుడు

స్తాయి . పైగా ఇంతకంటే మంచి సంబంధం మనం తేగలమా చెప్పు?" అన్నాడు రామ్మూర్తి.

"ఏమో! మీరు ఇంతగా చెప్తున్నారుకాబట్టి..."

"ఆ కాబట్టి..." అడిగాడు రామ్మూర్తి.

"...ఒప్పుకోక తప్పటంలేదు" అని ముగించాడు కాంతారావు.

అప్పుడే వరసిద్ధి, వినాయకరావు కూనిరాగాలు తీస్తూ ఇంటికి వచ్చారు.

"అంత ఉదయాన్నే ఎక్కడకి వెళ్ళారు?" అడిగింది లక్ష్మి వాళ్ళకి కాఫీలు ఇస్తూ.

"కొన్ని పనులు చాటుగా చెయ్యాలి..." అన్నాడు వరసిద్ధి.

"ఈ వయసులో ఇంకా చాటుగా చేసే పనులా?" అసహ్యంగా ఫేస్ పెట్టింది లక్ష్మి.

"అదేంటమ్మాయ్! బహిరంగంగా గోలీలు ఆడితే ఏమన్నా బాగుంటుందా? అందుకే చాటుగా మామిడి తోటలోకెళ్ళి ఆడుకున్నాం" వివరించాడు వినాయకరావు. "అప్పట్నుంచీ గోలీలు ఆడుకున్నారా?"

"కాసేపు ఆడుకున్నాం. ఆ తరువాత రథంకింద దాక్కుని పాటలు పాడుకున్నాం" అని చెప్పాడు వినాయకరావు.

"గోలీలైతే చాటుగా ఆడుకున్నారు. పాటలు పాడుకోవటానికి దాక్కోటం ఎందుకు?"

"మా చిన్నప్పుడు ఇంట్లో కనపడకుండా అక్కడే దాక్కునేవాళ్ళం. కాసేపు కనపడకపోతే ఊరంతా వెతుక్కునేవాళ్ళు. ఇప్పుడు మేము ఇంతసేపు కనపడకపోయినా ఎవరూ పట్టించుకోలేదు..." నిష్టూరంగా అన్నాడు వరసిద్ధి.

"మీరేమన్నా పసిపిల్లలా మీ కోసం వెతుక్కోవటానికి" అంది లక్ష్మి.

ఇంతలో రామ్మూర్తి కూడా ఇంటికి వచ్చాడు. "ఈ రోజు మొదటిసారి పందెం గెలిచాను" చెప్పాడతను. "ఏం పందెం?"

"ఇంకే పందెం? కోడిపందెం. మన సీతువ మల్లిఖార్జునయ్య కోడిమీద గెలిచింది"

అందరూ అభినందించారు.

"ఇంతకీ రమేష్ ఏడి?" అడిగింది సౌందర్య.

"నాకేం తెలుసు?"

"ఉదయం నుండి కనపడకపోతే మీతో ఉన్నాడనుకున్నాం..."

"అసలింతవరకూ ఈ రోజు నేనతన్ని చూడలేదు" తేల్చాడు వరసిద్ధి.

"నువ్వంటే ఇష్టంలేక పారిపోయాడేమో..." వాతావరణాన్ని లైట్ చేస్తూ అన్నాడు మురారి.

"అన్నయ్యా! షటప్..." అంది సౌందర్య. ఆమె గొంతులో ఆందోళన,కోపం రెండూ ఉన్నాయి.

ఇంతలో హఠాత్తుగా టైగర్ ఇంట్లోకి వచ్చింది. దాని అవతారం చూసి అందరూ హడలిపోయారు. ఒళ్ళంతా ముళ్ళు గీరుకుపోయాయి. దాని శరీరంలో శక్తంతా హరించుకుపోయినట్లు ఇంటి మధ్య కూలబడిపోయింది. అందరూ దానిచుట్టూ

చేరారు. "రమేష్ ఏడి?" అంది లక్ష్మి.

టైగర్ కూడా ఏదో చెప్పాలని ప్రయత్నం చేస్తున్నట్లు మొరుగుతోంది. వాకిలిదాకా వెళ్ళి వెనక్కి వస్తోంది. "అది మనల్ని ఎక్కడికో రమ్మంటోంది" చెప్పింది లక్ష్మి.

"ముందు దానికి తినటానికి ఏదన్నా పెట్టు. లేక పోతే అది ఎక్కువసేపు నిలబడేటట్లు లేదు" అన్నాడు వరసిద్ది. లోపల గదిలోనుండి ఈషిక, ఆమెవెంట ఆదిత్య బయటకు వచ్చారు.

"ఈ అబ్బాయెవరు?" తన మనవరాలి వెనుక వస్తున్న ఆదిత్యనిచూసి అడిగాడు వినాయకరావు.

"ఇతనే నన్ను ఇష్టపడుతున్న ఆదిత్య" చెప్పింది ఈషిక. అనుకోనిది విన్నట్లు స్థాణువయ్యాడు వినాయకరావు.

"అదేంటమ్మా! మనం వచ్చిన పనేంటి? ఈ ట్విస్టేంటి?" అన్నాడు వినాయకరావు.

"ట్విస్టేమీ లేదు. మురారికి నాకంటే మృదులంటే ఇష్టం... అలాంటప్పుడు నన్ను కోరుకునే ఆదిత్యని నేను కాదనుకోవటం ఎందుకు?" నెపం మురారి మీదకి తోస్తూ అంది ఈషిక.

"మురారి ఏడి?..." కోపంగా అన్నాడు వరసిద్ది.

"ఇక్కడే ఉన్నాను తాతగారూ" అంటూ వచ్చాడు మురారి. అతనివెనుక మృదుల వచ్చింది.

"ఏం చేస్తున్నావ్? గారెలు 'బాగా' తింటున్నావా?" బాగా అన్నమాటని వత్తిపలుకుతూ అన్నాడు వరసిద్ది.

"అసలు పిల్లాడికి తిండే తగ్గిపోయిందిమామయ్యా! ఎవరి దిష్టి తగిలిందో..." బాధగా అంది లక్ష్మి.

"తాతయ్యా! నేను ఈ అమ్మాయిని చేసుకోవాలని డిసైడ్ అయ్యాను"మృదులని చూపిస్తూ అన్నాడు.

"అదేంటి? ఈషికలో లేనిది ఏమిటి? ఈ అమ్మాయిలో ఉన్నదేమిటి?" ఇంకా ఆశ చంపుకోలేక అడిగాడు వరసిద్ది.

"మీరు ఈ జన్మలో నాకు ఈషికని కుదర్చాలని చూస్తున్నారు. మిమ్మల్ని తప్పుపట్టటంలేదు. కానీ నాతో మృదులది జన్మజన్మల సంబంధం..."

"ఆ సంగతి నీకు ఎవరు చెప్పారు?"

"ఎవరూ చెప్పలేదు. ప్రేమసంకేతం తెలిపింది"

"అంటే?"

"నేను ఈ అమ్మాయిని టచ్ చేస్తే చాలు మెరుపులు మెరుస్తాయి..."

"ఏదీ ఒకసారి టచ్ చేసి చూపించు..." కచ్చిగా అన్నాడు వరసిద్ది. మృదుల గాభరా పడింది. ఇప్పుడు ఆమె దగ్గర మెరుపులు మెరిపించే మెషిన్ లేదు. ఉన్నా దాంట్లో బ్యాటరీ లేదు. అయితే ఆమె వద్దన్నా వినలేదు మురారి. అంటీ అంటనట్లు ఆమెని టచ్ చేశాడు.

ఎవరికీ మెరుపులు కనపడలేదు- మురారితో సహా!... "ఏవి మెరుపులు?" లా పాయింట్ తీసినట్లు అడిగాడు వరసిద్ది.

"అవి అందరికీ కనపడవు" కవర్ చేస్తూ అన్నాడు మురారి. "కనీసం నీకు కనిపించాయా?" మురారి వైపు చూస్తూ వదలకుండా రెట్టించాడు వరసిద్ది.

ఏమీ మాట్లాడలేదు మురారి. తన ప్రేమసంకేతం ఎందుకు ఫెయిలైందో అతనికి అర్థంకాలేదు. మళ్ళీ ఒకసారి మృదులని అంటుకుని చూశాడు. ఈసారి మరింత గట్టిగా... అయినా ఎలాంటి మెరుపులూ కనిపించలేదు. నిరాశగా 'నాకూ కనిపించలేదు...' అనబోయాడు. మృదుల మెడలో మెరుపు మెరిసింది. "కానీ, నాకు కనిపించాయి..." అంది.

మళ్ళీ మురారి మొహం వికసించింది. "చూశారా" అన్నట్లు అందరివైపు చూశాడు.

"ఇదేదో దేవతా వస్త్రాల కథలా ఉంది. ఎవరో ఒకరికే కనబడటం ఏమిటి? అసలు మెరుపులు కనిపిస్తున్నాయని రుజువేమిటి?" అడిగాడు వరసిద్ది.

"మీ మనవడే రుజువు... నిన్న అతనికి కనిపించాయో లేదో అడగండి" పూర్తి విశ్వాసంతో చెప్పింది.

"కనిపించాయి..." అన్నాడు మురారి.

"ఇక ఆపండి ఈ మెరుపుల గోల... వాళ్ళిద్దరికీ ఇష్టం అయింది. అది చాలదూ..." అంది ఈషిక.

అందరూ అంగీకారంగా తల ఊపారు.

ఇంతలో టైగర్ తనకు పెట్టిన తిండితినటం ముగించి 'రెడీ...' అన్నట్లు మొరిగింది.

"ముందు రమేష్‌గాడి సంగతి చూద్దాం... తరువాత తిరిగ్గా మిగిలిన విషయాలు మాట్లాడుకోవచ్చు" చెప్పాడు ఆదిత్య.

"వెళ్దాం పదండి..." అన్నాడు మురారి.

"మన కిరణ్‌గాడిని కూడా పిలుద్దాం... మనం దరిలో వాడే కాస్త అడ్వెంచరస్ టైప్" అని ఫోన్ చేశాడు ఆదిత్య. ఫోన్ ఎత్తాడు కిరణ్.

"ఏం చేస్తున్నావ్?" అడిగాడు ఆదిత్య.

## పొంతన ఉంది

'మా అబ్బాయి' ఫేమ్ చిత్ర శుక్లను ఎందరు గుర్తించారో కాని, ఇప్పుడు ఆమె మరో సినిమాకు సిద్ధమవుతున్నది.

'రంగుల రాట్నం'లో స్వతంత్ర భావాలుగల ఉద్యోగినిగా నటిస్తూ, పాత్రకు, తన నిజ జీవితానికి నడుమ బోల్డెంత పొంతన ఉందని చెప్తోంది.

"నా టాలీవుడ్ జర్నీ బావుంది. భాష నుంచి డైలాగ్ డెలివరీ దాకా అన్నీ నేర్చుకుంటున్నాను. నేనెప్పుడూ మా నాన్న దగ్గరనుంచి పాకెట్ మనీ తీసుకోలేదు. పిల్లలకు ట్యూషన్లు చెప్పి స్వంతంగా సంపాదించుకునేదాన్ని" అని తెలిపింది.




"వేడికాపడం పెట్టించుకున్నాను"

"ఎవరిచేత?"

"గారిచేత..."

"అదృష్టవంతుడివి"

"నువ్వుకూడా ఒళ్ళు చీరుకుపోయేలా కష్టపడితే ఆ తరువాత ఈ కాపడం సీన్ పెట్టుకోవచ్చు"

"మన రమేష్ తప్పిపోయి కొత్త సీన్ క్రియేట్ చేశాడు. అర్జెంటుగా ఇక్కడకి రా! వాడిని వెతకాలి" అన్నాడు ఆదిత్య.

"ఇదేమన్నా లండనా, పారిస్సా... తప్పిపోవటానికి" అన్నాడు కిరణ్.

"అయినను పోయిరావలె అడవికి..."

"అంటే?"

"ఇక్కడంతా గాభరాపడుతున్నారు. వాడు వచ్చే దాకా నీ రొమాంటిక్ కాపడానికి కాస్త విరామమిచ్చి ఇక్కడ ప్రత్యక్షం కావాలి..."

చెప్పినట్లే రెండు నిమిషాల్లో వచ్చాడు కిరణ్.

ఇంట్లోవాళ్ళందరూ ఆడవాళ్ళతో సహా వేటకి బయలుదేరారు.

"అంత అవసరం లేదు. వాడికి ఏమీకాదు. మేము తీసుకువస్తాంగా..." అని అందరికీ ధైర్యం చెప్పి... ఆదిత్య, కిరణ్, మురారి బయలుదేరారు. వారికి ముందు టైగర్ పరుగెత్తుతోంది.

"కాస్త మెల్లగా వెళ్ళవే!... నీ వేగాన్ని అందుకోలేకపోతున్నాము" అన్నాడు టైగర్‌తో మురారి. అదిమాత్రం తన వేగాన్ని ఏమాత్రం తగ్గించలేదు.

**స్నానం దేహాన్ని శుద్ధిచేస్తుంది. ధ్యానం బుద్ధిని శుద్ధిచేస్తుంది. ప్రార్థన ఆత్మను శుద్ధిచేస్తుంది. దానం సంపాదనను శుద్ధి చేస్తుంది. ఉపవాసం ఆరోగ్యాన్ని శుద్ధిచేస్తుంది. క్షమాపణ సంబంధాలను శుద్ధిచేస్తుంది.**

# హార్వర్డ్ సదస్సుకు యార్లగడ్డకు ఆహ్వానం



ప్రతి సంవత్సరం హార్వర్డ్ విశ్వవిద్యాలయ పట్ట భద్ర విద్యార్థులు నిర్వహించే ప్రతిష్ఠాత్మక భారత సదస్సును ఉద్దేశించి ప్రసంగించేందుకు ప్రముఖ రచయిత, కేంద్రీయ హిందీ సమితి సభ్యుడు డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌కు ఆహ్వానం అందింది.

ఈ ఏడాది ఫిబ్రవరి 10, 11 తేదీలలో బోస్టన్‌లో ఈ సదస్సు జరుగుతుంది. సమకాలీన భారత సాహిత్యం, భాషలు, గుర్తింపు, అవగాహన అనే అంశంపై ఆయన ప్రసంగిస్తారు.

అమెరికాలో భారతదేశంపై దృష్టి సారించి నిర్వహించే పెద్ద సదస్సులలో హార్వర్డ్ యూనివర్సిటీ పట్టభద్ర విద్యార్థులు నిర్వహించే సదస్సు ఒకటి. దాదాపు వెయ్యిమందిదాకా హాజరవుతారు.

డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ హిందీ, తెలుగు భాషల్లో ప్రముఖ రచయిత. మాజీ రాజ్యసభసభ్యుడు. సాహిత్యంలో చేసిన విశేషసేవకు గుర్తింపుగా సాహిత్య అకాడమీ, పద్మశ్రీ, పద్మభూషణ్ అవార్డులు ఆయనకు లభించాయి. ◆

"ఇదేంటి ఇలా అడవిలోకి వెళ్తుంది. అసలు మన రమేష్‌గాడికి ఈ అడవిలో ఏం పనంటావ్? ఎందుకు వెళ్ళుంటాడంటావ్?" అన్నాడు మురారి.

"వాడి బుర్రలో ఏం పురుగు పుట్టిందో?" అన్నాడు కిరణ్.

"వాడికి బుర్రలో పురుగు దూరే ఖాళీ కూడా లేదు. ఎవడన్నా ఎక్కిస్తేతప్ప..."చెప్పాడు ఆదిత్య.

"మీరేమీ అననంటే ఒక మాట చెప్తాను..." నసుగుతూ అన్నాడు కిరణ్.

"ఏంటో చెప్పు..." ఆయాసంతో ఆగుతూ అన్నాడు ఆదిత్య.

"నిన్న కోడిపందాల దగ్గర రమేష్ కనిపించాడు. అప్పుడు ఈ కుక్కమీద తన కోపాన్ని నాతో చెప్పుకున్నాడు..." అన్నాడు కిరణ్.

టైగర్ వెనక్కితిరిగి గుర్రుమంది. "దానిని కుక్క అనకూడదు. టైగర్ అనాలి..." చెప్పాడు మురారి.

"...అదేలే! ఈ టైగర్ తనని చిత్రహింస పెడుతోందనీ, దీని బాధని ఎలా అయినా వదిలించుకోవాలనీ అన్నాడు"

"వాడిలో ఈ కుక్కమీద..." అని, తనని తాను సవరించుకుని, "... సారీ!.. టైగర్‌మీద అంత కసి ఉందా?" ఆశ్చర్యంగా అన్నాడు ఆదిత్య. "మరి నువ్వేం అన్నావ్?"

"ఉత్తినే వదిలేస్తే వెనక్కివస్తుందేమో. మందు తాగించి మరీ వదిలెయ్యమని చెప్పాను" అన్నాడు కిరణ్.

"ఓరి దుర్మార్గుడా?..." అన్నాడు మురారి.

"అయితే, ఇంకేముంది... ఈ టైగర్ని అడవిలో వదిలెయ్యటానికి వెళ్ళుంటాడు. అక్కడ ఏం జరిగిందో కానీ, వాడే ఇరుక్కుపోయాడు" ఊహించి చెప్పాడు ఆదిత్య.

అవునన్నట్లు మొరిగింది టైగర్.

"అక్కడ ఏ ప్రమాదంలో ఇరుక్కున్నాడో" నిజంగానే ఆదుర్దాపడుతూ అన్నాడు కిరణ్.

"ఈ టైగర్ దారి తెలిసినట్లు సూటిగా వెళ్తోంది. అడవిలో ఇంత లోపలకి వచ్చాం. మనమైనా వెనక్కి వెళ్ళగలమా?" అన్నాడు మురారి.

"నువ్వొకడివి. నీ నోటికి మంచి మాటలే రావు" విసుక్కున్నాడు ఆదిత్య.

అందరూ ఒక కొండచరియ చివరికి చేరుకున్నారు. వీరికి దారి చూపిస్తున్న టైగర్ ఆగిపోయింది. అక్కడ నుండి కిందకు చూస్తోంది. అందరూ కాసేపు మాటలాపి నిశ్శబ్దంగా టైగర్ పక్కకి చేరి వాళ్ళుకూడా కిందకి చూశారు. అక్కడ కనిపిస్తున్న దృశ్యం చూసి వాళ్ళ నోరు ఎండిపోయినట్లయింది.

అక్కడ ఒకరు కాదు, ఇద్దరు కాదు పదులమంది కూలీలు తదేక దీక్షతో చెట్లుకొడుతున్నారు.

మరికొంతమంది కొట్టిన దుంగలను లారీల్లోకి చేరుస్తున్నారు.

"ఈ రాత్రికి మనం వెనక్కి వెళ్ళిపోవాలి. టైము లేదు. త్వరగా కొట్టండి" అని అందరినీ త్వరపరుస్తున్నాడు ఒక వ్యక్తి. అతని భుజానికి రైఫిల్ వేలాడుతోంది.



హాలీవుడ్‌లో సెక్స్ స్కాండల్స్ 25 ఏళ్ళకు బయటపడ్డాయి. బహుశా బాలీవుడ్ సెక్స్ స్కాండల్స్ బయటపడటానికి 50 ఏళ్ళు పడుతుందేమో. -శృతీసేథ్, నటి

అతని మొహం మీద గుబురుమీసాలు పూర్తిగా వ్యాపించి ఉన్నాయి-అచ్చు కిరణ్‌మొహం మీదలా.

"ఇదేదో పెద్ద స్మగ్లర్ల ముఠాలా ఉంది. ఇవన్నీ ఎర్రచందనం చెట్లు. వీటిని కొట్టడం నేరం..." గుసగుసగా చెప్పాడు మురారి.

ముగ్గురూ కాసేపు ఆలోచిస్తూ ఉండిపోయారు. టైగర్ కూడా సిట్యుయేషన్ అర్థంచేసుకున్నట్లు మౌనంగా ఉండిపోయింది. "వెనక్కి వెళ్ళి పోలీసులను పిలుచుకువద్దాం" అన్నాడు మురారి.

"అక్కడ ఉంది నీ చెల్లెల్ని ప్రేమించినవాడు. తీరిగ్గా పోలీసులను పిలుచుకువచ్చి విడిపించేలోపు వాడికి ఏమైనా హాని జరిగితే?" అతని అభిప్రాయాన్ని తోసిపుచ్చాడు ఆదిత్య.

కింద చెట్లు కొడుతున్నవాళ్ళలో ఒకడు తన చేతిలో ఉన్న గొడ్డలికిందపెట్టి బొబ్బలెక్కిన అరచేతిని చూసుకుని ఉఫ్ ఉఫ్... అని గాలి ఊదుకుంటున్నాడు. "వాడు రమేష్ కదూ" అన్నాడు మురారి.

అందరూ ఆ చెట్లు కొట్టేవాడిని చూశారు.

కాసేపటికి అతనిలో రమేష్ పోలికలు కనిపించాయి. ఇంతలో గుబురుమీసాల వ్యక్తి రమేష్ దగ్గరకు వెళ్ళి గదమాయించి మళ్ళీ పని మొదలుపెట్టించాడు.

"వాళ్ళు రమేష్‌చేత బలవంతంగా చెట్లు కొట్టిస్తున్నారు" చెప్పాడు ఆదిత్య.

"వాడి కండలు చూడు ఎలా ఉన్నాయో" అన్నాడు మురారి దినమణి కండలు చూపిస్తూ.

"నా కండలు మాత్రం తక్కువ ఉన్నాయా?" కండలు పొంగించి చూపిస్తూ అన్నాడు కిరణ్.

"ఇప్పుడు వాటితో పని వచ్చింది" అన్నాడు ఆదిత్య.

"నా కండలతో పనా?" అనుమానంగా ఆదిత్య వైపు చూస్తూ అన్నాడు కిరణ్.

"అవును. మా అందరిలోకీ నువ్వయితేనే వాళ్ళలో ఒకడిగా కలసిపోగలవు"

"ఇంకా నయం! పెళ్ళిచేసుకుందామనివస్తే చంపేస్తారా ఏమిటి?"

"ఫ్రెండుకోసం ఆ మాత్రం చెయ్యలేవా?" అతని మాట వినకుండా అతని ఒంటిమీద ఉన్న షర్టు తీసేస్తూ అన్నాడు ఆదిత్య.

"చాలా రోజుల తరువాత షర్టు వేసుకున్నా. దీన్ని కూడా ఒంటిమీద ఉంచరా?" బైటకు కిరణ్ అలా అంటున్నా నిజానికి అతను రమేష్‌ని కాపాడటానికి ఏ పని చేయటానికయినా రెడీగా ఉన్నాడు.

అందరూ కలసి ఇంకాస్త కిందకు దిగి ఘటనా స్థలానికి మరింత దగ్గరగా చేరుకున్నారు. అక్కడ ఉన్న గుబుర్లలోకి చేరారు.

"ఆ గుబురుమీసాలోడు కూలీలను ఎంత హింస పెడుతున్నాడో చూడు" అన్నాడు కిరణ్. వీళ్ళు చూస్తుండగానే దినమణి మరో నలుగురిని కొట్టీ, తిట్టీ, బెదిరించి చెట్లుకొట్టే ప్రక్రియను వేగవంతం చేశాడు. పావుగంట గడచిపోయింది.

**ఇంకా ఉంది**



# బహుళ గుణాలు



అనేక రకాలయిన పండ్లను దైనందిన ఆహారంలో భాగం చేసుకోవాలని మనం పదే పదే ప్రస్తావించుకునే జాబితాలో బొప్పాయిపండు ఆనవాళ్ళు తక్కువగా కనపడుతుంటాయి.

బొప్పాయి కొన్ని స్థానిక మార్కెట్లలో తరచూ కనపడకపోవడం ఇందుకు ఒక కారణమైతే,బొప్పాయి పండులో లభించే పోషకాలు, ఇతర వివరాలగురించిన సరైన అవగాహన లేకపోవడం మరో కారణం.

ప్రతిరోజూ తినే ఆహారంలో ఓ గిన్నెడు బొప్పాయి ముక్కల్ని జతచేయడంవలన కలిగే ప్రయోజనాలకు లెక్కే ఉండదు.

**జీర్ణశక్తి :** బొప్పాయి జీర్ణకారిగా పనిచేస్తుంది. జీర్ణశక్తిని మెరుగుపరచడంలో ముందుంటుంది. బొప్పాయిలో వుండే పపెయిన్ అనే ఎంజైమ్ పీచును బ్రేక్ చేయడమే కాకుండా జీర్ణవ్యవస్థకు ఆహారాన్ని ప్రాసెస్‌చేసుకోగల సామర్థ్యాన్ని అందిస్తుంది.జీవక్రియ నెమ్మదిగా గలవారికి ఇది చాలా ముఖ్యం.

**కంటికి వెలుగు :** బొప్పాయిలో బెటా-కెరోటిన్ అయిన కెరోటినాయిడ్ వుంటుంది. శరీరం దీనిని విటమిన్ 'ఎ'గా మార్చుకుంటుంది. కంటిఆరోగ్యానికి స్పష్టమైన దృష్టికి ఈ విటమిన్ తప్పనిసరి.

**చుండ్రు నివారిణి :** చుండ్రును తొలగించడంలో బొప్పాయి పండు బాగా పనిచేస్తుంది. రోజూకు ఒక్కసారి తింటూ, బొప్పాయి మాస్క్ వాడుతున్నట్లయితే భుజాలపై రాలే తెల్లని చుండ్రు పొలుసుల ఆనవాళ్ళు తగ్గిపోతాయి.

**చర్మకాంతి :** వార్ధక్య లక్షణాలను తగ్గించడంలో ముందుంటుంది. బొప్పాయిలోని పపెయిన్ ఎంజైమ్ చర్మంపై మృతకణాలను తొలగించడంలో ఉపకరిస్తుంది. ముఖానికి, శరీరానికి నేరుగా అప్లయ్ చేసినప్పుడు ఈ ఎంజైమ్ చర్మానికి కొత్త కాంతిని ఇవ్వడంద్వారా మరింతగా ఉపకరిస్తుంది.

వార్ధక్య ప్రక్రియను తిరగతోడదు కాని, ముందస్తు వార్ధక్యాన్ని మాత్రం తప్పనిసరిగా అడ్డుకుంటుంది. బొప్పాయి తొక్కతో చర్మముపై కొద్ది నిమిషాలు రుద్దితే చర్మం కాంతిగా, మృదువుగా మారుతుంది. బొప్పాయి, పాలు కలిపి రాస్తే మొటిమలు, మచ్చలు, బ్లాక్‌హెడ్స్ కూడా తగ్గిపోతాయి.

**గుండె ఆరోగ్యం :** ఆహారంలో బొప్పాయిని భాగం చేసుకోవడంవలన గుండెకు రక్తసరఫరా మెరుగై గుండెజబ్బుల రిస్క్ తగ్గిపోతుంది.




బొప్పాయిలోని యాంటీ ఆక్సిడెంట్, విటమిన్ 'ఇ', విటమిన్ 'సి'లు ఆర్టరీలలోని కొలెస్ట్రాల్ ఆక్సిడేషన్‌ను తగ్గిస్తాయి.

**వికారం:** మార్నింగ్ సిక్‌నెస్, మోషన్ సిక్‌నెస్, వికారంతో ఇబ్బందిపడే వారికి బొప్పాయి బాగా సాయపడుతుంది. పైనాపిల్ జ్యూస్‌తోకలిపి తీసుకోవడంవలన వికారాన్ని బాగా తగ్గిస్తుంది.

**బరువుకు చెక్ :** బరువు తగ్గాలని భావించే వారికి బొప్పాయి పండు మంచి స్నాక్ లేదా డిజర్ట్. పూర్తి పోషకాలు కలిగినటువంటి బొప్పాయిలో క్యాలరీలు తక్కువగా వుంటాయి. బొప్పాయిని కొంచెం తిన్నా కడుపు నిండినట్లు అనిపిస్తుంది.

**జలుబు నివారిణి :** క్రమంతప్పకుండా బొప్పాయిని తీసుకుంటుంటే శరీరానికి కావలసినంత విటమిన్ సి, విటమిన్ 'ఎ' అందుతాయి.

బొప్పాయి పండులో యాంటీ ఆక్సిడెంట్స్ కూడా ఎక్కువ. కాబట్టి అనారోగ్యాలను ఎదుర్కోగలిగిన సామర్థ్యం రోగనిరోధకవ్యవస్థకు లభిస్తుంది.

**డిటాక్స్ :** బొప్పాయి, బొప్పాయి గింజలు తీసుకోవడంవల్ల శరీరంనుంచి విషతుల్యాలు వెలికి వెళ్ళిపోతాయి. కొద్దిగా తిన్నప్పటికీ శరీరం డిటాక్స్‌కావడానికి ప్రభావవంతంగా ఉపకరిస్తుంది.

శరీరంలో ఎటువంటి టాక్సిన్లూ పేరుకోకుండా బొప్పాయి పరిరక్షిస్తుంది.

**నెలసరి నొప్పి :** బొప్పాయి గింజలను తినడంవలన మహిళల్లో నెలసరి నొప్పులు తగ్గుతాయన్న విశ్వాసం వుంది.

బొప్పాయి ఆకుల్లో తేనె కలుపుకుంటే ప్రయోజనం ఎక్కువ ఉంటుంది. కొంచెం తేనె కలుపుకోవడంవలన చేదు తగ్గుతుంది.

# కదిలే బొమ్మల కబుర్లు

Review

## కొడకా... కరుసైపోయావా?

ప్రపంచం మొత్తం గెలిచినవాడు చివరకు ఇంటివెనుక ఏదో అయ్యాడని, త్రివిక్రముడిగా తొలి అడుగు మాటల రచనపై-

మలి అడుగు కథారచనపై, ముచ్చటగా మూడో అడుగు దర్శకత్వంపై మోపి, విజయబావుటా ఎగరవేసిన దర్శకుడు ఆకెళ్ళ శ్రీనివాస్ అలియాస్ త్రివిక్రమ్ శ్రీనివాస్ చివరకు తానే బలి అయిపోయి పాతాళానికి దిగిపోయారు.

ఒకే ఒక్క సినిమా ఆయన ఇన్నాళ్ళూ సంపాదించిన కీర్తిప్రతిష్ఠలను తుంగలో తొక్కేసింది. హీరో మీద మమకారం పెంచుకుని, ప్రేక్షకులనుతక్కువ అంచనా వేసి, తాము ఏది చేస్తే, అదే మహాప్రసాదం అనుకుని, జనం కళ్ళకద్దేసుకుంటారని అనుకుంటే, కాలికింద తొక్కేసినంత పని చేసేశారు.

ఇదంతా ఈ వారం విడుదలయిన 'అజ్ఞాతవాసి' సినిమాగురించే.130 కోట్ల ఖర్చు. 150 కోట్ల అమ్మకాలు. త్రివిక్రమ్-పవన్‌కళ్యాణ్ కాంబినేషన్.

ఇద్దరు హీరోయిన్లు. బోలెడుమంది నటీనటులు. 24 గంటలు షోలు వేసుకునేందుకు ప్రభుత్వ అనుమతి. అన్నీ ఉన్నాయి. కానీ సినిమాలో సరైన కథలేదు. ఆ లోటుపూడ్చే కథనం లేదు.అణువణువునా తొంగిచూసిన నిర్లక్ష్యంతప్ప మరేదీ లేదు.

'అజ్ఞాతవాసి' కథ అస్సలు కొత్తది కాదు.తెలుగులో కమర్షియల్‌సినిమా పుట్టిననాటినుంచి అరిగిపోయిన లైన్‌నే. తండ్రి మరణానికి కారకులయినవారిపై పగ తీర్చుకోవడం. అయితే నేపథ్యం కొత్తదా అంటే అదీ కాదు. ఓ వ్యాపార సంస్థ. ఆ వ్యాపార సంస్థను చేజిక్కించుకోవడానికి పొంచివున్న గుంటనక్కలు.

బయట ఎక్కడినుంచో వచ్చిన హీరో. వాళ్ళ భరతం పట్టిన తీరు. కథ కొత్తది కాదు. దాని నేపథ్యం కొత్తదికాదు. మరి అలాంటప్పుడు ఇక మిగిలిన ఆశ అంతా కేవలం సన్నివేశాలమీదే.

అంటే ఆ సన్నివేశాలు అయినా కాస్త కొత్తగా, వినోదాత్మకంగా లేదా, ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలకు గురిచేసేలా ఉంటే బాగుండేది. కానీ ఒక్కటంటే ఒక్క సన్నివేశం ఆ స్థాయిలో ఉండదు.

అసలు సినిమా లైన్ వేరు. దాన్ని టేకప్ చేసిన విధానం వేరు. తల్లి పుట్టెడు దుఃఖంలో ఉంటుంది తానేమో, తన మొహంమీద మళ్ళీ చిరునవ్వు చూసుకోవడానికి వచ్చాడు.అలాంటప్పుడు అక్కడ కరుడుగట్టిన విలన్ ఉండాలి.

అడుగు వేస్తే పాతాళానికి జారిపోయే ఎత్తులు ఉండాలి. తేడా వస్తే తల తెగిపోయేంత వ్యవహారం ఉండాలి. కానీ అక్కడ ఏముంటుంది.సాదాసీదా థర్డ్‌గ్రేడ్ కామెడీ.అదికూడా కితకితలు పెట్టుకున్నా నవ్వురాని టైపు కామెడీ. అసలు దర్శకుడు ఎక్కడ ఆలోచిస్తూ ఈ సినిమాలో సీన్లు రాసుకున్నాడో అర్థం కాదు. హీరోయిన్ ఇంట్రడక్షన్ అయిన లావెట్రీ సీన్ ఒక్కటి చాలు ఇందుకుదాహరణగా చెప్పడానికి.

అంతకన్నా గొప్పగా హీరోయిన్‌ను సినిమాలో పరిచయం చేయలేకపోయాడు దర్శకుడు. ఇలా అడుగు అడుగునా దర్శకుడు నిర్లక్ష్యం అనండి, బాధ్యతారాహిత్యం అనండి, కాకపోతే చేతకానితనం అనండి. కనిపిస్తూనేవుంటుంది.

అందువల్ల 'అజ్ఞాతవాసి' సినిమా పరమగందరగోళంగా వుంటుంది. చాలా సీన్లు కామన్ ఆడియన్‌కు అర్థంకాని ఎత్తులో వుంటాయి.

హీరో ఇంట్రడక్షన్ ఫైట్ ఎందుకు జరిగింది అన్నదే అర్థంకాదు ఎవ్వరికీ.హీరో తల్లి సిఇఓగా వున్న కంపెనీలోకి ఏదో ఉద్యోగం పేరుతో తన గుర్తింపు దాచుకుని వెళ్ళడానికి హీరో పెద్ద ప్రహసనమే నడుపుతాడు ఓ చిన్న అపాయింట్‌మెంట్‌తో పోయేదానికి.

సినిమా మొత్తం హీరో చుట్టూ తిరుగుతుంది. హీరో తండ్రిని,సోదరుడిని అంత అద్భుతమైన స్కెచ్ చేసి చంపినవాడు, సినిమా మొత్తంమీద పరమ సన్నాసిలా కనిపిస్తాడు.

కోటేసుకుని, విగ్రహం పుష్టి అన్నట్లు కనిపించడం తప్ప, క్యారెక్టర్ బిల్డింగ్ అన్నదే లేదు. ఆ మాటకు వస్తే, ఆ క్యారెక్టర్‌నే కాదు, మరే క్యారెక్టర్ కూడా సరిగ్గా రూపకల్పన చేయనే లేదు. ఇలా చెప్పుకుంటూ పోతే అంతూపొంతూ వుండదు.

సముద్రంలో తెట్టంతా ఒకవైపు, తేట అంతా మరోవైపు వుంటుందని అంటారు. 'అజ్ఞాతవాసి' సినిమా మొత్తం తెట్టే తప్ప, తేట అన్నది కనిపించనే కనిపించదు. దీనికి హీరోగారు మరీనూ.

ఆయన ఫైట్లు చేయలేదు. పాటలకు డ్యాన్స్‌లు చేయలేదు. సినిమా టెక్నాలజీ వంటపట్టించుకున్న వారికి ఇట్టే తెలిసిపోతుంది, ఫైట్లలో క్లోజ్‌లకు పోజ్‌లు ఇవ్వడం మినహా, జరిగింది ఏమీలేదని.



### మిలమిల మెరుపులు

అందంగురించి కదిలిస్తే శ్రీమతి సమంత అనర్గళంగా కబుర్లు చెప్పింది.

"మిలమిల మెరిసిపోవాలని అందరూ కోరుకుంటారు. అందుకోసం కొన్ని ప్రయత్నాలు చేయాలి. యాపిల్ సిడార్ వెనిగర్ ఇందుకు భలేగా సహకరిస్తుంది. పరగడుపునే దీన్ని తాగడంవలన చాలా ప్రయోజనాలు ఉంటాయి.

ఇంకా దీంతో ఏవేం చేయవచ్చో తెలుసుకోవాలంటే గూగుల్‌లో వెతకవచ్చు. బోల్డెన్ని రెసిపీలు దొరుకుతాయి" అంటూ తన మెరుపుల మోము మరింత మెరిసేలా నవ్వులు వెదజల్లింది. ◆

### ఎలా ఆడుతున్నాయి?

- బాక్సాఫీస్‌ను కుమ్మేస్తుంది, కుదిపేస్తుందనుకున్న 'అజ్ఞాతవాసి' సినిమా రానేవచ్చింది. లెక్కకు మిక్కిలి స్క్రీన్‌ల్లో విడుదలైంది. 120 కోట్లమేరకు ప్రపంచ వ్యాప్తంగా అమ్మకాలు ఇంతా అంతా హడావుడి కాదు.కానీ ఏంజరిగింది. సినిమా ఢమాల్‌మంది.
- ఇక పండుగ టైమ్‌లో 'జై సింహా', 'గ్యాంగ్' సినిమాలు విడుదలయ్యాయి. 'జై సింహా' సినిమా ఫక్తు బాలయ్య సినిమాగా ఉంది.పండగ నాలుగు రోజులు దున్నుకునే అవకాశం ఉంది. ఆ తరువాత మాత్రం చూడాలి ఎలా ఉంటుందో.
- సూర్య 'గ్యాంగ్' సినిమాకు మంచి టాక్ వచ్చింది. కానీ సరిపడా థియేటర్లు లేవు. టాక్ బాగుందని వెళ్ళాలనుకున్నవారికి థియేటర్లు కనిపించలేదు. రాను రాను పెరుగుతాయేమో? ◆




ఇక పాటల్లో ఆయన అక్కడక్కడ అడుగులు మాత్రం వేశారు. ఒక్క కోటీశ్వర్రావా పాటలో తప్ప, కాలు కదిపిన పాపాన పోలేదు. ఇక డైలాగుల్లో చాలా వరకు సీన్లకు అతీతంగా వుంటాయి.

కామన్ ఆడియన్స్‌ను దృష్టిలో వుంచుకుని కాక, హీరో బిల్డప్ కోసం, హీరో రాజకీయ వ్యవహారాల కోసం డైలాగులు రాసుకున్నారు.

కథానాయికలు ఇద్దరికీ ఓ తీరూతెన్నూ ఉండదు. ఆ పాత్రలేమిటో? వెన్నెముక లేని వ్యక్తిత్వాలు ఏమిటో? విలన్ ఏమిటో? ఒక కంపెనీకి సిఇఓ కావాలంటే కేవలం మర్డర్లు మాత్రమే సాధిస్తాయని అనుకోవడం ఏమిటో?

సినిమాకు పెట్టిన ఖర్చు పుణ్యమా అని కేవలం భారీ చిత్రీకరణ మాత్రమే కనిపించింది. అదొక్కటే బాగుంది. నిజానికి ఈ సీన్ ఇలా వుండాలి.

ఇలా పండాలి అనేకన్నా, ఇలా భారీగా తీయాలి అనుకున్నట్లు కనిపిస్తుంది. అందుకే భారీతనం వచ్చిందితప్ప సీన్లకు నిండుతనం రాలేదు.

మూడు పాటలు బాగున్నాయి. కానీ హాలు బయట. చిత్రీకరణలో మూడు పాటలు నీరసమే. ఇలా వచ్చి, అలా అయిపోయినట్లు వుంటుంది.

సినిమా ఇంత ఘోరంగా ఉండడానికి కర్త, కర్మ, క్రియ దర్శకుడు, రచయిత త్రివిక్రమ్ శ్రీనివాస్‌నే కారణం తప్ప వేరుకాదు.

ఎందుకంటే ఆయన చిన్న దర్శకుడు కాదు, ఒత్తిడికి లోనై ఏదో చేశారు అనడానికి. ఆయన ఎవరి శాసనానికో లొంగే రకమూ కాదు. అందువల్ల ఈ అజ్ఞానానికి కారణం ఆయనే ముమ్మాటికీ.

120 మేరకు అమ్మకాలు సాగించిన సినిమా రెండో రోజు థియేటర్లు చూస్తే జనం భయపడే పరిస్థితి రావడానికి కారణం ముమ్మాటికీ త్రి...విక్రమే.

**ప్లస్‌పాయింట్స్...**
భారీతనం

**మైనస్‌పాయింట్స్...**
కథ, కథనం, హీరో, డైరెక్టర్

**పంచ్‌లైన్**
పేరులోనే 'వాసి' సినిమాలో కాదు ◆

## శుభారంభం

"తొలి తెలుగు సినిమాల్లోనే నందమూరి బాలకృష్ణగారితో కలిసి పనిచేయగల అవకాశం దక్కింది. ఇంతకంటే శుభారంభం ఏముంటుంది" అంటూ 'జైసింహా' తార నటాషాదోషి ఆనందంతో నందనవనమైపోతున్నది.

"నయనతార అంటే నాకు ఎంతో అభిమానం. ఆమెతో కలిసి నటించగలనని కలలో కూడా అనుకోలేదు. నేను పుట్టి పెరిగింది ముంబయ్‌లో.

చిన్నప్పుడు హిందీ సీరియల్స్‌లో నటించాను. రెండు మలయాళ సినిమాల్లో హీరోయిన్‌గా చేశాను. వైద్యవృత్తిలో స్థిరపడాలన్న కోరిక కూడా ఉంది" అంటూ సకల విశేషాలూ ఏకరువుపెట్టింది. ◆





## తరగని అందాలు

సింపుల్‌గా చీరకట్టినా, మోడరన్ దుస్తులు ధరించినా అనసూయ అందం విషయంలో ఓ మెట్టుపైనే వుంటుంది. అనసూయ గ్లామర్ డోస్ చూస్తుంటే ఇద్దరు పిల్లలకు అమ్మ అన్న సంగతి ఎవరికీ స్ఫురణకు రానే రాదు. ఇటు బుల్లితెరపై యాంకరింగ్‌లో, అటు వెండితెరపై ప్రత్యేక పాత్రలతో 'జబర్దస్త్'గా దూసుకుపోతున్నది.

ఫోటోషూట్‌లలో ఆమె ఇచ్చిన గ్లామర్ టచ్ చూసిన వారూ గుటకలు మింగేస్తున్నారు.

అన్నింట్లో సైచేయి అన్నట్లు హుషారు చేయడం ఆమె స్పెషాలిటీ ఏమో! ◆



Review

# ఇది బాలయ్య సినిమా




హీరో బాలకృష్ణ సినిమాఅంటే ఎలా ఉంటుందని సగటు ప్రేక్షకుడినడిగితే, ఏం చెబుతారు? బాలయ్య మార్క్ డైలాగ్‌లు, ఆయన మార్కు ఫైట్లు, ఆయన అభిమానులకు నచ్చే డ్యాన్స్‌లు.

వీటికోసం, వీటిచుట్టూ అల్లుకున్న కథ. అయితే ఒకటే కండిషన్ సినిమా కథనం కాస్త బోర్ కొట్టించకుండా వుంటే చాలు. అయితే ఈ సినిమా బాలయ్య ఫ్యాన్స్‌కోసంమాత్రమే అని డీఫాల్ట్ ట్యాగ్‌లైన్ వుంటుందనుకోండి. అది వేరే సంగతి.

సంక్రాంతి, భోగిపండుగలు రొటీన్‌నే.కానీ ఏటా కొత్తగా జరిపేసుకుంటాం. బాలయ్య ఫ్యాన్స్‌కూడా అంతే. ఆయన చిన్న పిల్లాడి మాదిరిగా నటించేస్తాడు. వీళ్ళు చిన్నపిల్లలమాదిరిగా ఆనందిస్తూ చూసేస్తారు. అందుకే ప్రతి సంక్రాంతికీ ఓ బాలయ్య సినిమా రివాజు. అలాంటి సినిమా మరోటి ఈ సంక్రాంతికి వచ్చింది. అదే 'జై సింహా'.

'జై సింహా' కథేం కొత్తది కాదు. కుంభకోణానికి పని వెదుక్కుంటూ వస్తాడు నరసింహం (బాలకృష్ణ). అతనివెంట ఓ చిన్నబాబు. అక్కడ ఓ ఎపిసోడ్.

అది నడిచిన తరువాత ఫ్లాష్‌బ్యాక్. ఫ్యాష్‌బ్యాక్‌లో నరసింహానికి ఓ ప్రేయసి (నయనతార). కానీ నరసింహం వైఖరి ఆమె తండ్రి (ప్రకాష్‌రాజ్)కు నచ్చదు. అందుకే నో పెళ్ళీగిళ్ళీ అంటాడు.

దాంతో నరసింహం త్యాగం చేసి, వేరే అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడు.అలాంటి టైమ్‌లో ఇద్దరు బిడ్డల్ని కని, అతగాడి భార్య చనిపోతుంది.

అదే సమయంలో తన ప్రేయసికూడా వేరే పెళ్ళి చేసుకుని, బిడ్డను కంటుంది. కానీ ఆ బిడ్డ చనిపోతుంది. దాంతో ప్రేయసికి తెలియకుండానే తన బిడ్డను ఇచ్చేస్తాడు. ఇలాంటి త్యాగాల కథకు, ఎప్పటిలాగే ఓ ఎమ్‌పీ కావాలనుకునే కుర్రాడు, వాడి తండ్రి, కుంభకోణంపై పెత్తనం చెలాయించే దాదాలాంటి క్యారెక్టర్లు ముడిపడివుంటాయి.

నిజానికి ఈ సినిమా కథను నడిపించేవి ఆ క్యారెక్టర్లే. అవి లేకుంటే విశాఖనుంచి కుంభకోణం వెళ్ళదు కథ. ఆ విలన్‌లు లేకుంటే మొదటి ప్రేమ విఫలం కాదు. ఆ విలన్లే లేకుంటే కథ కంచికి చేరదు.

ఇంతకీ ఇలాంటి కథ ఎలా వుంది అని అడిగితే, మళ్ళీ ఉపోద్ఘాతమే మరోసారి చెప్పాలి. ఎలా వుంటుంది. ఎ తరువాత బి, బి తరువాత సినిమా లైన్లో వచ్చినట్లు స్క్రీన్‌ప్లే మీటర్‌మీదే వుంటుంది.

ఆ సీన్లకు తగినట్లే డైలాగులు, బాలయ్య బాబు నటన వుంటుంది. ఆ సన్నివేశాలకు తగినట్లే ఫైట్లు వుంటాయి. వేటికవి అన్నీ బాగానే వుంటాయి.

కానీ రొటీన్‌గా వుంటాయి. కామెడీ ట్రాక్ మొత్తం 'చంద్రముఖి' సినిమా నుంచి లేపేసుకువచ్చి ఇక్కడ అతికించేశారు. ఫైట్లు చూస్తే బాలయ్య చేసేసినవే. మనం చూసేసినవే.

బాలయ్యకు మాత్రం చెల్లే ఆ డైలాగులు అన్నీ కూడా అలాంటివే. సినిమా చూపించకుండా డైలాగ్ చెబితే, ఇది బాలయ్యసినిమాలోదా? అని అడగడం గ్యారంటీ.

అయితే ఇలాంటి సినిమాలో కూడా ఓ ప్లస్ వుంది. సినిమా రొటీన్‌గా వుంటుంది కానీ బోర్ ఏమీ కొట్టదు. సగటు ప్రేక్షకుడు సినిమాను అలా అలా చూసేస్తాడు.

ఎక్కడా కుర్చీలోంచి లేచిపో అనేంత వుండదు. అందువల్ల సినిమాను పండుగ టైమ్‌లో మామూలు సినిమా ప్రేక్షకులు హాయిగా చూసేస్తారు.కానీ సినిమా అంటే కూసింత కొత్తదనం వుండాలి.

కూసింత భలేగా వుందనిపించాల... అనేవాళ్ళకు మాత్రం నచ్చదు. ఇలాంటి సినిమాలో బాలయ్య బాబు రెండురకాల పాత్రలను సునాయాసంగా చేసేశారు. ఈ ఏజ్‌లో బాలయ్య ఏంటీ? లవర్ బాయ్ ఏంటీ? అనే వాళ్ళను మినహాయిస్తే, ఆయనపాటికి ఆయన చేసేశాడు.

'అమ్మకుట్టి' పాటలో ఆయన చేసిన డ్యాన్స్‌లు బాలయ్య ఎనర్జీ ఇది అని చెబుతాయి.

కానీ అదే సమయంలో ఆయన భారీ శరీరం చూసి 'అవసరమా? ఆయనకు ఈ డ్యాన్స్‌లు' అనే వాళ్ళు పక్కనే వుంటారు. ఓ షేడ్‌లో మేకప్ అంత బాగోలేకపోయినా మరో షేడ్‌లో బాగున్నాడు.

నయనతార బాగుంది. బాగా చేసింది. హరిప్రియ ఓకె. మరో హీరోయిన్ నటాషా దోషికి సరైన పాత్రే లేదు. బ్రహ్మానందంను చూస్తే జాలేస్తుంది. ఈయనేనా? ఒకప్పటి కామెడీ కింగ్ అని. పైగా ఆ కామెడీ ట్రాక్ పరమ పాతది. ఎత్తుకువచ్చేసింది. సినిమాకు సాంకేతిక విలువలు బాగా అమరాయి.

రామ్‌లక్ష్మణ్ ఫైట్లు బాగున్నాయి. చిరంతన్ భట్ పాటలు, నేపథ్య సంగీతం బాగుంది.

బాలయ్య కోసం, బాలయ్య అభిమానులకోసం రత్నం రాసిన మాటలు బాగున్నాయి.

కానీ దర్శకుడు కె.ఎస్.రవికుమార్ కాస్త కొత్త కథ, కథనంకోసం వీటన్నింటినీ వాడివుంటే బాగుండేది. అది జరిగితే ఇది అందరి సినిమా అయ్యేది. అది జరగలేదు కాబట్టి బాలయ్య ఫ్యాన్స్‌కు మాత్రమే సినిమా అయింది.

**ప్లస్‌పాయింట్స్...**
సాంకేతిక విలువలు

**మైనస్‌పాయింట్స్...**
పాత కథ, కథనం

**పంఛ్‌లైన్**
ఫ్యాన్స్ పండుగ సినిమా



## ఎన్నెన్ని ఆశలు

మాంచి కాంబినేషన్ నడుమ నటించాను కాబట్టి తనకు మరింత మహర్దశ రాగలదని 'అజ్ఞాతవాసి'పైన అనుఇమ్మానుయేల్ బోల్డన్ని ఆశలు అల్లేసుకున్నది. అయితే సూర్యకాంతం పాత్ర ఆమెకు అంతగా వర్కౌట్ కాలేదనే చెప్పాలి.

అందం, నటన ఓకే అయినా ప్రేక్షకుల మదిలో పెద్దగా ఇమేజ్ సృష్టించుకోలేకపోయింది. అయినా సరే, పెద్ద నటుడు, పేరున్న దర్శకుడు- అంటూ అనుకుని, చెప్పుకుని సంబరపడిపోవడంతోనే సరిపుచ్చుకుంటున్నది. ప్రస్తుతం చేస్తున్న 'నాపేరు సూర్య' మరింత పేరు తేగలదేమో చూడాలి. ◆

## గురుదత్ (1925-1964)

# చివరి రోజుల్లో...

**ఉత్తమం అనిపించుకోవాలనే తపన గురుదత్‌కి అధికం. దానికి తగ్గట్టే సినీరంగంలో అద్భుతాలు సాధించాడు. తనని మించినవారులేరన్న గుర్తింపు. కాని జీవితంలో ఏదో లోటు. ఒంటరిగా పరుగు... మరెవరూ సమీపానికి రాలేనంతగా అందరినీ వెనక్కి నెట్టి పరుగులో గెలిచాడు. గెలుపు ముంగిట నిలబడి చూస్తే ఆహా అనటానికి అయినవారెవరూ కనిపించని పరిస్థితి.**

సినీ రంగాన్ని ఎంతగానో ప్రభావితం చేసిన దర్శకుడు గురుదత్. గురుదత్ మరణించి అర్ధశతాబ్దం దాటింది. అయినా సినీ దర్శకత్వ కళ విషయంలో ఆయనకు సాటిగా నిలవగలిగినవారు బహుతక్కువ అన్నది సినీరంగం మాట.

గురుదత్‌గా ప్రసిద్ధి చెందిన ఆయన అసలు పేరు వసంత్‌కుమార్ శివశంకర్ పదుకొనె.

నాటి మైసూర్ రాజ్యంలో జూలై 9, 1925న పుట్టాడు. తండ్రి హైస్కూల్ హెడ్మాస్టర్.

తల్లి ఒక మోస్తరు రచయిత్రి. అయితే ఆయన చిన్నతనంలోనే తల్లిదండ్రులు, వారి కుటుంబాల మధ్య విభేదాలవల్ల గురుదత్ కుటుంబం బెంగాల్‌లోని భవానిపూర్‌లో స్థిరపడింది.

బెంగాలీ భాష చక్కగా మాట్లాడే గురుదత్‌ని చూసినవారు ఆయన్ని బెంగాలీ అనే అనుకునేవారు. ఆర్థిక సమస్యలు, కుటుంబ సమస్యలతో గురుదత్ హైస్కూల్ స్థాయి విద్యను దాటలేదు.

ప్రారంభంలో చిన్నాచితకా ఉద్యోగాలు చేసినా చివరికి ఉదయశంకర్ కల్చరల్ సెంటర్‌లో చేరి ఆయన దగ్గర డ్యాన్స్ నేర్చుకున్నాడు. ఆ డ్యాన్స్ గురుదత్‌ని తన 19వ ఏట బొంబాయిలోని బాలీవుడ్ సినీపరిశ్రమకు తెచ్చింది.

ప్రభాత్ స్టూడియో నృత్య దర్శక శాఖలో చేశాడు. ఆ సమయంలోనే గురుదత్‌కి నటుడు దేవానంద్ పరిచయం అయ్యాడు.

దేవానంద్‌తో స్నేహం గురుదత్ సినీపరిశ్రమలో అవకాశాలు సంపాదించేందుకు దోహదపడింది.

2010లో సి.ఎన్.ఎన్. ప్రకటించిన ఆల్‌టైమ్ టాప్ ఆసియా ఖండ నటులు పాతికమందిలో వున్న పేరు గురుదత్‌ది. సుందర చిత్ర కావ్యాలను నిర్మించిన దర్శకుడిగా ఆయన్ని పేర్కొన్నారు.

దేవానంద్ నవకేతన్ బ్యానర్‌మీద సొంత సినిమాలు తియ్యదలచుకున్నప్పుడు గురుదత్‌ని దర్శకత్వంలోకి రమ్మన్నాడు. అలా దేవానంద్‌తో 'హమ్ ఏక్ హై'కోసం పనిచేశాడు.

ఆ తర్వాత మరికొన్ని సినిమాలకు సహాయకుడిగా పనిచేసిన గురుదత్ చివరికి 'బాజీ' అనే సినిమాతో 1951లో దర్శకుడయ్యాడు.

ఆ సినిమా హిట్ అయింది. బాలీవుడ్‌లో క్రైమ్ సినిమాలకు ట్రెండ్ సెట్టర్‌గా నిలిచింది.



'బాజీ' సినిమాలో నేపథ్య గాయని గీతారాయ్. ఆ సమయంలో ఆమెతో కలిగిన పరిచయం ప్రేమగా మారి 1953లో వారు వివాహం చేసుకున్నారు.వివాహం చేసుకున్న సంవత్సరంలోనే తన దర్శకత్వంలో తాను ముఖ్యపాత్ర వహించి 'బాజ్' నిర్మించాడు.

ఆ తర్వాత 'ఆర్-పార్' సినిమా సక్సెస్ గురుదత్‌కి మంచి గుర్తింపు తెచ్చింది. ఇక వరుసగా 'మిస్టర్ & మిసెస్ '55', 'సి.ఐ.డి.', 'ప్యాసా', 'కాగజ్ కి ఫూల్' సినిమాలు తీసి విజయం, గుర్తింపు పొందాడు.

అప్పటికి గురుదత్ వయసు 35 సంవత్సరాలలోపే. అంత చిన్నవయసులోనే అంత పెద్ద గుర్తింపు రావటమే కాదు, సినిమాని కథనంపరంగా, టేకింగ్‌పరంగా కొత్తమార్గంలోకి తీసుకువెళ్ళాడు.

క్లోజ్ అప్ షాట్స్‌ని అంత గొప్పగా కెమెరాలో మరెవరూ బంధించలేదు. 1956లో సి.ఐ.డి. సినిమా తీయటం గురుదత్ జీవితంలో ఒక గొప్ప మలుపు అయింది. ఆ సినిమాలో అందాల తార వహిదా రహమాన్ హీరోయిన్‌గా పరిచయం అయింది.

అప్పటికే వివాహితుడు అయిన గురుదత్ వహిదా రహమాన్‌తో ప్రేమలోపడ్డాడు. వారి ప్రేమవ్యవహారమే 'కాగజ్‌కి ఫూల్' సినిమాకి మూలమంటారు.

సినీ పరిశ్రమలోని ప్రేమ వ్యవహారంమీద తీసిన సినిమా అది. అందులో ప్రేమ విషాదంగా అంతమవుతుంది. సినిమా ఫ్లాప్ అయింది. జీవితంలో ఇబ్బందులు మొదలయ్యాయి.

ఎంతో ఎత్తుకు ఎదిగిన దర్శకుడు గురుదత్‌కి, ఎంతో గొప్పగా తీశాననుకున్న సినిమా ఫ్లాప్ అవటం ఒక పెద్దషాక్. అదే సమయంలో వహిదా రహమాన్‌తో పీకలలోతున ప్రేమలో పడున్నాడు.

వహిదా రహమాన్ కూడా గురుదత్‌ని ఇష్టపడింది. వారిద్దరి ప్రేమ వ్యవహారంపై బాలీవుడ్‌లో గుసగుసలు మొదలయ్యాయి. ఈ విషయం అతని భార్యకి చూచాయగా తెలిసింది.ఆమె విడాకులు తీసుకుని దూరంగా వెళ్ళిపోతానని బెదిరించింది.

గురుదత్ సినిమా దర్శకత్వం వదిలేస్తున్నట్టు ప్రకటించి సినిమా నిర్మాణం, నటనమాత్రం కొనసాగించాడు. 'ఫుల్‌మూన్', 'సాహిబ్ ఔర్ బీబీ', 'గులామ్' సినిమాలు తీశాడు.

అయితే ఆ సినిమాలవల్ల గురుదత్‌కి ప్రత్యేకంగా వచ్చిన పేరు లేకపోగా, దర్శకుడు కాకున్నా ప్రతి సీన్‌లో దర్శకత్వం విషయంలో జోక్యం చేసుకున్నాడన్న వివాదం వచ్చింది ఇండస్ట్రీలో. ఈలోగా భార్య గీతా విడిపోయింది.వహిదా రహమాన్‌తో ప్రేమ వ్యవహారం నీ ఇష్టం అంటూ వెళ్ళిపోయింది.

కట్టుకున్న భార్య వెళ్ళిపోయింది. కనీసం ప్రేమించిన వహిదా రహమాన్‌తో జీవితం పంచుకుందామంటే ఆమె క్రమంగా గురుదత్‌కి దూరంగా జరిగింది.

పుంజుకున్న తన కెరీర్‌కి వివాహం అడ్డనుకుందో లేక మరే కారణమో తెలియదు కాని వహిదా రహమాన్ గురుదత్‌ని వద్దనుకుంది. గురుదత్ జీవితంలో ఒంటరివాడు అయ్యాడు.

గురుదత్ మొదటినుండీ వృత్తిపరంగా చాలా నిక్కచ్చి మనిషి.షూటింగ్ సమయం, స్క్రిప్ట్ తయారీ లన్నింటిలో ఎంతో క్రమశిక్షణ. అంతా తానై చూసుకునేవాడు. అంతా పర్ఫెక్ట్‌గా వుండాలి. ఏం కొంచెం అటూ ఇటూ అయినా సహించలేడు.

ఉత్తమం అనిపించుకోవాలనే తపన గురుదత్‌కి అధికం. దానికి తగ్గట్టే సినీరంగంలో అద్భుతాలు సాధించాడు. తనని మించినవారులేరన్న గుర్తింపు.

కాని జీవితంలో ఏదో లోటు. ఒంటరిగా పరుగు... మరెవరూ సమీపానికి రాలేనంతగా అందరినీ వెనక్కి నెట్టి పరుగులో గెలిచాడు. గెలుపు ముంగిట నిలబడి చూస్తే ఆహా అనటానికి అయినవారెవరూ కనిపించని పరిస్థితి. ఆ మానసిక ఇబ్బందినుండి బయటపడేందుకు మత్తుపానీయాన్ని ఆశ్రయించాడు.

విపరీతంగా తాగాడు. జీవితంలో థ్రిల్ పోయింది. బతకటం అవసరమా అనే ఆలోచన వచ్చింది.

అలా తాగుతూ, ఆ కిక్‌కూడా సరిపోక నిద్ర మాత్రలు వేసుకుంటూ నిద్రరాని రాత్రులను అలా గడుపుతున్న గురుదత్ అక్టోబర్ 10,1964న ఇంటిలో తన మంచంమీద మృతజీవిగా పడి కనిపించాడు.

నిద్రమాత్రలు ఓవర్ డోస్ కాగా మరణించాడు అన్నారు. అది ఆత్మహత్య అన్నది చాలామంది నమ్మకం. గురుదత్ జీవితం, విజయం అతివేగంగా సాగింది. నలభైయ్యేళ్ళు నిండకుండానే వెళ్ళిపోయాడు గొప్ప క్రియేటివ్ సినీ దర్శకుడు జీవితాన్ని సరిగా డైరెక్షన్ చెయ్యలేక.

# ఈ శీర్షిక మీదే

**ఉత్తమ ప్రశ్నకు ₹500 ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి**

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం
**'కనుల' పండుగగా జరగనిది?**
శోభనం.

→ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు
**భలే బస్ కండక్టర్?**
తను కట్టించుకున్న ఇంటికి అత్యవసర ద్వారం పెట్టించుకోవడం.

→ వి.వి.ఎస్.మూర్తి, చొదిమెళ్ళ
**'మేడ్ ఫర్ ఈచ్ అదర్' ఎవరు?**
జీలకర్ర-బెల్లం.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం
**'లవ్' ఉన్నవాళ్ళు అడిగేది?**
'కుశ'లం.

→ డి.ఎస్.రాజు, విశాఖపట్నం
**వెర్రివేషాలు వెయ్యాలని ఎప్పుడు అనిపిస్తుంది?**
ఒంటరిగా నిలువుటద్దం ముందు నిలబడినప్పుడు.

## ఈ కార్టూన్ మీదే




→ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు
**నాడు, నేడూ...?**
నాడు వేలిముద్రవేస్తే చదువు రాదు అనేవారు, నేడు వేయకపోతే ఏదీ రాదు అంటున్నారు.

→ ఎమ్.రామచంద్ర, కదిరి
**సన్యాసికి కోపం కలిగేదెప్పుడు?**
ఎన్నికలలో ఓడిపోతే సన్యాసం పుచ్చుకుంటానని నాయకుడు అన్నప్పుడు.

→ బి.మాన్‌సింగ్‌నాయక్, కారంపూడి
**అమాయకపు నర్స్?**
'ఇంజక్షన్ చేసినచోట చేయొద్దన్నా'డని పేషెంట్‌ని రోజుకో గదికి లాక్కెళ్ళి చేసేది.

→ ఎస్.శంకరయ్య, కోసిగి
**బ్రహ్మచారి కామెంట్ ప్లీజ్?**
ఇంట్లో ఒంటరి. వీధిలో తుంటరి.

→ ఎల్.వి.మూర్తి, మార్టేరు
**దోమలు మ్యూజికల్ నైట్ పెడితే?**
మన పని కరతాళధ్వనులతో సరి.

→ పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
**ఇంటికి లేటుగా వచ్చిన భర్త అదిరిపడేదెప్పుడు?**
చెవిలో పువ్వు పెట్టుకుని భార్య తలుపు తీసినప్పుడు.

→ ఎమ్.కృష్ణ, కాకినాడ
**సృష్టికి ప్రతిసృష్టి చేసే మగాడికి చేతకానిది?**
పిల్లల్ని కనడం.

# B హ్యాపీ

"అన్ని వాహనాలు వేగంగా వస్తుంటే రోడ్డు మధ్యలో అలా నడుస్తున్నావు బతకాలని లేదా" అంటూ అరిచాడు ట్రాఫిక్ పోలీసు.

నాకేం కాదు...నా జీవితరేఖ జెర్రిగొడ్డులా భలేగా వుందని జ్యోతిష్కుడు చెప్పాడు అన్నాడు గర్వంగా. ఇంతలో లారీ కొట్టింది. ఆసుపత్రిపాలయ్యాడు.

ప్రాణంపోలేదు కాని పాతికలక్షలు వదిలాయి ట్రీట్‌మెంట్‌కి. జ్యోతిష్యాన్ని ఎలా అర్థంచేసుకోవాలో కూడా తెలిసివచ్చింది అతగాడికి.

"ఈ షేర్లు కొనండి లాభం వస్తాయని కొనిపించావు. ఇప్పుడు అవి పడిపోయాయి" అంటూ గొంతులేశాడు గుర్నాథం.

"లాభం వస్తుందని చెప్పానుగాని అది నీకు అన్నానా... బ్రోకర్‌కి ఎంత లాభం వచ్చిందో ఆలోచించు" అని తప్పుకున్నాడు షేర్ కన్సల్టెంట్.

రోజుకో వీధిలో వేదిక ఎక్కి ప్రసంగాలుచేసి వాటినన్నిటినీ లెక్కకట్టి పదివేలు దాటాయని, అది ఒక గొప్ప రికార్డు అని చెప్పుకునే కూర్మారావు తనకి తానే సన్మానం ఏర్పాటుచేసుకున్నాడు.

చివరికి ఆ సందర్భంగా అయిన ఖర్చు, సభకు వచ్చినవారి మాటలు విన్న తర్వాత ఆయన గొంతు దాదాపుగా మూగబోయింది.

"చూడండి ఆయనెవరో నన్నే మిడిగుడ్లు వేసుకుని గంటసేపటినుండి చూస్తున్నాడండీ" అంది ప్రొఫెసర్‌గారి భార్య. ఆయన మా యూనివర్సిటీ సైకాలజీ ప్రొఫెసర్‌గారే... పిచ్చివాళ్ళమీద పరిశోధనలు చెయ్యటంలో దిట్ట" అన్నాడు ప్రొఫెసర్.

రేపు చంద్రుడిమీదచక్కని ప్రసంగం వుంటుంది. అందరూ రావాలి అన్నాడు హెడ్మాస్టర్.

"అమ్మో, అంత దూరం వెళ్ళటానికి మా అమ్మ ఒప్పుకోదండీ" అంటూ కళ్ళనీరు పెట్టుకుంటూ నిలబడింది భవానీ.

మావాడిచేత చిల్లర దొంగతనాలు ఎలా మాన్పించాలో తెలియటంలేదే... ఇంట్లో ఏ మూల డబ్బులు పెట్టినా తీసేస్తున్నాడు అని వాపోయింది హైమావతి. భలేదానివే... వాడి క్లాస్ పుస్తకాల్లో పెట్టు... నేనదే చేస్తా అంటూ సలహా ఇచ్చింది పక్కింటి పద్మజ.

"మత్తు పానీయం తాగటంవల్ల లాభమా, నష్టమా" అని బార్‌లో ముగ్గురు చర్చకు దిగారు.

"ఫ్రీగా వస్తే లాభమేకదా" అన్నాడు అప్పటికే సగం బిగించిన ఓ తాగుబోతు.

**ఈ లోకంలో మనుషులకన్నా విలువైనవి ఏవీ లేవు...**
**అందుకే చిన్నచిన్నవాటికోసం మనుషులను దూరం చేసుకోవద్దు....! -వివేకానంద**

SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS AUTONAGAR VIJAYAWADA
RNI 38008 / 1984 REGD NO.VJ / 025 / 2018-20 L.NO.